The largest circulated Telugu Monthly

జనవరి
1990

# చతుర

రూ. 4/-



# అల్పాహారానికి ప్రియ తోడు-
# అద్వితీయమైన
# రుచులు జోడు!

ఎప్పుడైనా, ఎక్కడైనా... ప్రియ!

ఉదయం, మధ్యాహ్నం, రాత్రి -
ఏ వేళప్పుడయినా సరే,
అల్పాహారం, భోజనం, ఉపాహారం - ఏదైనా సరే,
ఇంటా బయటా - ఎక్కడైనా సరే,
ప్రియ పచ్చళ్ళుంటేనే అది బహురుచికరం!

నవకాయ పిండి వంటలెన్నున్నా
ప్రియ పచ్చళ్ళతోనే భోజనం పరిపూర్ణం!

మీ పళ్ళెంలో ప్రియ ఉంటేనే మీకు
సంతృప్తి సంతుష్టి!!

**ఎంతో రుచి... ఎంతో రుచి...**

# ప్రియ

• మామిడి • నిమ్మ • గోంగూర • అల్లం • టొమాటో
• పండుమిరప • పచ్చిమిరప • మిక్స్‌డ్ వెజిటబుల్.
పచ్చళ్ళన్నీ వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ లభిస్తాయి.






ఉషోదయ
ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్
(ప్రియ ఫుడ్స్ డివిజన్)
ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాదు-500 482.



# అన్యాయంపై సమీక్షలు

నవంబర్ 'చతుర'లో ప్రచురితమైన వాసమూర్తిగారి నవల 'అన్యాయంపై' మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## ప్రయోజనాత్మక నవల

ప్రథమ బహుమతి రు.100/-పొందిన సమీక్ష

"అన్యాయం" నవల ద్వారా ఈనాడు సమాజంలో జరుగుతున్న అన్యాయాలను ఎత్తి చూపి, పరిష్కారమార్గం కూడా చూపించారు రచయిత శ్రీ వాసమూర్తిగారు. బలవంతుల, ధనవంతుల ఆధిపత్యం పెచ్చుపెరిగిన ఈ సమాజంలో సామాన్య మానవుల, మహిళల బతుకు దినదినగండంగా ఉంది. రౌడీయిజం, రాక్షసత్వం కొలువుతీరిన ఈరోజులలో నవల లోని "దుష్ట చతుష్టయం"వంటివారిదుర్మార్గాలకు బలికాకుండా నిలవగలిగిన ఆడపిల్లలు అరుదు. 'శ్యామల'లాగ మొగ్గలాంటి దశలోనే అన్యాయమైపోయి, జీవితాన్ని అంతం చేసుకొనే ఆడపిల్లలే కోకొల్లలు. వీరి దోషం ఆవగింజంత లేకపోయినా శిక్ష అనుభవిస్తున్నారు.

రౌడీయిజానికి, గుండాయిజానికి ఎదురు నిలిచిన సహృదయులకు భూమిమీద నూకలు చెల్లినట్లే. అందువలననే నేడు చాలామంది పట్టించుకోకుండా, నిర్లిప్తంగా తయారవుతున్నారు. కొండంత [illegible] రౌడీయిజాన్ని ఎదిరించడానికి, గొప్ప [illegible]సం, పట్టుదల చాలని "శేఖరం" మేష్టారి పాత్ర నిరూపిస్తోంది. శారీరక దుర్బలత్వం, ధనలేమి అడ్డురావని దృఢమైన సంకల్పం ముందు ఎవరూ నిలువలేరని ఈయన తెలియచేస్తారు. అన్యాయాలను, అక్రమాలను అరికట్టగలిగిన వారే మృగ్యమవుతున్న సమాజంలో ప్రజలకు "సుబ్రమణ్యం"లాంటివారు కావాలి. స్వల్పమైన ఆదాయంతో, స్వతంత్ర జీవనం సాగిస్తూ సుబ్రమణ్యం దౌర్జన్యాన్ని దుర్మార్గమును ఎదుర్కొన్నతీరు ముదావహం.

వరప్రసాదరావు, దశరథ రామారావులాంటి తండ్రుల పెంపకము వలననే 'సురేష'లాంటివారు దారి తప్పుతున్నారు. వీరికి తమ 'హోదాలను పెంచుకోవడం తప్ప' పిల్లలను ఉత్తమంగా తీర్చిదిద్దడం తెలియదు. వీరి పెంపకం వలన, ఆధిక్యత వలన 'సురేష' లాంటి యువకులు చదువు, సంస్కారం మరిచి లోక కంటకులుగా ప్రవర్తిస్తున్నారు. "లక్ష్మీపతి"లాంటి పలాయనవాదులకు, స్వార్థపరులకు ప్రజల బాగోగులు అవసరం లేదు.

నేటి సమాజానికి దుర్గ లాంటి వీర వనితలు చాలా అవసరం. కార్యదీక్ష, ఆలోచన, అవగాహన, నిర్భయత్వం దుర్గ సొత్తు. కనుకనే సురేష్‌లాంటి దానవుడిని మానవుడిగా మార్చి సమాజానికి పనికి వచ్చే విధంగా తీర్చి దిద్దగలిగింది. ఒక పనికి పూనుకుంటే సాహసంతో పూర్తిచేయాలి. శేఖరం మేష్టారి పాత్ర మరింత చొరవగా, సాహసంగా, దుర్గలాగ ప్రవర్తిస్తే వన్నెకెక్కేది. అయితే నవలలోని కొన్ని సంఘటనలు సినిమాల్లో లాగా ఉన్నా సమాజానికి ప్రయో

ముఖచిత్రం & బొమ్మలు : భాస్కర్

జనాన్ని అందించగల నవల రాసిన రచయితకు కృతజ్ఞతలు.

— టి. కల్యాణి,పెదబొండపల్లి.

## ఓ మంచి ప్రయత్నం

**ద్వితీయ బహుమతి రు.75/-పొందిన సమీక్ష**

మానవత్వాన్ని మసిచేసే అమానుష శక్తులనెదిరించే తిరుగుబాటు బాటలో ఓ చిరుయత్నం వానమూర్తిగారి "అన్యాయం".

సురేష్‌వంటి సార్వభౌములూ, అతన్నాశ్రయించుకుని ఉండే పూర్ణచంద్రరావు వంటి కర్ణులూ, దుశ్శాసనుల వంటి నరసింహాలూ, శకుని వంటి నాగేంద్రాలూ మన వర్తమాన భారతంలో ఇందుగలరందులేరన్నట్లు అన్ని చోట్లా కనిపిస్తూనే ఉంటారు. ఐతే వారి దుష్కృత్యాల్ని ఎదిరించి నిలిచే శేఖరం మాస్టార్లూ, సుబ్రహ్మణ్యం, దుర్గలాంటి వారు ఎందరుంటారు? ఎవరో ఒకరు ఉండాలనేదే రచయిత ఆశయం. శతకోటి సంఖ్యలైనా 'ఒకటి'తోనే కదా మొదలయ్యేది.

శేఖరం మాస్టారు, సుబ్రహ్మణ్యం గాంధేయ వాద పద్ధతుల్లో ఆ దుష్టచతుష్టయపు అన్యాయాల్ని ప్రజలముందుకు తేవటమనేది వింతగా అనిపించినా అదొక ప్రయోగాత్మక ప్రయత్నం. నిన్నగాక మొన్న- ప్రేమించినవాడు చేసిన అన్యాయాన్ని 'మౌనపోరాటం' ద్వారా వెలుగులోకి తెచ్చి విజయం సాధించిన యువతి సబిత కథ తెలిసినదే. కాబట్టి ఒక సామాన్యమైన డోర్‌టుడోర్ వెండర్ ఇంత సంచలనం సృష్టిస్తాడంటే ఆశ్చర్యమేం లేదు. పైగా తన మంచితనంతో నలుగురితో గల పరిచయాలను సుబ్రహ్మణ్యం తన ఉద్యమంలో ప్రతిభావంతంగా ఉపయోగించుకున్నాడు.

ఐతే, కథలో కొంత డ్రామాను ప్రవేశపెట్టి రచయిత కథయొక్క సీరియస్‌నెస్‌ను తగ్గించారేమోనన్పిస్తుంది. మొరటుతనమూ, నిర్దాక్షిణ్యమూ మూర్తీభవించిన 'రారాజు' సురేష్ రాజకీయాల్లో చేరినంతమాత్రాన అతి మంచి బాలుడిగా మారిపోవటం ఆశ్చర్యంగా ఉంది. పైగా ఈనాటి రాజకీయుల 'మంచితనం' ఏమిటో మనకు తెలియనిది కాదు. చివర్లో సురేష్‌లో హడావిడిగా మార్పుతెచ్చి, రచయిత తన పని సుగమం చేసుకుని కాగల కార్యం అంతా అతనిచేతే చేయించేసి శేఖరం మాస్టారు, సుబ్రహ్మణ్యం, దుర్గల పోరాటపటిమను బలవంతంగా తగ్గించేశారేమోనన్పిస్తుంది. ఈ సందర్భంగా పేర్కొన్న ఉదాహరణలు - పెద్దయెత్తున దేశవ్యాప్తంగా జరిగే ఉద్యమాల్లో సంభవమేమోగాని ఈ స్వల్పమైన కథా పరిధిలో అది సాధ్యం కాకపోవచ్చు. దాదాపు ముప్పావు భాగం వరకూ శేఖరం మాస్టారితో కథ చెప్పించిన రచయిత హఠాత్తుగా తనే ఎందుకు రంగప్రవేశం చేయవలసివచ్చిందో అర్థంకాదు.

కొన్ని పరిహరించదగిన చిన్న లోపాలున్నా ఒక కొత్త ఆలోచనా దృక్పథం వైపు పాఠకుల దృష్టిని మరల్చగలిగిన వానమూర్తిగారు అభినందనీయులు. ఒకచోట రచయిత అన్నట్లు "ఊరికే పుస్తకాలు చదివి పారెయ్యడం కాదు, ఆ చదివినదానిని గురించి ఆలోచించడం, దానిని జీవితానికి సమన్వయం చేసుకోవడం ముఖ్యం" అప్పుడే వానమూర్తిగారి వంటి రచయితల రచనలకి ప్రయోజకత్వం.

— మేడేపల్లి శేషు, తిరుపతి.

## గాంధేయ మార్గంలో...

**తృతీయ బహుమతి రు.50/-పొందిన సమీక్ష**

నేటి హింసాయుత రాజకీయ సమాజంలో కూడా గాంధేయ విధానాలు చక్కటి ఫలితాల్ని అందించగలవన్న సందేశాన్ని అందించ ప్రయత్నించిన నవల 'అన్యాయం'.

శ్యామల మరణం శేఖరం మాస్టారి హృదయాన్ని కదిలించి అందుకు బాధ్యులైన దుర్మార్గుల దురాగతాలను అరికట్టే కార్యానికి శ్రీకారంచుడితే, ఆ స్ఫూర్తితో మరో ముందడుగు వే? మాస్టారు తలపెట్టిన కార్యానికి ఒక స్పష్టమైన రూపాన్నిచ్చి, లక్ష్యసిద్ధికై కృషిచేసిన శ్రమజీవి సుబ్రమణ్యం, సత్కార్యాచరణలో తాము పురుమలకే మాత్రం తీసిపోమని, తనవంతు కార్యాన్ని బాధ్యతతో స్వీకరించి మాస్టారి మహదాశయ సాధనకు పరిపూర్ణత్వాన్ని ఆపాదించిన నారి దుర్గ. ముగ్గురూ "బక్కజీవులే",



చతుర ... 5

''నిర్భులులే'', ''సామాన్యులే'', అయితే వారి ఆశయం అసామాన్యమైనది. అందుకు వారు అవలంబించిన మార్గం అనువమానమైనది అందుకే వారు 'బలవంతులై' కార్యసాధకులైనారు.

**ధనవంతుల**, రాజకీయ బలవంతుల ప్ర**మేయంతో** ఏర్పడిన ప్రజాసమస్యల పరిష్కా**రానికి దుర్గ, శేఖరం** మాష్టార్లు యువరాజకీయ నాయకుడు సురేష్ సహకారంకోరడం వారు తమ లక్ష్యసాధనకై రాజీపడ్డారేమోనన్న అనుమానం రేకెత్తించినప్పటికి, మారిన సురేష్ వ్యక్తిత్వాన్ని దృష్టిలోపెట్టుకుంటే అదేమీ దోషంగా అన్పించదు.

ప్రచ్ఛన్న మృష్టాన్న భోజన నిరాహారదీక్షలతో, బలవంతపు బంద్‌లతో గాంధేయ సాధనాలు అపహాస్యమౌతున్న తరుణంలో సత్యాగ్రహోద్యమాన్ని త్రికరణ శుద్ధిగా చేపట్టి, కలుషిత రాజకీయ వాతావరణంలో కొనసాగించడం, సత్ఫలితాలను ఆశించడం నిజంగా దుస్సాహసమే! అయితే ఎనలేని పట్టుదల, సత్సంకల్పసాధనకై రాజీపడని వ్యక్తిత్వంవుంటే ఎటువంటి అవరోధాలనైనా ఎదుర్కొని లక్ష్యసిద్ధి పొందవచ్చునని చెప్పడంలో రచయిత శ్రీ వాసమూర్తిగారు సఫలీకృతులైనారనడంలో సందేహం లేదు.

— యర్రా విజయలక్ష్మి, హైదరాబాదు.

## దర్పణం

*రు. 25/- బహుమతి పొందిన సమీక్ష*

**వా**సమూర్తిగారి ''అన్యాయం'' నవల మొదటి పేజీల్లో ఉపోద్ఘాతం ఎక్కువై కొద్దిపాటి విసుగును కలిగించినప్పటికీ కథలోకి సాగినప్పటి నుంచీ ఆసక్తిదాయకంగా, వాస్తవానికి దగ్గరగా ఉంది. నిజానికి ఈ నవల మన సమాజంలో జరిగే అన్యాయాలకూ, దౌర్జన్యాలకూ అద్దంపట్టింది.

అన్యాయం జరుగుతున్నదని తెలుసుకోలేనివారు కొందరయితే తెలిసే ఉదాసీనత అవలంబించేవారు మరికొందరు. అన్యాయాన్ని ఎదిరించటమంటే హింస, ఆస్థినష్టం, రాజకీయశక్తుల జోక్యంతో అసలు సమస్య మూలనచేరటం - ఇదీ నేటి ధోరణి. ఇలాంటి పరిస్థితులలో గాంధేయ మార్గంలో గమ్యాన్ని చేరుకోవాలనే సుబ్రహ్మణ్యం ప్రయత్నం, అతనికి ప్రేరణా, ప్రోత్సాహం ఇచ్చిన శేఖరం మాష్టారి దీక్ష హర్షించదగినవి.

సమస్యలకు ఆత్మహత్యే పరిష్కారం అనుకునే శ్యామలలాంటి బేలయువతులూ, ఏదో ఒకవిధంగా ధనార్జనచేసి తనూ, తన కుంటుంబం సుఖంగా ఉంటే చాలనుకొనే లక్ష్మీపతిలాంటి అవకాశవాదులు ఎక్కువగా ఉన్న సమాజంలో మానవతకు మనుగడ ఉండాలన్నా, మార్పు రావాలన్నా సుబ్రహ్మణ్యంలాంటి వివేకం, విచక్షణాజ్ఞానం ఉన్న కార్యశీలురూ, శేఖరం మాష్టారులాంటి స్ఫూర్తిదాయకులూ ఎంతో అవసరం.

నవలలో మనని ఎంతగానో ఆకర్షించి, ఈతరం యువతులకు ఆదర్శంగానిలచే పాత్ర దుర్గ. అన్యాయాన్ని ఎదిరించాలనే ఆమె దృఢదీక్ష, ఆ మార్గంలో ఎన్ని కష్టాలెదురైనా మొక్కవోని ఆమె ఆత్మస్థైర్యం అనుసరణీయాలు. శేఖరం మాష్టారు, దుర్గలాంటివారు సానపట్టిన వజ్రంలా ప్రకాశించే తమ వ్యక్తిత్వపు వెలుగుతో సురేశ్‌లాంటి దుర్మార్గులలో సైతం పరివర్తనతేగలరు.

నేటి రౌడీలు, గూండాలరాజ్యంలో దుర్గ, సుబ్రహ్మణ్యం, శేఖరం మాష్టారులాంటి వ్యక్తులు ఉండాలనీ; వారున్నంతకాలం అన్యాయాన్ని, దౌర్జన్యాన్నీ ఎదిరించాలనే తపన, కృషి ఆగిపోవనీ ఒక నగ్నసత్యాన్ని రచయిత తెలియజేశారు.

— ముదిగొండ కౌముది సికింద్రాబాద్

## సాంఘిక స్ఫూర్తి

*రు. 25/- బహుమతి పొందిన సమీక్ష*

**జనజీవన** స్రవంతిలో రౌడీయిజం భాగం అయిపోయింది. సంఘ నియంతగా వ్యవస్థకి సమాంతర రీతిలో వికృత విన్యాసం చేసే ఈ పవర్‌గేమ్‌లో సామాన్యుడు నలిగిపోతున్నాడు; విసిగిపోతున్నాడు.... తిరగబడుతున్నాడు, చివరకు చచ్చిపోతున్నాడు. అలాటి సామాన్యుడు అసామాన్యరీతిలో ఎదుర్కొన్న ''అ





న్యాయం" ఇతివృత్తంగా ఎంచుకుని హృద్యంగా మలిచారు వాసమూర్తి. హింసాత్మక ధోరణులు ప్రబలి అభద్రతా భావం ఆవరించిన సామాన్యుడి సంఘర్షణ.... ప్రతి అక్షరంలో ప్రస్ఫుటమౌతుంది ఈ నవలలో.

శేఖరం మాష్టారు పాత్రలో సంఘర్షణాత్మక ప్రవృత్తి, లక్ష్మీపతి పలాయనవాదం, సుబ్రమణ్యం పాత్రలో సైద్ధాంతిక నిబద్ధత ఇలా.... విభిన్న దృక్పథాలనుండి సాగే విశ్లేషణ పాఠకుల్ని ఆలోచింపచేస్తుంది.

"నాకు బతికే హక్కులేదా" అంటూ మరణ శయ్యపై మాష్టారును నిలదీసిన శ్యామల ప్రశ్న ప్రస్తుత వ్యవస్థలోని అభద్రతా భావనైరాశ్యానికి పరాకాష్ఠ. సాయంత్రమయితే వీధి సెంటర్లలో కాపుకాసి అమ్మాయిల అహంతో ఆడుకునే అబ్బాయిలు.... ఏదో.... వయసు వేడిలెమ్మని ఆనందంగా ఆత్మవంచన చేసుకునే పెద్దాళ్లు, పరిస్థితులు వికటిస్తే ప్రెస్టేజ్ ఇష్యూ గుర్తొచ్చే హిపోక్రెట్‌లు.... ఇలా విభిన్న పాత్రల నేపథ్యంలో రౌడీయిజం అసలు రంగును బయట పెట్టారు.

ప్రతినాయకుడైన సురేష్‌లో హఠాత్తుగా కలిగే (ల్గించిన) మార్పును రచయిత సరిగా ఎస్టాబ్లిష్ చేయలేకపోయారు. నవల ఉపసంహారపు చివరి నిముషాల్లో సురేష్‌లో కల్గే మార్పు నాటకీయంగా ఉండటంతో నవల పేలవంగా ముగిసిందనే చెప్పాలి.

దుర్గ పాత్ర చిత్రీకరణలో కొంత అస్పష్టత కన్పిస్తుంది. శత్రువుని ఉపయోగించుకోగల నేర్పు వెనుక శత్రువు వ్యూహాన్ని అంచనావేయలేక ... అది మానవత్వమే సుమీ అని సరిపెట్టుకుని ఆనందపడటం శేఖరం పాత్ర ఔన్నత్యాన్ని ప్రశ్నిస్తుంది. నవల పూర్తయినా పాఠకుడికి సురేష్‌మీద అనుమానమే మిగులుతుంది. నిదానమైన శైలితో ఉద్వేగానికి తావివ్వనిరీతిలో ఏంజరుగుతుందో అన్న ఉత్కంఠకన్నా జరుగుతున్నది అర్థంచేసుకుంటూ ముందుకుసాగటం సబ్జెక్టులోని సహజతకు ప్రమాణం. ఏదియేమైనా సాంఘికస్ఫూర్తితో రచయిత సల్పిన ప్రయత్నం అభినందనీయం.

– రాఘవరావు, ఏలూరు.

## పరిష్కారం

**రు. 25/- బహుమతి పొందిన సమీక్ష**

ప్రయోజనాత్మక రచనలకూ, ఉద్బోధించే నవలా ప్రచురణలకూ పెట్టింది పేరైన.... సమగ్ర ప్రయోగ వేదిక 'చతుర' నుంచి వచ్చిన మరో అత్యుత్తమ నవలే 'అన్యాయం'.

'హింసకు హింస', 'రక్తానికి రక్తం' నినాదాలతో, వివాదాస్పద మార్గంలో, అయోమయ సిద్ధాంతాల వర్గంలో పయనిస్తోన్న నేటి ఉడుకు నెత్తురు యువ ప్రపంచం అత్యావశ్యకంగా పఠించవలసిన నవల 'అన్యాయం'.

ఈ ప్రపంచంలో, చెడు తాత్కాలికంగా విజయం సాధించినా, చివరికి మంచియే దిగ్విజయం సాధిస్తుందని, ప్రతి వ్యక్తి తన చుట్టూ జరుగుతున్న అవినీతి, అన్యాయాలకు తగురీతిలో ప్రతిస్పందించి బాధ్యతగల పౌరుడిగా తన వంతు కృషిచేసి, వ్యవస్థ సుస్థిరతకోసం పాటుబడాలని ఉపదేశిస్తుంది 'అన్యాయం'.

మంచితనంతో ఏదైనా సాధించవచ్చునని శేఖరం మాష్టారు, సుబ్రమణ్యం, దుర్గ పాత్రల ద్వారా, చివరికి ఎంతటి కఠినాత్ములైనా 'మంచి' ప్రభావానికి లొంగిపోకతప్పదని సురేష్ పాత్రద్వారా చెబుతూ, ఈ సమాజంలో ఇంకా మానవత్వానికి ఒక విలువ, తగు స్థాయి వున్నాయని ఎలుగెత్తి చాటిన 'అన్యాయం' 'చతుర' ద్వారా రావడం అభినందనీయం. రచయితకూ, 'చతుర'కూ ధన్యవాదాలు. ఇక కథనం ఆసాంతమూ చక్కని సరళమైన, సులభమైన శైలితో సాగడంవల్ల చాలారోజులకు ఓ ఉత్తమ నవల చదివామనే అభిప్రాయం పాఠకులకు ఏర్పడుతుందనడంలో అతిశయోక్తి లేదు. సమకాలీన విషమ పరిస్థితులకు పరిష్కారంగా రచయిత పరోక్షంగా 'అన్యాయం' ద్వారా చెప్పారు. ఆచరించి, విజయవంతం చేయడం- చివరికి ప్రజల వంతు, బాధ్యత... అంతే!

– జి.జి. ప్రసాద్, రామవరం.



# చతుర

సంపుటి: 12 జనవరి 1990 సంచిక: 12

"ఈ ఉద్యమం అవసరమేనని నా నమ్మకం. దీనిని విద్యార్థుల ఉద్యమంగానే ఉంచాలని శాయశక్తులా ప్రయత్నించాను. అవతలివాడు దీనిని స్వంతం చేసుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. ఇది బలపడేదాకా నా అవసరం వాడికి ఉంది. వాడు వేసిన ఎత్తుకు లొంగుతున్నట్లే లొంగి వాడి ప్రయోజనం నెరవేరకుండా చెయ్యాలనే నా ప్రయత్నం. మంత్రితో బల్లకి అటూ ఇటూ కూర్చున్నంతమాత్రాన మన డిమాండ్లు ఒప్పేసుకున్నట్టేం కాదు. అదే అంకుల్‌తోనూ చెప్పాను. నా ప్రయత్నం ఎలా పరిణమిస్తుందో అంత సులువుగా చెప్పలేం రమా" అంటూ ఆగాడతను.

ఏదో సాధించాలని అతనూ, అతని మార్గాన్ని మళ్ళించాలని ఇటు ఆప్తులూ, అటు ప్రత్యర్థులూ ప్రయత్నిస్తున్నారు.




జరుగుతున్న పరిణామాలూ, తెరవెనుక ఉదంతాలూ ప్రశ్నార్థకాలుగా, ఆశ్చర్యార్థకాలుగా మిగిలే ఈ పరిస్థితులపై ఎలాంటి వత్తిళ్ళున్నాయి? ఎవరెవరి ప్రభావాలున్నాయి? చివరకి ఫలితాలెలా వచ్చాయి? ఇంతకీ అతను సాధించదల్చుకున్నదేమిటి?

వర్తమాన సాంఘిక, రాజకీయ స్థితిగతులకు దర్పణంపడుతూ అందులో భాగంగా విద్యారంగాన్ని పరిచయం చేస్తూ సాగిన 'వివినమూర్తి' నవల 'ఉద్యమం' ఈ నెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల.

"వాసు ఇంకా రాలేదా?"

ఇంట్లో అడుగుపెడుతూనే అడిగాడు సీతారాం.

ముందుహాల్లోనే ఎదురైన శారద మొహంలోని ఆందోళనా, బాధా అతని ప్రశ్నకి జవాబయింది. సోఫాలో కూలబడి షైమిడిని వదులుచేసుకుంటూ అడిగాడు-

"ఎప్పుడు వెళ్ళాడూ?"

"పొద్దుట మీరు ఆఫీసుకు వెళ్లగానే వాడూ వెళ్ళాడు-"

"ఆమాత్రానికే ఆఫీసుకు ఫోన్ చెయ్యాలా?"

శారద జవాబివ్వలేదు

"రోజూ బయటికి వెళ్తుంటాడుగదా!"

"మధ్యాహ్నం భోంచేశాకే వెళ్తూంటాడు-"

సీతారాం ఆమె మొహంలోకి చూశాడు.

"మీరు.. మీరు.. వెళ్ళిపోయాక వాడు తలుపులు బిగించుకుని కూర్చున్నాడు..." దుఃఖాన్ని గొంతులో అణచిపెట్టటానికి ప్రయత్నిస్తోంది శారద.

"ఏడుపెందుకూ.. వాడే వస్తాడు-"

శారద దుఃఖం కట్టలుతెంచుకుంది. కొంగు నోట్లోపెట్టుకుని వలవలా ఏడవసాగింది.

సీతారాం మెల్లగా ఆమెను సమీపించి- "ఏడవకు.. ఏడవకు.." అంటున్నాడు. లోపలున్న రాధ ముందుగదిలోకి వచ్చింది. చేతిలో మీత్ అండ్ బూన్ పుస్తకమొకటి తొంగిచూస్తోంది. తండ్రి కనబడగానే కొంచెం వెనక్కితగ్గింది.

"మమ్మీకి మంచినీళ్ళు తీసుకురా-"

మంచినీళ్ళు తాగాక తనని తాను అదుపులోకి తెచ్చుకుంది శారద.

"అన్నయ్య ఫ్రెండ్సెవరన్నా తెలుసా నీకూ?"

"వేణు తరచుగా వస్తుంటాడు డాడీ!"

"సన్నగా పొడుగ్గా ఉంటాడు. అతనా?"

"అవునండీ!"

"ఎక్కడుంటాడూ?"

"పూర్ణిమాటాకీస్ దగ్గర"

సీతారాం తలపంకించి వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు. రాధ మరేమయినా అడుగుతారా అన్నట్టు కొంతసేపు ఎదురుచూసి లోపలికి వెళ్ళి అద్దంలోకి చూసి జుత్తు ఓమారు దువ్వుకుంది. మంచంమీదవాలి పుస్తకం తెరిచింది.

సీతారాం ఆలోచన తెమిలాక ఫోనువయిపు నడిచాడు.

"అన్నయ్యకా?" అంది.

అవునన్నట్లుగా తలూపుతూ "నువ్వు ఫోన్ చేశావా?" అడిగాడు.

జవాబుగా ఆమె తల ఊపటంగాని, మొహంలో కదులుతున్న భయాందోళనల్నిగాని అతను గమనించలేదు.

ఫోన్ కనెక్టయింది.

"రాజూ! నేను..."

"వాసు ఇంకా రాలేదా?"

"లేదు... శారద బెంగపెట్టేసుకుంది"

"నీకు బెంగలేదా!"

సీతారాం జవాబివ్వలేదు.

"మనసుపాడయి ఎక్కడ తిరుగుతున్నాడో! వాడే వస్తాడు-"

"అదే అన్నాను శారదతో. కష్టపడ్డాడూ ఫెయిలవడమేంటీ అంటోంది"

"ఏమయినా అన్నావా వాడినీ?"

మీ చెల్లెలు అన్నీ చెప్పేసిందన్నమాట అందామనుకున్నాడు సీతారాం.

"ఈరోజులూ ఈ పిల్లలూ వేరు. నువ్వెంత కష్టపడయినా పెంచాల్సిందేతప్ప చిన్నమాటంటే భరించలేరు

64 ఫిబ్రవరి 12 గుర్తుందా?"

ఆరోజున తండ్రి తనను మందలించాడు... కాదు- తిట్టాడు. తాను యిల్లు విడిచి కలకత్తా పారిపోయాడు. పదిహేనురోజులయాక మొదటిసారిగా రాజుకే ఉత్తరం రాశాడు.

"పుట్టుకవల్ల ఏర్పడేది తల్లిదండ్రులతో సంబంధం. సంస్కారంవల్ల వచ్చేది స్నేహం. పుట్టుకకన్నా సంస్కారమే గొప్పది. కనక రక్త సంబంధంకన్న స్నేహబంధమే గొప్పది. నాగతంలో నాకు మిగిలినది ఆ బంధమే! అందుకే




నీకు మాత్రమే ఉత్తరం రాస్తున్నాను''

ఆ తర్వాత తను తిరిగివచ్చాడు. ఉద్యోగాన్వేషణ, రాజు చెల్లెలు శారదతో ఆదర్శవివాహం, పిల్లలూ, రాజు కాంట్రాక్ట్స్‌లో దిగటం, యీనగరంలో స్థిరపడటం, తనూ ఉద్యోగరీత్యా యీనగరానికే చేరటం వరసాగ్గా జరిగిపోయాయి.

"ఇది హాస్యానికి సమయం కాదనుకుంటాను"

"హాస్యం కాదుబావా! తరానికీ తరానికీ మధ్య ఆవేశాలలో భేదం ఉండదు"

"నేను వానుకి అన్నిసౌకర్యాలూ యిచ్చాను."

"మీ నాన్నగారు నీకు యివ్వలేదంటావు"

"అప్పటి మావాళ్ళ దారిద్ర్యం వాళ్ళ అవిద్య అజ్ఞానమూ నా చదువుకి పూర్తి అవకాశం యివ్వలేదు. అంతవరకూ వాస్తవం"

"నీ తల్లిదండ్రులు విద్యావంతులు కాకపోవచ్చుగానీ, అజ్ఞానులు కారేమో!"

"వాళ్ళు అజ్ఞానులే రాజూ! నా చదువుకు వాళ్ళు సరైన మార్గం చూపించలేదు. వాళ్ళ ఆర్థికస్థితినిబట్టే చదివించారుగానీ నా ఉత్సాహాన్ని గమనించి మరికొంచెం కష్టపడి వాళ్ళ భేషజాలు తగ్గించుకుని ముందుచూపు చూసిఉంటే నేను యిలా డిగ్రీతో ఆగిపోయేవాడినికాదు. ఇంజనీరింగ్‌లో డిగ్రీ తీసుకుని ఉండేవాడిని"

"అయితే పిల్లల చదువుని తల్లిదండ్రులే ప్లాన్‌చెయ్యాలంటావు. అదే జ్ఞానమనీ అది మీ తల్లిదండ్రులకు లేకపోయిందనీ- అంటావు"

"ఇప్పుడు ఆర్గ్యూచెయ్యలేను రాజూ! శారద పరిస్థితి బాగాలేదు. వాను ఎక్కడున్నదీ మనం వెంటనే తెలుసుకోవాలి"

అవతలనుంచి జవాబులేదు.

"హలో... హలో"

నిట్టూర్పు వినిపించింది.

"బావా... నేను వస్తున్నాను"

"అర్థంటుపనేమీ లేకపోతేనేరా!"

ఫోన్‌దించి శారద దగ్గరికి నడిచాడు "మీ అన్నయ్య వస్తున్నాడు. కాఫీలు చూడు!"

ఇరవై నిమిషాలలో రాజు కారు హారన్ వినిపించింది. అతను వచ్చాక శారదతో బెడ్‌రూంలో కొంతసేపు మాట్లాడాడు. డ్రాయింగ్‌రూంలో కూర్చుని ప్రాంతీయ వార్తలు వింటున్నాడు సీతారాం.

"ఈ ఏడాది యింటర్ పరీక్షాఫలితాలలో ఉత్తీర్ణతాశాతం కేవలం యిరవైఏడు మాత్రమే ఉన్నందుకు విద్యామంత్రి కారణం చెప్పాలంటూ శాసనసభలో ప్రశ్నించారు. విద్యాప్రమాణాల మెరుగుదలకు యిది నిదర్శనమని విద్యామంత్రి యిచ్చిన జవాబుతో ప్రతిపక్షాలు సంతృప్తిచెందలేదు. విద్యాసంస్థల పనితీరు దిగజారిందనీ, అందుకు బాధ్యతవహించవలసిన విద్యామంత్రే ఈరకమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చటం దురదృష్టకరమనీ అన్నారు. విద్యాసంస్థల పనితీరు గురించి సమగ్రమయిన దర్యాప్తు జరిపించాలని చేసిన డిమాండ్‌ను ప్రభుత్వం తోసిపుచ్చింది''

రాజూ, సీతారాం కాఫీలు ముగించారు.

"బావా!"

అతనివయిపు చూశాడు సీతారాం.

"వానూ గది వెదుకుదామా"

"ఎందుకూ?"

"ఏదయినా నోట్ విడిచిపెట్టాడేమోనని"

"నోటా?" దెబ్బతిన్నట్లుగా ఉంది సీతారాం గొంతు.

"అప్‌సెట్ అవకు బావా! కుర్రరక్తంగదా! పరీక్ష తప్పాడు. నువ్వేదో అన్నావు. నువ్వు ఆఫీసుకు వెళ్ళినగంటదాకా గదిలోంచి బయటకు రాలేదుట. తలుపులు మూసి ఉంటే నిద్రపోతున్నాడేమోనని శారద తలుపు తట్టలేదుట. తన స్నానమూ ధ్యానమూ పూర్తయి వచ్చేసరికి బయటకు వెళ్ళిపోయాడట. అందుకని వాడిగది వెదకాలంటోంది"

"వాడు యింట్లోంచి పారిపోయి ఉండవచ్చంటావు?"

"నేనేం అలా అనుకోటంలేదుగానీ-"

సీతారాం లేచి నుంచోటంతో రాజుమాట పూర్తవలేదు. అతను అటూయిటూ పచార్లు చేస్తుండగా రాధవచ్చి మేనమామకు విష్‌చే

సింది.

"బాగా చదువుతున్నావా?"

రాధ చిన్నినవ్వుతో జవాబిచ్చింది. తండ్రి ఎదురుగా ఆమె నోరు విప్పదని రాజుకీ తెలుసు.

"ముందుగా వాడి ఫ్రెండ్స్‌ని ఆరా తీద్దాం, రాజూ! మరీ ఆలశ్యమయితే శారద కంగారుపడుతుంది" అన్నాడు సీతారాం పచార్లు ఆపి.

అక్కడే నిలబడి పుస్తకం చదువుకుంటున్న రాధను తదేకంగాచూసి- "సరే! బయల్దేరు-" అన్నాడు రాజు.

సీతారాం బట్టలు మార్చుకోటానికి తనగదిలోకి నడిచాడు. శారద చటుక్కున అన్నదగ్గర చేరి మెల్లగా అంది.

"వాడిగది వెదకటం మంచిదిగదా అన్నయ్యా"

'తాళం వేసుందా"

"పిల్లలు తాళాలు వేసుకోరు"

"నువ్వూ, రాధా వెదకండి! మేం బయటకు పోతున్నాంగదా!"

"ఆయనకి యిష్టముండదు"

"ఎందుకనీ?"

"నీకు తెలీదా అంకుల్! పిల్లలకి ప్రైవసీ ఉండాలంటారు డాడీ"

"భలేవాడు మీడాడీ! నోరు విప్పకూడదు. ప్రైవసీ ఉండాలి. నువ్వు వెదుకమ్మా శారదా!"

తటపటాయించింది శారద. చివరికి అంది "వద్దులే! తిరిగొచ్చాక ఆయనే వెదుకుతారు".

రాజు మెల్లగా అన్నాడు- "చెల్లాయ్! వాసూ యింట్లోంచి వెళ్ళిపోయేరకమంటావా? ఆలోచించి చెప్పు-"

తల్లి జవాబిచ్చేలోగా అందిరాధ.

"వెళ్లడు!"

"మీ నాన్న అంతలా అన్నాకకూడానా?"

"డాడీ.. " అంటూ మధ్యలో ఆగి తేలికగా అంది- "డాడీ అలా అనరు మామయ్యా! నాకు నమ్మబుద్ధవటంలేదు. ఎప్పుడయినా కోపంవస్తే నిన్ను నువ్వు మార్చుకోవాలి అంటారంతే! మమ్మీ పొరపడిందేమో!"

శారద కోపంగా అంది.

"చావగూడదా వెధవా అన్నారు మీడాడీ! నేను పుట్టించానంటావు నువ్వు"

శారద కోపాన్ని పట్టించుకోనట్టు అన్నాడు రాజు.

"అంతమాట బావ అన్నాడంటే బాగా అప్‌సెట్ అయుండాలి. అంత నిదానమయిన మనిషి అప్‌సెట్ అవటం నాకూ ఆశ్చర్యంగా ఉంది శారదా!"

"అయితే వాసు.. వాసు.." ఆమె కళ్ళమ్మట నీళ్ళు జలజలా కారాయి.

సీతారాం వచ్చేసరికి శారద సన్నని గొంతుతో ఏడుస్తోంది. రాజు ఆమె భుజం తడుతున్నాడు. సీతారాం మెల్లగా ఆమెను సమీపించి "కంగారుపడకు శారదా! వాసూ వస్తాడు" అన్నాడు.

రాజుతో బయటికి నడుస్తున్న సీతారాం ఆగాడు. అతను పిలిచేసరికి గబగబా వెళ్ళింది రాధ.

"వేణూ యింటికి వెళ్దాం- రా!"

ఆయిల్లు తనకు తెలీదని చెప్పదామా అని తటపటాయించింది రాధ. వెంటనే లోపలకు వెళ్ళి జోళ్ళు తొడుక్కుంది. తల ఓమారు పైపైన దువ్వుకుంది. పౌడరు రాసుకుంది. అద్దంలో తననితను పరిశీలించుకుంది. కారులో నిరీక్షిస్తున్న తండ్రీ మేనమామలతో కలిసింది.

కారు కదిలింది.

* * *

రాత్రి ఎనిమిదిగంటలయింది

మెయిన్‌రోడ్డుకి ఓపక్కన పల్లంలో వుంది పూర్ణిమాటాకీస్..రెండవవక్క పల్లంలో కలగా పులగంగా యిళ్ళు కనిపిస్తున్నాయి. కాన్వాసు పట్టాలూ, డబ్బారేకులూ, సిమెంటు రేకులూ రకరకాల వస్తువులతో కప్పబడినయిళ్ళు. కార్పొరేషన్ దీపాలు ఆ ప్రదేశానికి కాంతినిస్తున్నాయి.

రోడ్డుమీదే కారుని ఆపమంది రాధ.

"యిక్కడ యిళ్ళేవీ?" కారు ఆపుతూ ఆశ్చర్యంగా అన్నాడు రాజు. పల్లంలోకి చూపిస్తూ- "అక్కడే ఉంటాడు వేణు" అంది.

సీతారాం మొఖంలోకి చూశాడు రాజు.

"కారు వెళ్ళదా?" సీతారాం మాట్లాడకపోవటంతో రాజు అన్నాడు.

"ఉహుఁ!" అందిరాధ కిందకి దిగుతూ.

"ఈ టైంలో నువ్వొక్కదానివీవెళ్ళితే ట్రబులేం ఉండదా?" అన్నాడు రాజు.

"ఛాఛ!!" అందిరాధ.

" వాణ్ణి తీసుకురా రాధా!" అన్నాడు సీతారాం. రాధ గబగబా మెట్లమీదుగా కిందకి నడిచింది.

"మనమూ వెళ్దాం-" అన్నాడు రాజు ఏదో గుర్తువచ్చినట్లు.

"అక్కర్లేదు-" ముక్తసరిగా అన్నాడు సీతారాం.

అయిదునిమిషాలు గడిచాయి. గాలి చలిగా వీస్తోంది. కారు అద్దాలు పైకి తోశాడు. నగరపు విద్యుద్దీపాలు నల్లని ఆ అద్దాలలోంచి కాంతివిహీనంగా అవుపిస్తున్నాయి. కాసెట్ప్లేయర్ని ఆన్చేసాడు. శ్రీనివాసన్ మాండలిన్ మెదడుకు విశ్రాంతి నివ్వజూస్తోంది. సీతారాం తలను సీటు రెస్ట్మీదకు ఆన్చి కళ్ళు మూసుకున్నాడు.

భుజంమీద చెయ్యివేసి స్నేహంగా "సీతా!" అన్నాడు రాజు.

కళ్ళు తెరవకుండా అన్నాడు సీతారాం "చెప్పు"

"నువ్వు అప్సెట్ అవటం నాకు ఊహాతీతంగా ఉంది"

కళ్ళువిప్పి అతని వయిపు చూశాడు సీతారాం.

"నిజంగానా?"

"నిజం సీతా! నువ్వు మితభాషివి. నీ ఆవేశాన్ని బయటపడనీవు. అలాగని ఆవేశాలకు అతీతుడవూ కావు. పిల్లలకి నువ్వంటే బెదురుందిగానీ అది నోటివల్ల ఏర్పడలేదు. రాధ విషయమే చూడు-! అలాంటి అలగావాళ్ళ గుడిసెలలోకి ఇలాంటిరాత్రివేళ అలవాటున్న దానిలా వెళ్తూవుంటే నువ్వు అప్సెట్ అయినట్టేలేవు! అలాంటిది- ఆఫ్టాల్ పరీక్షపోతే వాసూని నువ్వు...!" వాక్యం పూర్తిచేయలేదురాజు. కొంతసేపు ఆగి మళ్ళీ అన్నాడు-

"-నువ్వూ ఏదో సంపాదించుకుంటున్నావు! నాదగ్గరా బోల్డంత ఆస్తి ఉంది. నాకేం పిల్లాజల్లా? యిదంతా కట్టుకుపోతానా! వెధవపరీక్షపోతే పోయింది. మళ్ళా కడతాడు. ఆ మాత్రం బతకలేడా? ఎందుకంత అప్సెట్ అయ్యావూ-!! అంతమాటన్నావూ!"

"నిజంగానే నేను చాలా దెబ్బతిన్నాను రాజూ! వాడినామాట అన్నదగ్గర్నుంచీ ఎందుకలా అయిందని ఆలోచిస్తున్నాను. వాడిపరీక్షను నాపరీక్షలా తీసుకున్నానని అర్థమవుతోంది. నాది చాలా చిన్న కోరిక. నేను ఇంజనీరింగ్లో డిగ్రీ తీసుకోలేకపోయాను. వాడిలో అందుకుతగ్గ సామర్థ్యం లేకపోతే నా కోరిక ఎప్పుడో చచ్చిపోయేది. వాడు బ్రిలియంట్. వాడిని ఎప్పుడూ నేను నిర్బంధించలేదు. ఆంక్షలు పెట్టలేదు. వాడి పెర్ఫార్మెన్స్ నాకోరికను దెబ్బతీసింది. ఈ రెండేళ్ళలోనూ వాడిలో ఎలాంటి మార్పూ కనబడలేదు. అలాంటివాడు కనీసం పాస్కూడా కాలేదంటే- నేను భరించలేకపోయాను. లోపం నా పెంపకానిదా వాడిదా! నా వైఫల్యం వాడిలో చూసుకుని ఆవేశపడ్డాను-"

నంబాళించుకోమన్నట్టు భుజాన్ని నొక్కాడు రాజు. "వాసూ ఏమయినా చేస్తాడంటావా?"

"నా అంచనాలమీద నాకు నమ్మకం పోయింది"

రాజుకి తనప్రశ్నే అసందర్భంగా అనిపించి సంభాషణ పెంచలేదు.

రాధా, మరోయువకుడూ కారువయిపు వస్తూండటం చూసి అద్దాలు దించాడు రాజు. యువకుడు వంగి కారులోని సీతారాంతో అన్నాడు.

"గుడీవినింగ్ అంకుల్! వాసూ యింటిదగ్గరలేడని రాధ చెప్పింది. మీరు గాభరా పడుతున్నారుట. మాయింటికి రాలేదు-"

"ఇలాంటిచోట్లకు, నీలాంటివాళ్ళ యిళ్ళకి వస్తూంటే గాభరాకాదా మరి-?" అన్నాడు రాజు.

సన్నగా మధ్యరకం ఎత్తులో ఉన్నాడు వేణు. జీన్స్పాంట్. వదులుగానున్న వడకనూలు పొట్టిచేతుల చొక్కా. లోపల బనీను ఉన్నట్టు లేదు. కొద్దిగా పెరిగిన గడ్డం. ముందు సీటు




లోంచి వచ్చిన మాటకు అటుచూసాడు వేణు.

"మా మామయ్యా. వెంకటరాజు. వీ ఆర్ కంట్రాక్టర్స్ ఆయనదే!" అంది రాధ.

వేణు విష్‌చేయలేదు. నవ్వాడు.

"మీయింట్లో ఎవరున్నారు? ఫాదర్ ఏంచేస్తున్నాడు?" రాజు ప్రశ్నలకు జవాబు యివ్వలేదు వేణు. వెనకసీట్లోకి తలతిప్పి అన్నాడు.

"అంకుల్! మాఫ్రెండ్సందరి యిళ్ళలోనూ వాకబుచేసి ఏరాత్రికయినావచ్చి సమాచారం యిస్తాను. మీరు హైరానాపడకండి. ఇంటికివెళ్ళి విశ్రాంతి తీసుకోండి"

"నువ్వా యింటరేనా?" అడిగాడు సీతారాం.

"అవునంకుల్! పాసయ్యాను- క్లాసవచ్చింది"

"వాసుకి చాలామంది ఫ్రెండ్స్ ఉన్నారా-?"

"క్లోజ్‌గా మేం ఓ అయిదుగురం ఉంటుంటాం! నేను తప్ప మీ యింటికి ఎవరూరారు"

"వాళ్ళ పరీక్షలు?"

"యిద్దరం పాసయ్యాం. మిగిలినవాళ్ళ నంబర్లులేవు. కొందరినంబర్లు ఎవల్‌డీలో ఉన్నాయి"

"అంటే-?"

"ఎనౌన్స్‌డ్ ఎట్ లేటర్‌డేట్-"

"వాసూనంబరు అందులో ఉందా-?"

"లేదంకుల్!"

సీతారాం మాట్లాడలేదు.

"నేను వెళ్తానంకుల్! చాలామందిని కలవాలి. ఏ రాత్రయినా వస్తాను-"

"రా... కారెక్కు! అందరి యిళ్ళకూ వెళ్దాం!" అన్నాడు రాజు.

"అక్కర్లేదు" కదలబోయాడు వేణు. చెయి పట్టుకున్నాడు సీతారాం.

"శ్రమెందుకు వేణూ! మేమూ వస్తాం"

"వాసూ నాస్నేహితుడు అంకుల్!"

గబగబా వేణూ వెళ్ళిపోయాడు. కారు ఎక్కి తలుపు మూసింది రాధ.

"వీడికి మేనర్స్ తెలియనట్టుంది రాధా?" గేరు మారుస్తూ అన్నాడు రాజు.

"బయట చాలామంచుకురుస్తోంది మామయ్యా!" చేతులు గబగబా రుద్దుకుంటూ అంది రాధ.

"నువ్వేం చెప్పావు వేణుకి-?" సీతారాం రాధవయిపు తిరిగి అన్నాడు.

"అన్నయ్య పొద్దుటినుంచి యింట్లోలేడనీ- అమ్మా, మీరూ కంగారు పడుతున్నారనీ, మీరూ మామయ్యా కార్లో వెయిట్‌చేస్తున్నారనీ" రాజు మధ్యలో అన్నాడు. "నువ్వు రావటం ఆలశ్యమయింది. వాడు వెంటనే దొరకలేదా?"

"దొరికాడుగానీ ఎవరితోనో మాట్లాడుతున్నాడు"

"ఎవరితో?"

"ఏమో! ఎవరో తోపుడుబళ్ళవాళ్ళనుకుంటాను-! ఏదో కాగితం రాస్తున్నాడు. పూర్తయిందాకా ఆగవలసివచ్చింది-"

సీతారాం వాళ్ళ సంభాషణలో కలగజేసుకోలేదు. కొంతదూరం కారు నడిపాక రాజు అన్నాడు.

"ఇంటికేనా వెళ్ళటం?"

"ఊ!"

ఇంటివయిపు సాగుతోంది కారు. కొంతసేపయాక అడిగాడు రాజు. "పోలీస్టేషన్‌కి వెళ్దామా?"

ఆలోచించి జవాబిచ్చాడు సీతారాం.

"ఈరోజుకి ఆగి చూద్దాం"

సిగరెట్ పూర్తయ్యాక రాజుకి గాలిచల్లగా ఉన్నట్లు అనిపించింది. డ్రైవ్‌చేస్తూనే అద్దాలు పైకి లాగాడు.

★ ★ ★

రాత్రి పదకొండు దాటింది. ఈమధ్యలో రాజు యింటికి ఫోన్‌చేసి రాత్రికి యిక్కడే ఉండిపోతున్నానని చెప్పాడు. టి.విలో ఆఖరి ప్రోగ్రాం పూర్తయింది. అంతా హాల్లో సోఫాల్లో కూర్చుని ఉన్నారు. ఎవరూ ఏమీ మాట్లాడటంలేదు.

"ఆ కుర్రాణ్ణి నమ్ముకుని మనం యిలా కూర్చోవడం వేస్టు" అన్నాడు రాజు.

సీతారాం చటుక్కున లేచి- "పద! వాసూరూం చూద్దాం" అన్నాడు. శారద, రాధ వాళ్ళని

అనుసరించారు.

గదంతా ఓ పద్ధతి ప్రకారం సర్దిఉంది. 'గోడలమీద ఓ ఫోటోలో చేతులు కట్టుకున్న వివేకానందుడూ, మరోదాన్లో వయసులోని గాంధీ మాత్రం కనిపిస్తున్నారు. కిటికీ దగ్గరగా టేబుల్. దానిమీద లైట్! ఓ ఫోటో ఫ్రేమ్‌లోంచి తల్లితండ్రీ! డ్రాయర్ సొరుగుల్లో ఎంట్రన్స్ కోసం తయారవుతున్న కాగితాలు. బుక్స్‌రాక్ చిన్నది. అన్నీ చదువుకు సంబంధించిన పుస్తకాలే! రెండుమాత్రం వివేకానందుడి పుస్తకాలు. డైరీలేమీ కనిపించలేదు. స్నేహితుల చిరునామాలుగానీ ఉత్తరాలుగానీ లేవు. సిగరెట్టుపెట్టె, పీకలుగాని కనపడలేదు. కాసెట్‌స్టాండ్‌ని పరిశీలనగా చూస్తున్నాడు సీతారాం. చిన్నకలెక్షన్. సైగల్, ముఖేష్‌ల రెండు కాసెట్లు తప్పించి మిగిలినవన్నీ గజల్స్. శాస్త్రీయ సంగీతం.

అంతవరకూ జరిపిన పరిశీలనలో అతని అనేక భయాలు తొలగిపోయాయి. అలా తొలగిపోవటంతో అతనికి తనవల్ల చాలా తప్పు జరిగిన భావన పెరిగింది.

రికార్డర్‌లో ఓ కాసెట్ ఉంది. అన్నమాచార్య కీర్తనలు - శోభారాజ్ అని ఉంది. దానిని బయటకు తీయబోయేసరికి రెండు చిన్న కాగితం ఉండలు బయటపడ్డాయి. తిరిగి రికార్డింగ్ చేయడానికి వీల్లేకుండా విరిచేసిన కన్నాల్లో ఆ ఉండలు పెట్టినట్టు గ్రహించాడు రాజు.

"వాసు దీనిమీద ఏదో రికార్డు చేసాడు" అన్నాడు.

శారద, రాధ ఆత్రంగా అతన్ని సమీపించారు. సీతారాం అక్కడే నిలబడి చూస్తున్నాడు. రాజు ఆ కాసెట్‌నే తిరిగి రికార్డర్‌లో ఉంచాడు. కొంచెం రివర్స్‌చేసి ఆన్ చేశాడు. వాసూ గొంతు. మరికొంతసేపు దానిని పూర్తిగా రివర్స్ చేసాడు రాజు. కొడుకు గొంతు వినపడగానే కళ్ళలో ఉబికిన శారద కన్నీరు నిశ్శబ్దంగా ప్రవహించింది.

"డాడీ చచ్చిపో అన్నారు-"

వాసూ! అంటూ షాకింగ్‌గా అరుస్తూ శారద కింద కూలిపోయింది. రాధ ఆమెను పట్టుకుంది. కొంచెం సర్దుకున్నాక రాజు ఆమెను వేరే తీసుకెళ్ళాడు

సీతారాం జరిగిన దానికి ప్రేక్షకునిలా ఓ పక్కగా కూర్చునుండిపోయాడు. రాధ తల్లిదగ్గరగా ఉండి అనునయిస్తోంది.

మళ్ళీ ఆన్‌చేశాడు రాజు.

మధ్య మధ్య ఎడంతో వాసూగొంతు వినిపిస్తోంది.

కానీ చావు సమంజసమా? అసలు ఏ సమస్యకయినా చావు పరిష్కారమా? - ఇంతకీ సమస్య ఏమిటి? నాపరీక్షా? నా అంచనాలకు అందని మీ ప్రవర్తనా!

డాడీ! మీరంటే నాకు గౌరవం. మీరంటే నాకు భయం.

గౌరవమెందుకు?

మీరు నాకు స్వేచ్ఛనిచ్చినందుకు. నిత్యమూ మాస్నేహితుల కుటుంబాలలో ఎదుర్కొనే సమస్యలు వింటుంటాను. తమ పిల్లలకు ఇంగితజ్ఞానం ఉండాలన్న జ్ఞానం యిస్తే చాలనుకోరు చాలామంది తండ్రులు. కానీ, నాకు ఏ సమస్యయినా స్వయంగా పరిష్కరించుకొనే అవకాశం యిచ్చారు డాడీ!

భయం? అసలు మీరంటే ఎందుకు భయం? నాకు మీరంటే భయమా?"

చాలావరకూ గాప్ తర్వాత వాసూగొంతు మళ్ళా వినిపించింది.

"మీరన్నమాటతో నా తల దిమ్మెరపోయింది. మీలాంటిమనిషి, యిలాంటి సలహా ఎందుకిచ్చారూ!

పరీక్షపోయిందని పేపర్లో నంబరు లేకపోవడంవలన తెలుస్తోంది. డిస్టింక్షనో కనీసం రాంకో తప్పదనుకున్నాను. యిది ఎలా జరిగిందో నాకే అర్థంకాలేదు. ఇది ఆశ్చర్యంగా ఉంది. కానీ మీ మాట మరింత ఆశ్చర్యంగానూ, దుఃఖంగానూ ఉంది.

మీలాంటి మనిషిచేత యిలాంటి సలహా యిప్పించినశక్తి ఏది?"

తర్వాత మళ్ళీ గాప్.

మీసలహా పాటించాలా? నాబుద్ధిని అనుసరించాలా?

చావా? బతుకా?

"మీరు విధించిన చావుకీ, నేను వాంఛించే

బతుక్కీ మధ్య మరేమయినా ఉందా!''

హఠాత్తుగా కాసెట్‌లోంచి శోభారాజ్‌గొంతు. ఆ తెలుగుపాటలోని సాహిత్యం వాళ్ళని తాకటంలేదు. అందులోని భక్తి శారదను స్పృశించలేకపోతోంది. ఆ పాటలోని గొంతులోని అందం ఆధారంతో సీతారాం మనసు వర్తమానాన్ని తప్పించుకోజూస్తోంది.

కాసెట్ పూర్తయి క్లిక్‌మన్న ధ్వనితో రికార్డర్ ఆగిపోయింది.

వానూగొంతు మళ్ళీ వినిపిస్తుందేమోనని కాసెట్ రెండోవైపు పెట్టాడు రాజు. ఎక్కడా వాను గొంతులేదు.

"మధ్యలో ఆపేసినట్టున్నాడు గదూ!" రాజు రికార్డర్ ఆఫ్ అయాక సీతారాం వయివు తిరిగి అన్నాడు. అతని మొహంలో ఆందోళన నర్దుకుంటున్నట్టు రాజుకి అన్పించింది.

"ఎందుకు ఆపేసాడంటావ్?"

"అనిశ్చిత మనస్థితి" సీతారాం గొంతు నిదానంగా ఉంది. శారద, రాజు ఆమె పడకగదిలోకి వెళ్ళారు. రాధ తన గదిలోకి వెళ్ళి కొంతసేపు నిద్రవస్తుందేమోనని చూసింది. మీత్ అండ్ బూన్ పుస్తకం చదివేసినదే దొరకడంతో అయిష్టంగానే మళ్ళీ మొదలుపెట్టింది.

సీతారాం కొంతసేపు కొడుకుగదిలో పచార్లు చేశాడు. తర్వాత హాల్లోకివచ్చి వీధిలోకి ఇంట్లోకి తిరగటం మొదలుపెట్టాడు.

ఒంటిగంట దాటింది.

గేటు చప్పుడయింది. చటుక్కున సీతారాంలేచి వీధిలోకి నడిచాడు. వేణూ వేగంగా వచ్చి అతని ముందు నించున్నాడు. అతన్తో వచ్చిన వ్యక్తి ఏమీ సంబంధం లేనట్టు గేటుదగ్గరే ఉండిపోయాడు.

"అయామ్ సారీ అంకుల్! మా మిత్రులెవరినీ వానూ కలవలేదు"

బలవంతంగా అంటున్నట్టు ఉంది వేణూ గొంతు.

సీతారాం అతన్ని లోపలికి రమ్మనలేదు. చివరి ఆశకూడా పోయినట్టు నిలబడి ఉండిపోయాడు. ఈలోగా శారద, రాజూ, రాధా అక్కడకు చేరారు.

" లోపలకి రా బాబూ! " అంది శారద వేణూని చూడగానే.

సీతారాం ఈ లోకంలోకి అప్పుడే వచ్చినట్టుగా "మీ స్నేహితుడినీ రమ్మను వేణూ" అన్నాడు.

" వానూని మీరు అంతలా హర్ట్ చేసివుండకూడదు అంకుల్! వాను ఆలోచనాపరుడే, సెన్సిటివ్!

వానూ! ఈ రకమయిన సమాజంలో వ్యక్తుల విజయాలు కేవలమూ వాళ్లవాళ్ల సామర్థ్యాల మీదనే ఆధారపడి ఉండవూ-దేనికీ ఓవర్‌గా ఉండకూడదూ" అంటూ చెప్తుంటాను.

అన్నీ ఒప్పుకున్నట్లే వుంటాడు. చివరికి మిమ్మల్ని ఇలా"

అతని మాటను తుంచేస్తూ అన్నాడు రాజు.

" మా బావ వానూని ఏమన్నాడో నీకెలా తెల్సింది?"

వేణూ కొంచెం తబ్బిబ్బుగా చూసాడు.

" నేను చెప్పాను" రాధ బిత్తరపోతూ అంది.

"ఇంటి విషయాలు బయట చెప్పకూడదమ్మాయ్"

అన్నాడు రాజు ఆమె ముఖంలోకి పట్టిపట్టి చూస్తూ. రాధ తలవంచుకుంది

"ఇప్పుడేం చెయ్యాలి" అన్నాడు సీతారాం.

"పద పోలీస్ కంప్లెయింట్ యిద్దాం- "

రాజు లేచాడు.

" వద్దు వద్దు" వేణు చటుక్కున అన్నాడు.

" ఎందుకొద్దూ? " రాజు గొంతులో ఎదుటి మనిషిని దూరంగా ఉంచుతున్న ధ్వనితోబాటు అధికారమూ, అనుమానమూ,వ్యంగ్యమూ మిళితమయి ఉన్నాయి.

వేణూ అతనిమీంచి చూపు తప్పించి సీతారాంతో అన్నాడు.

" వానూ చాలా సెన్సిటివ్. వాడు వెళ్లి అదే కన్పించటం మానేసి ఇరవై నాలుగు గంటలు కూడా అవలేదు. వాడిని పోలీసులు పట్టుకుంటే బహుశా మరోలా రియాక్టవొచ్చు. ముందు పేపర్లో వేయించి, ఆ తర్వాత"





రాజు ఏదో అనబోతుంటే సీతారాం వారించాడు.

"వానూ మిత్రుడుగదా! అతని సలహా అత ను చెప్పాడు. పాటించాలా వద్దా అన్నది మన విషయం. వాదన దేనికి రాజూ? కొంచెం ఏమయినా తీసుకు వెళ్లు వేణూ!" అన్నాడు సీతారాం.

మర్యాదకే ఆమాట అన్నాడు సీతారాం.

వేణూ వెంటనే అన్నాడు" నిజానికి నాకు ఆకలిగానే ఉందంకుల్! మీరు వచ్చిన తర్వాత తిండికుదరలేదు. కానీ మీ ముఖం చూస్తుంటే మీరూ ఏమీ తీసుకోలేదని తెల్సిపో తోంది. మీరూ, ఆంటీ కూడా తీసుకుంటానంటే నేను మొహమాటం లేకుండా తింటాను"

సీతారాం ఒక్కక్షణం అతని కళ్లల్లోకి చూశా డు. ఆ చూపునిండా తడి. ఇద్దరూ ఆ తడిని భరించలేనట్టుగా చూపు తిప్పుకున్నారు. రాజు కాస్త దూరంగాపోయి సిగరెట్ వెలిగించుకు న్నాడు.

మాట్లాడబోయి గొంతు రాకపోవడంతో సవ రించుకుని మెల్లగా అన్నాడు సీతారాం "ఇత నెవరో చెప్పలేదు"

"పేరు దేవేంద్రన్! ఓ స్నేహితుడు"

అతని బట్టలు అపరిశుభ్రంగా లేకపోయినా చవకబారుగా ఉన్నాయి. కళ్లు ఎర్రగా ఉన్నాయి. ఆ సోఫాకి అతను తగనట్టుగా ఉన్నాడు.

సీతారాంలో వేణు మాటల్తో ఏర్పడిన తడి అతని స్నేహితుడిని పరిశీలించటంతో కొంత ఎండిపోయింది.

" అంకుల్... ఈ ఏడాది రిజల్ట్స్‌లో పాస్ శాతం మునుపు ఎన్నడూ లేనంతగా పడిపో యింది. నిన్నటి పేపరూ, ఈ రోజు పేపరూ మీరు చూసే వుంటారు. ఎందుకిలా జరిగింది? ఇది మనమంతా పట్టించుకోవాలి. మనమంటే విద్యార్థులూ తలిదండ్రులూ. ఇందాక ఓ లెక్చ రర్ కలిసి 'మేమూ ఈ విషయం పట్టించుకో వాలి వేణూ-' అన్నాడు. వాళ్ళూ వస్తే మంచిదే! మూడు ప్రత్యేక కమిటీలతో ఓ సంఘంగా ఏర్పడి ఆందోళన చెయ్యాలి. ఎలా చెయ్యాల న్నదీ ఏం చెయ్యాలన్నదీ నిర్ణయాలు తీసుకో వాలి. మీరూ తలిదండ్రుల కమిటీలో మెంబ రు కావాలి! అందాకా యిందులో సభ్యత్వం కోసం యీ కాగితంమీద సంతకం చెయ్యండి. మీరు కావాలనుకుంటే అడ్‌హాక్ కమీటీలో సభ్యుడుకావొచ్చు. మీరు ముందుకు రావాలని నా కోరిక- "

కొన్ని కాగితాలు అతని చేతికి యిచ్చాడు వేణు.

అతనేమన్నదీ సీతారాంకి అర్థంకాలేదు. అతనిచ్చిన కరపత్రాన్నీ, దానికింద సభ్యత్వా న్ని కోరుతూ సంతకం చేయాల్సిన దరఖాస్తునీ చదవటం మొదలు పెట్టాడు. రాజు అతని పక్కనే సోఫాని ఆనుకుని తొంగి చూస్తూ చదవటం మొదలుపెట్టాడు.

మరో సెట్టు కాగితాలు అతనికిచ్చాడు వేణు.

" మీరూ యిందులో చేరవచ్చు"

" నాకు పిల్లలే లేరే! "

" దాందేముంది? ఆసక్తి ఉంటే చాలు "

ఇద్దరూ ఆ కాగితాలు చదవటం పూర్తిచేశా రు.

" ఇదంతా నువ్వే రాశావా?" రాజు అదోలా ప్రశ్నించాడు.

" అదంత ముఖ్యమయిన విషయం కాదు! "

" సహాయం కావాలని అడుక్కునేవాళ్ల పద్ధతి కాదు యిది-"అన్నాడు రాజు!

వేణు కొంచెం ఆగాడు. చిరు నవ్వుతో-

"నేను సహాయం కోరలేదే! జరిగింది దగా! యిందులో ఏదో ఉంది అన్న ఉద్దేశ్యంతో యీ విషయాన్ని కన్విన్స్ చెయ్యటానికి యీ కరప త్రం రాయబడింది. మీరు సభ్యుడవదల్చు కుంటే పది రూపాయలు కట్టమన్నాం! ఏ ఉద్యమానికయినా ప్రజలూ కావాలి- డబ్బూ కావాలి. డబ్బు యివ్వటం ఎవరికి వారే చేసుకో నేదేగాని ఒకరి కింకొకరు యివ్వటంగాదు- "

" ఈరోజు పొద్దుట పేపర్లో రిజల్ట్స్ వచ్చాయి. యీ సాయంకాలానికి యింత మందిని నువ్వు కలిశావు. యిందరిని చే ర్పించానంటావు. మమ్మల్ని నమ్మమంటావు. మాలాంటివాళ్లను ఇంప్రెస్ చేయటానికే యీ సంతకాలన్నీ క్షణాలమీద వచ్చేశాయి. పోగుచే



సే డబ్బులకు లెక్కాపత్రమూ ఉండవు! నాలు గు పేపరు ప్రకటనలతో ఉద్యమం క్లోజ్! ముష్టికి కూడా చాలా మోడరన్ పేర్లు వచ్చాయి.

రాజుని వారిద్దామనుకున్న ఊహ వేణూ మొహంలో నిదానం గమనించగానే సీతా రాంలో క్రమంగా తొలగిపోయింది. ఆసక్తిగా వేణూని గమనించసాగాడు.

రాజు మాటలు పూర్తిగా విని రిలాక్సింగ్ సోఫాలో జారబడ్డాడు వేణు.

"ఎవరి అభిప్రాయమయినా వాళ్ళ అను భవం నుంచే ఏర్పడుతుంది. నమ్మకంగా చె ప్పేవాళ్ల అభిప్రాయాన్ని నేను సరిచెయ్యాలను కోను. మీ యిష్టంవచ్చినట్టు చెయ్యండి!"

సీతారాం గబగబా సంతకంచేసి జేబు లోంచి ఏభై నోటుతీసి యిచ్చాడు.

"చిల్లర లేదా అంకుల్!"

"ఫరవాలేదు... ఉంచు వేణూ!"

"సభ్యత్వానికి పదే అంకుల్! ఆంటీ కూడా సంతకంచేస్తే యిరవై!" అంటూ ఆ నోటు అందించాడు.

ఆమ్లెట్సూ బ్రెడ్డూ జామూ తీసుకువచ్చారు శారదా, రాధా. పళ్లాలలో వేసి అందరికీ అందించింది రాధ. ఆమె గ్లాసులూ, జగ్గుతో నీరూ పట్టుకుని తిరిగి వచ్చేసరికి సీతారాం చెప్పినట్టు శారద సంతకంచేసింది. యిరవై తీసుకుని తేవేంద్రన్‌కి యిచ్చాడు వేణు.

సగంవరకూ తిన్నాక అన్నాడు వేణు.

"మీరు డబ్బు యిచ్చారు. సభ్యులుగా చేరా రు. నేను వానూకి స్నేహితుడినవటంవల్లనో నా ప్రవర్తన మీకు నచ్చటంవల్లనో మీరిలా చేశారు గదూ అంకుల్!"

అవునూ కాదూ అని తేల్చకుండా ఊరుకు న్నాడు సీతారాం.

"నాకు తెలును అంకుల్! మీ స్థితినాకు అర్థమవుతోంది. ఇలాంటి సంఘటనలు జరు గుతుంటాయి. వీటికి బాధ్యత ఎవరిదీ? ఇదే అసలు ప్రశ్న. దానికి జవాబు దొరికాక వీటిని నివారించటానికి మనమేం చెయ్యగలమూ ఏంచెయ్యలేమూ అన్నది తర్వాత ప్రశ్నలు. ఈ ఉద్యమంలోకి అందరినీ తీసుకురాగలిగితే"

"నీకు స్టేజీ అనుభవం బానే ఉంది" అన్నాడు రాజు. రొట్టెముక్కను నోట్లోకితోసి నవ్వాడు వేణు.

"ఇది వాదనకు సమయంకాదనుకుంటా ను. నా ఫీలింగ్స్ ఆయనతో పంచుకోవాలని పించింది అది అవసరమనీ తోచింది. వానూ పానవ్వాలని మీరనుకోవటమూ ఆశాభంగాన్ని తట్టుకోలేక అతన్ని గాయపరచటమూ దాన్ని అతను...." ఒక్కసెకను ఆగి మళ్లీ అన్నాడు వేణూ. "ఇదంతా కేవలం వ్యక్తిగత సమస్యలా పైకి కనిపిస్తుంది అంకుల్! ఆలోచిస్తే మీరూ నాభావాన్ని అర్థంచేసుకోగలరు. మీవంటివాళ్లు సక్రమంగా ఆలోచించితే యీ ఉద్యమానికి గట్టి పునాది పడుతుంది. సభ్యులని చేర్చటాని కి, డబ్బులు పోగెయ్యటానికీ మంచిమాటలూ సానుభూతీ కొంచెం నేర్చూ సరిపోతాయిగాని యాక్టివ్‌గా పాల్గోటానికి సరైన అండర్ స్టాండింగ్ కావాలి" అంటూ యిబ్బందిగా కది లాడు.

సీతారాం గమనించాడు

"సంకోచించకు- చెప్పు"

"మరేంలేదంకుల్! భరద్వాజగారు మీకు బాగా తెలును. ఆయన యూనివర్సిటీ అకెడ మిక్ కౌన్సిల్‌లో సభ్యులు"

సీతారాం ఏమీ అనలేదు

"జరగబోయే కౌన్సిల్ మీటింగ్‌లో ఆయన వైస్‌ఛాన్సలర్‌ని యీ విషయమై ప్ర శ్నించాలి" తూచితూచి అన్నాడు వేణు.

"ఉద్యమాలు వీధుల్లో జరుగుతాయి. మీ టింగ్‌లలో కాదు" అన్నాడు రాజు.

వేణు జవాబివ్వకపోయినా దొరికిపోయినవా డిలా సీతారాం కంటికి కన్పించాడు. కానీ సూదంటు రాయిలా అతన్ని ఆకర్షించాడు వేణు. లేచి అతని భుజం తట్టాడు సీతారాం-

"నీ ప్రయత్నాలు సాగనీ! అవసరమైతే భరద్వాజగారిని కలుద్దాం"

"అలాగే అంకుల్! నేను మిమ్మల్ని మళ్లీ కలుస్తాను. ఈలోగా వానూగూర్చి మళ్లీ భోగట్టా చేస్తాను. పోలీసు కంప్లయింట్‌వల్ల జరిగేదేమీ ఉండదు- వానూ హర్టవటం తప్ప"

సెలవు తీసుకుని యిద్దరూ వెళ్లిపోయారు.

తాను తినటానికి ముందు చనువుగా చొర వగా శారదా తనూ తినాల్సిందేనని పట్టుబట్టిన వేణు గుర్తువస్తున్నాడు సీతారాంకి. రాజూ అతనూ అక్కడే కూర్చుని ఉన్నారు. తల్లీ కూతురూ తమగదుల్లోకి వెళ్తున్నప్పుడు రాధని తల్లికి తోడుగా పడుకోమని చెప్పాడు రాజు.

"ఈ కుర్రాడు నమ్మదగ్గవాడిలా లేడు"

"ఎందుకనీ?"

"బ్రౌన్ సుగర్ అమ్ముకునేవాడి వాలకం. పోలీస్ కంప్లయింట్ యివ్వొద్దంటాడేమిటీ? ముందు వీడిని అరెస్టుచేయించి కీళ్లు విరి పిస్తే వానూ సంగతి బయటపడుతుంది"

చికాకుగా చూశాడు సీతారాం.

చటుక్కునలేచి అతని ఎదురుగా నిలబడ్డా డు రాజు.

"కోపంలో అనటంలేదు సీతా! ఆ రెండోవా డిని చూశావా ఖచ్చితంగా క్రిమినల్ రికార్డ్సులో దొరుకుతుంది వాడి మొహం! వెంటనే బయ ల్దేరు. మనం పోలీసుల్ని కలవాల్సిందే!"

చెయ్యి పట్టుకుని అతన్ని తన పక్కన కూర్చోబెట్టుకున్నాడు సీతారాం. అతను తనని చల్లార్చజూస్తున్నట్టు గ్రహించి

"వాడు నిన్ను బాగా ఇంప్రెస్ చేశాడు"

"అదే అర్థంకావడంలేదు. ఎప్పుడయినా ఎదుటపడితే గ్రీట్ చేయటమేగానీ ఆ అబ్బా యీ నేనూ యింతకుముందు మాట్లాడుకోలే దు. మనమిద్దరమూ ఒక్కమారే పరిచయమ యినట్టే లెక్క. అలాంటప్పుడు నీతో అంత రూడ్‌గా ఎందుకు ప్రవర్తించినట్టూ? మరి నాతో" అన్నాడు ఆలోచనగా.

"టాక్టిక్స్, అదో టాక్టిక్స్!" అన్నాడు రాజు.

కాదన్నట్టు తలూపాడు సీతారాం.

"మన పిల్లలు యిచ్చిన యిమేజెస్ అయుంటాయి"

అతని గొంతులో విచారాన్ని భావించుకున్న సీతారాం వెంటనే అన్నాడు-

"వానూకి నీమీద చెడు అభిప్రాయం ఏముంటుంది?"

"వానూకి కాపోతే రాధకి" అన్నాడు సాలోచ నగా. సీతారాం సాభిప్రాయంగా అతనివయిపు చూసి మెల్లగా అన్నాడు-

"రాధకి మాత్రం – నీమీద చెడు అభి ప్రాయం ఉంటుందా!"

రాజు వాదన వ్యర్థమన్నగొంతుతో "ఏమో! మనం మరొక్క క్షణం ఆలస్యం చెయ్యకుండా పోలీస్‌స్టేషన్‌కి నడవటం మంచిది. వీళ్లిద్దరూ గూటికి చేరేనరికి మనం పోలీసుల్తో అక్కడకు చేరాలి"

సీతారాం నిశ్చయానికి వచ్చినట్లులేచి గది లోకి వెళ్లి బట్టలు మార్చుకువచ్చాడు. రాజూ తయారయ్యాడు. ఏదో అనుమానం వచ్చిన ట్లుగా అడిగాడు-

"పోలీస్టేషన్‌కేనా?"

"పద... చెబుతాను" అంటూ ముందుకు దారితీశాడు.

చీకటిలో కారుదీపాలు దోవచూసుకుంటూ బయలుదేరాయి. సరిగ్గా టైము రెండూ యిర వై.

★ ★ ★

అర్ధరాత్రివేళ నిద్రాభంగం చేసినందుకు డీయస్పీ మూర్తి మొహంలో ఏర్పడిన చికాకు రాజుని చూడగానే కాస్తంత పక్కకి తొలగింది.

"కంగారుపడ్డావా?"

సోఫాలో సెటిలవుతూ అన్నాడు రాజు.

"యిదేమయినా పంజాబా? అర్ధరాత్రి తలుపు తడితే గాభరాపడటానికి- " పెద్దగా నవ్వాడు మూర్తి.

"అవునవును! అక్కడయితే మీరూ భయప డతారు. మరెక్కడయినా మాలాంటి సామాన్య పౌరులే భయపడతాం. వచ్చింది మీరా- దొంగలా అని" అంతకన్న చిన్నగా నవ్వాడు రాజు.

ఆ నవ్వులూ చనువూ సీతారాంకి కొత్తగా ఉన్నాయి. రాజు హఠాత్తుగా ఏదో గుర్తువచ్చిన ట్లు కాజువల్ గొంతుతో అన్నాడు.

"బైదిబై... ఈయన సీతారాం. నా చెల్లెలు భర్త. సెంట్రల్ గవర్నమెంట్ గెజిటెడ్ ఆఫీ సర్" అంటూ పరిచయం చేసి వచ్చిన పని చెప్పాడు.

అతను మాట్లాడుతుండగానే సర్కిల్‌కి ఫోన్




చేశాడు మూర్తి. వేణుగురించి రాజు మాట్లాడు తూంటే సీతారాం మధ్యలో అన్నాడు.

"అతను మా అబ్బాయి క్లాస్‌మేట్. జరిగిన దానికీ అతనికీ ఎలాంటి సంబంధమూ లేదు సార్! మంచి కుర్రాడే. నోరు కాస్త పెడసరం. రాజుకి అతను నచ్చలేదు- అంతే!"

"ఇలాంటి కుర్రాళ్లే ఇప్పుడు మా డిపార్ట్ మెంటు ప్రాణాలు తోడేస్తున్నారు. అయినా మీకు అనుమానం లేనపుడు మేం అతన్ని ముట్టుకోంలెండి"

అతనలా అంటున్నప్పుడు రాజూ అతనూ తనకి అర్థంగాని ఏదో ధ్వనితో మాట్లాడుకుంటు న్నట్లు సీతారాంకి అనుమానం వచ్చింది.

సర్కిల్ వచ్చాడు.

మిస్సింగ్ కంప్లైంట్ తీసుకోమనీ, ట్రాఫిక్‌కి ఫోన్‌చేసి రోడ్డు ప్రమాదాల గురించి భోగట్టా చేయమనీ, ఓ కానిస్టేబుల్‌ని వెంట పంపించి హాస్పటల్స్‌నూ మార్చ్యురీని చూపించమనీ ఆదేశాలిచ్చాడు మూర్తి.

"ఫొటో తెచ్చారా?"

సీతారాం జేబులోంచి తీసి ఇచ్చాడు.

"కాపీలు తీయించి రైల్ స్టేషన్‌లోనూ, బస్ స్టాండులోనూ నిఘా వెయ్యి"

"అలాగే సార్!" ఆదేశాలను మననం చేసు కొంటున్నట్లు తలూపాడు సర్కిల్.

మర్నాడు కలుస్తానని సెలవు తీసుకున్నా డు రాజు. గుమ్మందాకా వచ్చి మూర్తి కరచా లనం చేసి వీడ్కోలు ఇచ్చాడు. అటెన్షన్‌లో ఉన్న సర్కిల్ అది చూసి మరింత అటెంటి వ్‌గా వాళ్లని వెంటబెట్టుకొని పోలీస్‌స్టేషన్‌కి బయల్దేరాడు.

గవర్నమెంటు ఆస్పత్రులలో దెబ్బలుతగిలి స్పృహలో లేనివాళ్లను చూశారు. ఉద యంనుంచీ మరణించిన అనామకుల శవాల ను చూశారు.

బయటకు వచ్చి వాంతి చేసుకున్నాడు సీతారాం.

వాళ్లతోబాటు వచ్చి అన్నీ చూపిస్తున్న కాని స్టేబుల్ చటుక్కున అతన్ని పట్టుకుని కూర్చో బెట్టాడు. పరుగెత్తుకు వెళ్లి నీళ్లు పట్టుకువచ్చా డు. ఈలోగా అందరినీ చూసి లోపల్నుంచి వచ్చాడు రాజు.

ఇంటికి బయల్దేరేనరికి అయిదు దాటింది.

కానిస్టేబుల్‌ని అతని స్టేషన్‌లో విడిచిపెట్టా రు.

అప్పుడే నగరం నిద్రలేస్తోంది.

పాలవానులు, దినపత్రికలవానులూ, సైకి ళ్లూ రోడ్లమీదకు వచ్చాయి. లోకల్స్ కోసం తయారవుతున్నారు ఉద్యోగస్తులు. ఫ్యాక్టరీల నుంచి షిఫ్ట్ కార్మికులను తీసుకుపోవటానికి బయలుదేరుతున్నాయి బస్సులు.

మానసికంగా శారీరకంగా పూర్తిగా అలసిపో యిన సీతారాం భుజంమీద చెయ్యివేసి కారు నడుపుతున్నాడు రాజు.

అతన్ని ఇంటివద్ద విడిచి విశ్రాంతి తీసుకో మని చెల్లెలికి ధైర్యంచెప్పి వెళ్లిపోయాడు.

సీతారాం నిద్రలేచి టైం చూశాడు. పన్నెండూ యిరవై. చటుక్కునలేచి ఆఫీసుకు ఫోనుచేసి తను రాలేకపోతున్నట్లు తెలియబర చాలనుకున్నాడు.

ఇలాంటి పరిస్థితిలో ఆకలిని పట్టించుకోని శరీరం అంతగాఢమయిన నిద్రను ఎలా ఆహ్వానించిందీ?

రాధ ఆత్రంగా అతని గదిలోకి వచ్చింది.

"డాడీ! రాత్రి వచ్చినతనూ మరొకాయనా వచ్చారు. మిమ్మల్ని నిద్ర లేపటానికి అమ్మ ఒప్పుకోలేదు" గాభరాగా అంది.

"పద... వస్తాను!" బాత్రూంకి వెళ్లి వచ్చాక హాల్లోకి వచ్చాడు. వీధిలో ఉన్నారు- దేవేంద్ర, మరో యువకుడూ!

"బయట నుంచున్నారేం లోపలికి రండి!"

"మర్యాదలు తర్వాత! వేణుని ఎందుకు అరెస్టు చేయించారు?" దేవేంద్రన్‌తో వచ్చిన వ్యక్తి అడిగాడు.

సీతారాం మత్తు పూర్తిగా వదిలిపోయింది.

"మీరనేదేంటి!!"

"తెల్లారగట్ల నాలుగు గంటలకు పోలీసులు వచ్చి వేణుని తీసుకువెళ్లారు. వానూ అనే కుర్రాడు మిస్సయినట్టు రిపోర్టు వచ్చింది. ఇంటరాగేషన్‌కి తీసుకువెళ్తున్నామన్నారు. మీ రు ఆశ్చర్యం నటించితే నమ్మటానికి మేం

ఫూల్స్ కాదు''

గబగబా ఫోన్ దగ్గరకు పరుగెత్తాడు సీతారాం.

కొన్ని నంబర్లు డయల్ చేశాక చివరికి దొరికాడు రాజు.

"వేణుని ఎందుకు అరెస్టు చేశారు?''

"అరెస్టు చేశారా?''

"రాజూ... నువ్వు యిన్నాళ్ళని ఇంత చెత్తగా చేస్తావనుకోలేదు. ఈ విషయం నేను మరిచిపోలేను. నిన్ను క్షమించలేను''

"తొందరపడకు సీతా! అరెస్టు చేసి ఉండరు. విచారించడానికి తీసుకువెళ్లుంటారు.''

"ఏదయితేనేం. ఎలాంటి సంబంధమూ లేని కుర్రాడిని మూయించెయ్యటం అన్యాయం. అతనే స్టేషన్లో దొరుకుతాడు?''

"నువ్వు పొరబడుతున్నావు బావా! ఇందులో ఏదో ఫోర్త్ప్లే ఉంది. పరీక్షా ఫలితాలు కేవలం మిష. మనవాడికోసం మనం గట్టిగా ప్రయత్నించటంలో తప్పేంలేదు''

"పటప్!

సీతారాం కొంతసేపటికి ఆవేశాన్ని అణుచుకున్నాడు. అందాకా ఫోనుని దూరంగా ఉంచాడు.

"అయామ్ సారీ రాజూ! వేణూ భద్రంగా బయటకు రావాలి. అందుకు బాధ్యత నీదే!''

రాజు జవాబివ్వటానికి టైం తీసుకున్నాడు.

"ఇట్సాల్ రైట్! నిజం చెప్పాలంటే ఆ కుర్రాడికి నేనంటే ఏమిటో తెలియబరచాలనుకున్నాను. నర్లే... నువ్వింత సీరియస్సవుతావనుకోలేదు. నీ కొడుకు పేరుతో నేనీ అవకాశాన్ని వాడుకున్నాను!! మరో పావు గంటలో వేణూ ఎక్కడున్నదీ తెలియజేస్తాను. ఓపిక పట్టు''

సీతారాంకి తన ఆవేశం పొరపాటన్న భావన పెరిగింది.

గట్టిగా నిట్టూర్చి వీధిలోకి నడిచాడు. వీధిలో నుంచున్నవాళ్లని లోపలికి పిలిచాడు. విషయం చెప్పాక అడిగాడు-

"మా వాసూ మీకు తెలుసా?''

"వేణుని కలవటానికి చాలామంది వస్తుంటారు''

"మీరెవరో చెప్పలేదు''

"నాపేరు షణ్ముగన్. మా తోపుడుబళ్లవాళ్ల యూనియన్కి వేణూ పని చేస్తుంటాడు. నేను దానికి కార్యదర్శిని''

సీతారాంకి వాళ్లనుంచి వాసూ సమాచారం ఏమీ దొరక్కపోగా వేణూ కార్యకలాపాలు అర్థంగాకుండా పోయాయి.

ఇరవై నిమిషాల తర్వాత రాజు ఫోన్ చేశాడు.

గడిచిన రాత్రి కలుసుకున్న సర్కిలే ఉంటాడని స్టేషన్ వివరాలు చెప్పాడు. ముగ్గురూ ఆటోలో స్టేషన్ చేరేసరికి ఒంటిగంట. సర్కిల్ బయటనుంచి వచ్చేసరికి రెండయింది.

"వేణుని ఇంకా విచారించలేదు సార్!'' అన్నాడు సర్కిల్.

"వాసూ తండ్రిని నేను. మా అబ్బాయి కనిపించటం లేదన్న రిపోర్టు ఇచ్చినది నేను. ఇందులో వేణూకి సంబంధం లేదని నేను మీ డియస్పీతో స్పష్టంగా చెప్పాను. పైగా మీరు వేణుని తీసుకువచ్చి పదిగంటలయిపోయింది. మీరింకా విచారించవలసినదేమిటో నాకు బోధపడటం లేదు''

ఫోన్ తీసి నంబర్ డయల్ చేస్తున్న సర్కిల్ సీతారాంని ఒక్క సెకను మాట్లాడవద్దన్నట్లు సైగ చేశాడు.

"యస్సార్! సీతారాంట. రాజుగారి మనిషి. మీతో మాట్లాడతారట''

రిసీవరుమీద చేత్తో మూసి-

"డీయస్పీ సాబ్ లైన్లో ఉన్నారు- మాట్లాడండి''

"హలో! నేను సార్! సీతారాంని. రాత్రి మీతో-''

"వేణుని తీసుకువచ్చినందుకు మీరు రాజుకి ఫోన్ చేశారుట. విచారణలో అతను యూనివర్సిటీ వీ.సీ మీద దాడి చేయబోతున్నట్లు ఆచూకీ దొరికింది. వివరాలు సర్కిల్ చెప్తాడు. అతని టైం పాడు చెయ్యకండి!''

ఫోను పెట్టేసిన క్లిక్ వినిపించింది.

"చెప్పానుగదాసార్. ఇంకా విచారణ పూర్తవలేదని'' నవ్వుతూ సీతారాం ముఖంలోకి చూశాడు సర్కిల్. అలా చూస్తూనే బెల్లు కొట్టాడు.





"కూల్‌డ్రింక్స్! నాలుగు" పురమాయించాడు.

"వీళ్లిద్దరూ ఎవరూ?" టోపీ తీసి టేబుల్ మీద ఉంచి చేతివేళ్లు విరుచుకుంటూ అడిగాడు.

"నాపేరు షణ్ముగన్. ఇతడు తేవేంద్రన్. వేణూ మా బస్తీలోనే ఉంటాడు"

సీతారాం తేరుకొని బలహీనమయిన గొంతుతో అన్నాడు.

"మా రాజుకి ఫోన్ చేయవచ్చా?"

"ముందా డ్రింక్ తీసుకోండి" అన్నాడు తను తీసుకొంటూ.

ఖాళీ సీసాలు తీసుకుపోయాక సర్కిల్ అన్నాడు.

"రాజుగార్కి ఫోన్ చేస్తారా? ఎందుకుసార్? వీసీ మీదకి కుర్రాళ్లంతా వెళ్తున్నారు. ఈమేరకు అటునుంచి ఎలాంటి కంప్లయింటూ లేదుగాని ఈ కుర్రాడిని ఆపాలా లేదా అన్నది తెలితే మీకు పూర్తి సమాచారం ఇస్తాను. బయట కూర్చోండి-"

పది నిమిషాల తర్వాత సర్కిల్‌నుంచి పిలుపు వచ్చింది.

వేణూ కుర్చీలో కూర్చుని కనిపించాడు. సీతారాంకి ఊపిరి సలిపినట్లయింది.

"ఈ కుర్రాడిని వదిలేస్తున్నానుసార్! రాజూగారికి, డీయస్పీసార్‌కీ తెలియజేశాను. జరిగిన దానికి సారీ చెప్పమన్నారు రాజుగారు. సాయంత్రం కలుస్తారట. మీ అబ్బాయి అచూకి అందగానే తెలియజేస్తాను"

స్టేషన్‌నించి బయటపడేదాకా సీతారాం వేణూతో చూపు కలపలేకపోయాడు. తనమూలంగా జరిగిందానికి సారీ అందామనుకున్నాడు. అయితే పోలీసులనుంచి అంత వెంటనే తప్పించగలిగినందుకు ఏర్పడిన కించిత్తు గర్వంతో ఆ భావన వెనకబడింది. బింకంగా అన్నాడు.

"ఏమయినా అన్నారా నిన్ను?"

"పోలీస్టేషన్‌నుంచి వచ్చేవాళ్లను ఏమన్నా చేశారా?" అని అడగాలి అంకుల్. వేణూ గొంతులో ఎలాంటి కోపమూ, వ్యంగ్యమూ లేవు.

సీతారాం కొంత సర్దుకున్నాడు. పోలీసుల గురించి ఏదయినా అంటారన్న తన ఆలోచనకూ, చేస్తారన్న అతని ఆలోచనకీ మధ్య ఏదో తరాల అంతరమున్నట్లనిపించింది.

షణ్ముగన్, తేవేంద్రన్‌లతో మాట్లాడి వేణు వాళ్లను పంపేశాడు.

"మీరు నిద్ర లేస్తూనే నాకోసం వచ్చేశారని మావాళ్లు అన్నారు. ఏం తాగలేదు. తినలేదుట. పదండంకుల్. హోటల్‌కి వెళదాం"

సీతారాం నడుస్తూ అన్నాడు.

"అయామ్ సారీ వేణూ! ఇదంతా మారాజు తొందరపాటు ఫలితం"

"పోన్లెండి అంకుల్! వాళ్లకి కావల్సిన సమాచారం ఇచ్చేశాను. చాలా మర్యాదగా చూశారు"

సామ్రాట్ హోటల్‌లో బాంబే థాలీకి ఆర్డర్ ఇచ్చారు. ముందుగా తెచ్చిన సూప్‌ని చప్పరిస్తూ అన్నాడు వేణు.

"అన్నీ మన మంచికే అంకుల్! ఫలితాల గురించి గొడవ అవొచ్చని ముందుగానే యూనివర్సిటీ, ప్రభుత్వమూ ఊహించి ఉండాలి. ఫలితాలు నిన్ననే వెలువడినా రెండురోజుల క్రితమే ఫలితాలు విడుదల చేసే సందర్భంలో విద్యామంత్రి ఇచ్చిన సమాచారం పత్రికలలో వచ్చింది. నిన్ననే శాసనసభలో దీనిమీద ప్రతిపక్షసభ్యులు ప్రశ్నలు వేశారంటే ఎవరో ఒకరు అటు ప్రభుత్వమో యిటు ప్రతిపక్షమో దీనిని పట్టించుకొనే ఆలోచనలో ఉందన్నమాట. ఈ నేపథ్యంలో నా ప్రయత్నాలకు ప్రచారం రావాలంటే నేను ఓ మనిషిగా జర్నలిస్టులు గుర్తించాలంటే పోలీసులు ఓమారు నిర్బంధంలోకి తీసుకోవాలి. వాళ్ల అనుమానాల కోసం వాళ్లు పట్టుకుంటే.. మనం..." అంటూ ఆగాడు వేణు.

అతను పూరీలు తింటూన్న పద్ధతిని చూస్తూ మాటలు వింటున్నాడు సీతారాం. వేణూ చటుక్కున ఆపి అతని వయిపు సంశయంగా చూశాడు.

"చెప్పు వేణూ"

"మీరు నాకు మాట ఇవ్వాలి. యూనివర్సిటీ హాస్టల్‌లో సమావేశానికి మీరు తప్ప




కుండా రావాలి''

''నేనా! నేనూ'' ఏదో చెప్పబోయాడు.

''మీరు రావాలి అంకుల్! మీలాంటి తట స్థులవల్లే మా బలం పెరుగుతుంది''

''తటస్థులా?''

''మీరు ఏ రాజకీయపార్టీకి చెందనివాళ్లు గద అంకుల్?''

సీతారాం క్షణకాలం అతనిని అనుమా నంగా చూశాడు. మెల్లగా అడిగాడు-

''నువ్వే పార్టీ మనిషివి?''

వేణూ నవ్వాడు. ''ఈ ప్రశ్నే పోలీసులూ అడిగారు అంకుల్. వాళ్లకేం చెప్పానో తెలుసా? నేను కేవలమూ విద్యార్థిని, విద్యార్థివర్గ ప్రయో జనాలే నావి''

అతను నిజం చెప్పటం లేదని సీతారాంకి అనిపించింది. నొక్కి నొక్కి ప్రశ్నించవలసిన అవసరంగానీ చనువుగానీ తనకేమున్నాయి?

భోజనం అయాక బిల్లు చెల్లించాడు సీ తారాం.

ఇద్దరూ బయటకు వచ్చారు. ఆపుకోలేక అడుగుతున్నట్లు మామూలుగా అడుగుతున్న ట్లు అడిగాడు సీతారాం.

''వాసూ గురించి నీకేమి తెలీదా వేణూ?''

వేణు తడబాటుగా చూశాడు. మెల్లగా నవ్వాడు. అతని చూపు నిబ్బరంగా మారింది.

''నిజం చెప్పాలంటే నాకు వాసూ గురించి పూర్తిగా తెలును. కానీ ఈరోజు నా అభిప్రాయా న్ని మార్చుకోవలసి వస్తోంది. ఎంత ఆలో చించినా వాడిలా ఎందుకు చేశాడో నాకు అర్థంకావటం లేదు''

''వాసూ నీలాగే కమ్యూనిస్టా?''

''నేను కమ్యూనిస్టునంటారు. నన్నలా ఎవర యినా అంటే''

''అదికాదు వాసు...'' సంశయంగా చూశా డు.

''వాసు రాజకీయాల్లోకి దిగాడా? రాజకీయా భిప్రాయాలు ఉన్నాయా? ఇవన్నీ మీ ప్రశ్నలు. ఓవిధంగా మీ భయాలుకదా అంకుల్''

''అవొక్కటేనా నాభయాలు. డ్రగ్స్... డ్రింక్స్... యింకా ఎన్ని యువకులకు అందు బాటులో ఉన్నాయి! వీటికి యువకులు అల వాటుపడటానికి కారణం తలిదండ్రులే; వాళ్ల అనాదరణే, వాళ్ల స్వసుఖాకాంక్షే... వాళ్లే వాళ్లే అని ఎంత ప్రచారం జరిగిపోతోంది- టీవీలో కంట్లో బొమ్మ కట్టి మరీ చెబుతున్నారు. అది ఎంత నిజం? ఎంత అబద్ధం? నా వాసూ గురించి ఎంత భయమో ఏం చెప్పను- ఎలా చెప్పను?''

అందామనుకున్నాడు సీతారాం.... కానీ,

మితభాషీ, అంతర్ముఖుడూ అయిన అత నుతన భావాలను కొత్తగా పరిచయమయిన ఆ కుర్రవానితో పంచుకోలేకపోయాడు.

''వాసు.. నాకు వాసు కావాలబ్బాయ్! ఈ మీటింగులూ గొడవలూ నాకు పడవు. వాడి గురించి నువ్వేమయినా ఆరాతీసి నాకు చెపితే అంతకుమించిన సాయం ఉండదు'' అన్నా డు సీతారాం.

వేణూ చూపుల్లో మార్పు లేదు. సీతారాం చూపు తప్పించాడు.

''మిమ్మల్ని అర్థం చేసుకోగలను అంకుల్! నాకే సమాచారం దొరికినా వచ్చి చెప్తాను. వీలయితే మీటింగ్‌కి రండి... సెలవ్!''

వేణూ వెళ్లిపోతుంటే సీతారాం నడిరోడ్డు మీద నిలబడిపోయాడు.

అటూ ఇటూ వస్తూపోతున్న వాహనాలతో ఆరోడ్డు ప్రవాహంలా ఉంది. ఫుట్‌పాత్‌మీద నుంచున్న తనను పట్టించుకోకుండా ఆ ప్ర వాహం కదిలిపోతోంది. రకరకాల ఆలోచనలు. ఆటో ఎక్కాడు సీతారాం.

జనాన్నీ ట్రాఫిక్‌నీ చీల్చుతూపోతోందో- వాటితో కలిసిపోతోందో ఆటో- అందులో కూర్చు న్న సీతారాంకి తెలీలేదు.

వేణూ వయసులో తనకీ దేశభక్తి తెలును. చైనా యుద్ధంరోజుల్లో తనూ రేడియో దగ్గరే ఉండేవాడు. స్కూళ్లలో ఉపన్యాసాలు సాగేవి. చైనా నశించాలంటూ నినాదాలు చేసేవారు. హిందీ వ్యతిరేక ఉద్యమం వచ్చింది. హిందీ పరీక్షల సర్టిఫికెట్లు కాల్చి పారేసినవాళ్లలో తనూ ఉన్నాడు. నెహ్రూగారు పోయిన రోజుల్లో మూడు రోజులు పక్షిణీపట్టాడు తను. రాజు నవ్వేవాడు. అతను తర్కించేవాడు. తనని

తిట్టేవాడు. తన నమ్మకాలను మార్చేవాడు. చివరికి తను కేంద్రప్రభుత్వోద్యోగంలో చేరా డు. అతను కాంట్రాక్టులో దిగాడు. హెూటలు వ్యాపారంలో దిగాడు. చివరికి అతని పలుకుబ డితోనే తనకి ఈ ఊరికి బదిలీ అయింది. ఏదో చిన్న యిల్లు కట్టుకోగలిగాడు. జీవనవేగంలో తనకూ దేశానికీ మధ్య సంబంధం సన్నగి ల్లింది. పేపరు చదివినపుడు ఓ రకమయిన మత్తూ- ఎలక్షన్ల సమయంలో మరికొంత మత్తు ఏర్పడుతుంటాయి. తనకి ఎప్పుడు ఎలా కలి గిందోగానీ ప్రతిపక్షాలన్నీ రైటనీ ప్రభుత్వపక్షాల న్నీ తప్పనీ ఓ నిశ్చితాభిప్రాయం ఏర్పడిపో యింది. రాజు చేసే వాదనలవల్ల అతనిపట్ల లోలోపల ఉన్న ఓ విముఖత వల్ల అది కలిగిందేమో! పోతే తనకి ఓ భయం ఎప్పుడో పట్టుకుంది. దేవుళ్లకి బాబాలకీ మతాలకీ రాజ కీయాలకీ అన్నింటికీ లేదా కొన్నింటికి దగ్గరవు తారు ఈ భయంవల్లనే!

చివరికి తన భయం నిజమయింది.

వాసుగాడు దారి తప్పాడు. పరీక్ష తప్పాడు. వేణులాంటివాళ్ల సాహసంలోబడి తను ఇచ్చిన స్వేచ్ఛను దుర్వినియోగం చేసుకున్నా డు.

సీతారాం ఇంటికి చేరాడు. తల్లీ కూతురూ ఎదురువచ్చారు. ఇద్దరి కళ్లలోనూ గాభరా!

"వాసూగురించి ఏమయినా తెలి సిందాండీ?"

"నే వెళ్లింది వేణూని విడిపించటానికి"

"అన్నయ్యా చెప్పాడండీ! వేణూకి వాసూ ఎక్కడుందీ తెలుసూ అని"

సీతారాం చూపుకి శారద నోరు మూతబడిపో యింది. ఆమె గబగబా వెళ్లిపోయింది. సీ తారాం బట్టలు మార్చుకుని మంచంమీద నడుం జారేశాడు.

గుమ్మం ముందు రాధ తచ్చాడుతున్నట్లని పించింది.

"రాధా!"

చటుక్కున వచ్చింది "ఏం డాడీ?"

ఆమె మొహంలో ఆందోళన కనిపిస్తోంది. తండ్రి పరిశీలనగా చూడటంతో అంది "అమ్మ భోజనానికి రమ్మంది"

"అయిపోయిందని చెప్పు "వేణూని ఇబ్బందిపెట్టానన్న ఫీలింగ్‌నుంచి తప్పించుకో టానికి ఖరీదయిన హెూటల్‌కి తీసుకువెళ్లా డు. అయితే దానిని గొప్పగా రాధతో చెప్పలేక పోయాడు.

రాధ ఇంకా నిలబడే ఉంది.

"ఏమిటి?"

"వేణూని విడిచిపెట్టారా డాడీ?"

సీతారాం జవాబివ్వలేదు. సహజంగా తండ్రి దగ్గరున్న భయాన్ని మరిచి అడిగింది రాధ.

"వేణూ క్షేమంగా ఉన్నాడా డాడీ?"

"పోలీసులు వదిలేశారు-"

ఆమె మొహంలో వెలుతురు విచ్చుకుంది. వెళ్ళిపోటానికి వెనక్కి తిరిగింది. తలుపును సమీపిస్తూండగా-

"రాధా-"

వెనక్కితిరిగింది. "ఏండాడీ?" అంది కొంచెం ఆగి-

ఓమారు పరిశీలనగా చూసాడు-

"ఏం లేదులే... వెళ్ళు!"

అలాంటి ప్రశ్న ఎలా వేయటం?!

అతనినేదో నీరసం ఆవహించినట్లయి కళ్లు మూసుకున్నాడు.




పదిరోజులు గడిచిపోయాయి.

మొక్కలు నీళ్లులేక వాడిపోయినట్లు సీతా రాంకి అనిపించింది. పైపు తీసుకుని నీళ్లు పోయటం మొదలుపెట్టాడు. ఇంటిముందు న్న ఖాళీస్థలంలో మొక్కలు వేసాడు తను.

వాసూ ఎంత శ్రద్ధగా చూసేవాడూ!

పోస్టుమాన్ గేట్ దగ్గర కనిపించాడు.

సీతారాంని చూసి నమస్తే చెప్పి బాక్సులో వేయకుండా ఉత్తరాలు అందించాడు.

వాసూ ఆచూకీ కోసం తను పంపిన తంతిల న్నింటికీ వెంటనే జవాబులు వచ్చాయి. వాళ్ళే తిరిగి సానుభూతిగానూ, ఆందోళనతోనూ ఉత్తరాలు రాస్తున్నారు. ఏం జవాబిస్తాడూ!

"భగవంతుడు మంచివాళ్ళకు ఎప్పుడూ అన్యాయం చేయడు వాసూ తిరిగివస్తాడు" అని ఒకరు రాస్తారు; "ఇక్కడ అంజనం వేయించానూ మా మేనల్లుడు క్షేమంగా ఉన్నాడురా తమ్ముడూ నీకు నమ్మకాలు లేకపోయినా వాడి పేర రుద్రాభిషేకం చేయించేను. గ్రహ శాంతులూ దానాలూ జరిపిస్తున్నాను" అంటూ అక్కయ్య రాసింది.

శారదపేరున తిరుమల తిరుపతి దేవస్థానం నుంచి ఓ ఉత్తరం.

ఆఖరుగా ఓ బుక్‌పోస్టు ఉంది. అందులో ఓ కరపత్రం ఉంది.

ఆర్గనైజేషన్ ఫర్ డెమొక్రటిక్ రైట్స్ ఆఫ్ స్టూడెంట్స్ అండ్ పేరెంట్స్ వారు శారద సీతారాంలు మెంబర్లుగా చేరినందుకు కృతజ్ఞతలు తెలియజేసారు. గడచిన సమావేశం వివరాలు ఇచ్చారు. సమావేశంలో కొన్ని తాత్కాలిక కమిటీలు ఏర్పడ్డాయి. నగరంలోని కళాశాలల్లో విద్యార్థి సంఘాలవారిని కలుపుకు వచ్చే పని వేణూ ఆధ్వర్యంలోని కమిటీకి అప్పగించబడింది. లాయర్లు, టీచర్లూ, వైద్యులూ మొదలయిన వర్గాల మద్దతును కోరుతూ విజ్ఞప్తి చేయబడింది. పరీక్షా ఫలితాల గురించి ఓ సర్వే నిర్వహించదలచాము. అందులో ముఖ్య అంశాలు పరీక్షా ఫలితాలలో చెప్పుకోదగ్గ మార్పు ఉందా? ఎంత శాతం? ఈ తగ్గుదలకు కారణాలు ఏమిటి? ఇది సామాన్యమైన తగ్గుదలా? ప్రత్యేకమయినదా? సర్వేచేయవలసిన అంశాలమీద సూచనలు కోరుతున్నాం! సర్వేచేసే ప్రముఖుల పేర్లను వచ్చే సమావేశంలో ఖరారుచేస్తాం. సభ్యులందరూ సమావేశాలకు హాజరయి తగిన సూచనలు అందించటం ద్వారా ఉద్యమనిర్మాణానికి సహకరించవలసిందిగా కోరుతున్నాం.

ఆ కాగితాలను పక్కనపడేసాడు సీతారాం! ఈ కరపత్రాలూ ఉద్యమాలూ అంతా ఎందుకో బోగస్‌గా అనిపిస్తోంది.

ఓరోజు అతను ప్రిన్సిపాల్‌కి ఫోన్‌చేసి మార్కులలిస్టులు వచ్చాయా అని అడిగారు. వచ్చాయనగానే వెళ్ళి వాసూ కార్డు తీసుకున్నాడు. అన్ని పేపర్లలోనూ సింగిల్ డిజిట్స్ ఉన్నాయి. ప్రిన్సిపాల్ సీతారాంని కూర్చోబెట్టుకుని అన్నాడు-

"వాసూ మా కాలేజీలో బెస్ట్ స్టూడెంట్! ఇలా ఎలా జరిగిందో మాకూ అంతుబట్టడంలేదు. చాలామంది విద్యార్థులు అనుకున్నట్లుగా పాసవలేదు. వాల్యూయేషన్‌లో ఇలాంటి అవకతవకలు జరగటం కష్టం. ఏదో కొంతమేరకు జరిగినా అది చాలా తక్కువశాతం! అది ఎప్పుడూ ఉంటుంది! మీ వాసూ గురించి చింతిస్తున్నాను"

"వేణూ- ఎలాంటి వాడంటారూ?" సీతారాం అడిగాడు.

కళ్ళజోడు తీసి టేబుల్‌మీద ఉంచాడు ప్రిన్సిపాల్.

"అదొక్కటే వాసూలోపం. వేణూలాంటి కుర్రాళ్ళు తాము చెడటమేకాదు- నలుగురినీ చెరుస్తారు-"

"ఫస్ట్‌క్లాస్ తెచ్చుకున్నాడని విన్నానే-"

"చదువులో ఫరవాలేదులెండి. స్టూడెంట్ యూనియన్ ప్రెసిడెంట్‌గా నన్నుముప్పుతిప్పలు పెట్టాడు. ఇంతకుముందు యూనియన్‌వాళ్ళకు పాపభీతీ దైవభక్తీ ఉన్నాయి. ఈ వేణూ నాస్తికుడు! మొండీ జగమొండీ! పాతవాళ్ళు అప్పుడప్పుడు ఏడిపించేవారు. వీడు నిరుడంతా నన్ను నిత్యమూ నిప్పులమీద పరుగెత్తించాడు-"

"అతని సావాసం వల్ల వాసూ పాడయ్యాడంటారు"

"ఏమో... నిజం చెప్పాల్సివస్తే ఈ కుర్ర తరం మీద నాకు గౌరవంలేదు. ప్రిన్సిపాల్నీ, పెద్దవాడినీ గనక విద్యార్థులను ప్రేమిస్తానుగానీ వీళ్లను అర్థంచేసుకోటం నావల్లకానిపని. లోపం వాళ్లదో నాదో! చురుకుగా ఉండే కుర్రాళ్లంటే నాకు రోజురోజుకీ కోపం పెరిగిపో




తోందండీ?-''

''ఎందుకంటారూ-?''

''వెరీవెరీ సింపుల్! నేను ప్రిన్సిపాల్‌ని గనక-''

అర్థంకానట్టు చూసాడు సీతారాం. ప్రిన్సిపాల్ నవ్వాడు-

''మాస్టారూ... మా లెక్చరర్స్ ఉన్నారుకదా! వాళ్ల పని ఏంటి? లెక్చర్లివ్వటం! చదువుచెప్పటం! చిత్తశుద్ధి ఉన్నవాళ్ళూ, బాధ్యత ఉన్నవాళ్ళూ చెప్తారు. అదేదీ లేనివాళ్లు కాలక్షేపం చేసేసిపోతారు. ఇక పోతే స్టూడెంట్స్- విద్యార్థులు. వాళ్ళని విద్యార్థులూ అనకూడదండీ- ఉద్యోగార్థులూ అనాలి; కట్నార్థులు అనాలి. వాళ్లకి విద్య అంటే డిగ్రీ! ఓ కాగితంముక్క. వాళ్ల విద్యకీ వాళ్ళ సంస్కారానికీ జీవితసౌందర్యానికి సంబంధం వాళ్ళు ఎరుగరు. విద్యకీ దేశానికి సమాజభవిష్యత్తుకీ మధ్య లంకె వాళ్లు చూడలేరు! తల్లిదండ్రులు వాళ్ళని తోస్తారు. ఈ వయసులో మరేంచేయాలో తోచక వాళ్ళు వస్తారు! ఇంటి దగ్గరకన్న మరింత స్వేచ్ఛకోసం వస్తారు! తమలాంటి వాళ్ళగుంపు దొరుకుతుంది గదా అని వస్తారు. సినిమాహాల్లోకి ఓ వినోదంకోసం వెళ్తే కాలేజీకి మరో వినోదంకోసం వస్తారు. ఈ మందలో ఏదో శాస్త్రం చెప్పినట్టు- విద్యార్థులు విద్యార్థుల్లోనూ ఉన్నారనిపిస్తుంది- మార్కులు తెచ్చుకునే వాళ్లనుచూస్తే! ఇక వాళ్ళనీ వీళ్ళనీ వదిలేస్తే ఈ ప్రిన్సిపాల్‌గాడనే అక్కువక్షి ఉన్నాడే వీడు ఓ పెద్ద బఫూన్! విద్యార్థులని అదుపులోపెట్టాలి. లెక్చరర్స్‌ని అదుపులో పెట్టాలి. వీళ్ళనీ వాళ్ళనీ మోటివేట్ చేయాలి. చాలావుంది.చెప్పటానికీ వినటానికీ బ్రహ్మాండంగా ఉంది. స్టూడెంట్‌ని గదమాయిస్తే నాబాబు మంత్రిగారి తోడల్లుడంటాడు. నాబావ స్వయంగా మంత్రేనని- లెక్చరర్ అంటాడు. నా బాబూ బావా ఎవరూ కాకపోగా లేనేలేరని ఏడవాలి ప్రిన్సిపాల్‌గాడు! 'ఇన్నాళ్ళూ నువ్వు చదువుచెప్పావూ నీకు అనుభవమూ ఉంది, అర్హతాఉంది గనక- ప్రిన్సిపాల్‌ని చేస్తున్నాం!' అంటారు పెద్దలు.

దీనికిగూడా ఎలక్షన్లు పెట్టేస్తే నాలాంటివాడు ఈ కుర్చీకి ఆమడదూరంలో ఉంటాడు. నే చేసే అజమాయిషీ ఏమిటంటే సెలవలు ఇవ్వటమూ, నోటీసులూ జీతభత్యాలూ అందేట్టు చూడటమూ, వాళ్ళకీ వీళ్ళకీ మధ్య రాయబారాలు చేయటమూ అలకలు తీర్చటమూ, క్షమార్పణలు కోరటమూ కోరించటమూ... ఇది మాస్టారూ ఈ ప్రిన్సిపాల్ బతుకు''

సీతారాం అతని సొద విని ఓ వెర్రినవ్వు నవ్వాడు.

''అయితే ఓ తమాషా ఉందండీ! ప్రిన్సిపాల్ అయిన కొత్తలో నేను లెక్చరర్స్‌ని ద్వేషించటం మొదలుపెట్టాను. వాళ్ళలో చిత్తశుద్ధి ఉండాలి. వయసు వచ్చి బుద్ధి ఎదిగి ఎక్కువ చదువుకున్నవాళ్ళు ఎక్కువ కన్సిడరేట్‌గా ఉండి, వాళ్ల ప్రవర్తనతో విద్యార్థులను ప్రభావితం చేసే అవకాశం ఉందనుకునేవాడిని. నేనూ లెక్చరర్‌గా ఉన్నప్పుడు స్టాఫ్‌రూంలో పాఠాలగురించి చర్చలకన్న జీతం స్కేళ్ళ గురించీ, కులాల గురించీ ఎక్కువగా మాట్లాడుకోటం వినివిని దానిని అడ్డుకోటం తెలీక నేనే ప్రిన్సిపాల్‌ని అయితే ఇది సాగనివ్వననుకున్నాను. మార్చిపారేస్తాననుకున్నాను. అదేదీ కుదరక నా గదిలో నేను ఒంటరినై లెక్చరర్స్‌ని ద్వేషించటంతో మొదలుపెట్టి విద్యార్థులను ద్వేషించటానికి ఎదిగాను. ఎంచేతంటే నాకు నిత్యం వచ్చేసమస్యల్లో చాలాభాగం వాళ్ళవేకావటం వల్ల, ఇదంతా వాళ్ళ క్రమశిక్షణారాహిత్యమే అన్పించటం వల్ల వాళ్ళని ద్వేషించటం ప్రారంభించాను. ఈ ద్వేషం చూపటానికీ, ప్రదర్శించటానికీ నాకున్న పరిధులు తక్కువనే జ్ఞానం విచ్చుకుని చివరకు ఏమయ్యానో తెలుసా సీతారాంగారూ?''

ప్రిన్సిపాల్ గట్టిగా నవ్వాడు.

సీతారాం నవ్వలేదు.

''నన్ను నేను రక్షించుకునేందుకు సిద్ధమయ్యాను. నోరున్న వాళ్ళని వదిలెయ్యటమూ లేనివాళ్ళను మొత్తటమూ నేర్చాను. నా నిత్యసమస్యలకు కారణమయిన విద్యార్థుల ఏక్టివ్‌నెస్‌ని అసహ్యించుకోటం అలవర్చుకున్నాను. కానీ- నా చదువూ, నా మనసూ - నాజ్ఞానమూ నా ప్రవర్తనను సమర్థించకపోవటంతో నన్ను నేనే ద్వేషించుకోటం మొదలుపెట్టాను''

ప్రిన్సిపాల్ గదిలోంచి బయటపడ్డాడు సీతారాం!



అతనిస్థితి అర్థంకాకపోయినా లోపం ఎవరిదో తెలీకపోయినా ఏదో లోపంఉన్నట్లే అనిపించింది.

ఫోన్ మోగటంతో సీతారాం ఆలోచనల నుంచి బయటపడ్డాడు.

రాజు లైనుమీద ఉన్నాడు.

"ఢిల్లీనుండి ఎప్పుడువచ్చావ్?"

"ఈరోజు ఫ్లయిట్‌కు వచ్చాను"

"పని అయిందా-?"

"వెళ్లింది రాజకీయనాయకుల దగ్గరకయితే అనుమానంగానీ, ఉద్యోగస్తుల దగ్గరకు గదా! ఎక్కడో నీలాంటివాళ్ళు వేళ్లమీద ఉంటారు-"

"నీ లెవల్ మనుమలకు ఉద్యోగస్తులతో పనిపడిందా- చిత్రమే!"

"ఏం చేస్తాం మరి? స్టేట్లో మనం అప్పోజిషన్ అయిపోయాం? బాబోయ్, నాకూ రాజకీయాలకూ పడదూ అంటే- నీ గతచరిత్రా, నీవర్గ స్వభావమూ మర్చిపోం గురూ- అంటారు యిక్కడి మనుమలు నామందు తాగేన్తూ"

"సర్లే... మీ చెల్లిని పిలవనా?"

"వద్దులే సీతా! వానూ విషయం ఏమైనా తెల్సిందా?"

"లేదు-"

"రాగానే నేను మూర్తికి ఫోన్ చేశాను-"

"నేనూ చేశాను రెండుసార్లు. లేడన్నారు. అలా అనిపించాడా అని అనుమానం వచ్చింది-"

"బావా... అవతలివాళ్ళు పోలీసులు! వాళ్ళని అనుమానించటం మహాపాపం-! రేపు సాయంత్రం మీ ఆఫీసువయిపు వస్తున్నాను. వచ్చి పికప్ చేసుకుంటాను- ఉంటావు గదా!"

ఇన్నాళ్ళూ ఆఫీసుకు వెళ్ళలేదని చెబుదామనుకున్నాడు.

"అలాగే ఉంటాను-" అన్నాడు ముక్తసరిగా.

మరునటిరోజు సీతారాంని తీసుకుని యింటికి వచ్చాడు రాజు. వస్తున్నప్పుడు వానూ పేపర్లు తిరిగిదిద్దించితే ఎలా ఉంటుందన్నాడు సీతారాం. వేస్తు- అన్నాడు రాజు. తన ఆలోచన ఎలా విడమరచాలో అర్థంకాలేదు సీతారాంకి. వానూకి మంచి మార్కులు వచ్చాయనీ, ఫలితాలు పొరపాటనీ రీవాల్యూఏషన్‌లో తేలితేఆ విషయం పేపర్లో వేయించవచ్చని ఆశ! మాటల్లో పెట్టి సీతారాం ఆలోచనని గ్రహించాడు రాజు.

"పరీక్ష పాసయిపోయినట్టు యిప్పుడే ప్రకటన యివ్వొచ్చుగదా! వచ్చేక చూసుకోవచ్చు" అన్నాడు రాజు.

విస్తుపోయాడు సీతారాం. రాజుకి వచ్చిన ఆలోచన తనకెందుకు రాలేదూ?

శారదను చూసి రాజు కలవరపడ్డాడు. బీపీ ఎక్కువగా ఉందనీ, డాక్టరుకి చూపించుకున్నాననీ, మందులు వాడుతున్నాననీ చెప్పింది. అన్నాచెల్లెళ్ళను ఒంటరిగా వదిలి బయటకూర్చున్నాడు సీతారాం.

లోపలినుంచి శారద ఏడుపువినిపిస్తోంది.

తనదగ్గర అంతలా ఏడవదు శారద.

తనమీద ప్రేమవల్లనా? అంటే తనూ ధైర్యం కోల్పోయి జబ్బుపడతాడనా? లేక తనవద్ద భయమా? చనువులేకపోవడమా?

ఏమయినా ఏడవగలిగితే బరువుతీరినట్టుంటుంది కాబోలు! ఏమో... ఏడుపు ఎలా వుంటుందో తనకేం తెలుసు? ఎప్పుడో ఎరిగినదే అయినా యిప్పుడు గుర్తేలేదు. స్నానాల గదిలో స్నానం చేసేటపుడూ ఒంటరిగా ఉన్నప్పుడూ ఎవరూ చుట్టుపక్కల లేరని సమ్మకం కలిగినపుడూ ఏడుద్దామని ప్రయత్నించాడు. ఏడుపు రాకపోగా తన ప్రయత్నాలు మతిచాంచల్యానికి నిదర్శనాలా?- అని భయం పట్టుకుంది. ఏదో ఒక పనిలో కుదురుకుంటేతప్ప తనను తాను చిక్కబట్టుకోడం కష్టమనిపించి ఓరోజు ఆఫీసుకు వెళ్లాడు. అక్కడ తనకు ఏర్పాటుచేసిన గదిలో తాను ఒక్కడే! తోటి ఆఫీసర్లు టీరూంలో మాత్రం కలుస్తారు. మిగిలిన సమయమంతా ఒంటరితనం! కొన్ని పాలసీలు చెయ్యటానికి నిర్ణయాలు తీసుకోటానికి, క్రింద ఉద్యోగులతో చర్చించటానికీ తగిన వాతావరణాన్ని ఒంటి గదిద్వారా కల్పిస్తుంది సిస్టమ్! అయితే యిలాంటి వ్యక్తిగత కష్టంలో అన్ని గంటల ఒంటరితనం ఎంత దుర్భరం! వస్తూన్న ఫైల్సు చదవటం, రిమార్కు్స





రాయటం యీ రొటీన్ పని కూడా తన మెద డుని భర్తీ చేయలేదన్నమాట. మరేదయినా పనిలో లగ్నమవాలి! వేణూ ఉద్యమంలో అర్థం ఉందా అసలు? అది ఏం సాధిస్తుంది?

తనకెందుకా గొడవ! కానీ మనను నలుగు రితో కలవచ్చు అంటుంది. కొత్త సమస్యలు, కొత్తముఖాలు, కొత్తపని- ఏదో వ్యాపకం. ఈ వయసులో శ్రమపడగలడా?

పేకాట మందు క్లబ్బులు యిలాంటివి ఎన్ని కంపెనీని యివ్వవూ! అవి అన్నీ మర్చిపోయేట ట్టు చేస్తాయేమో!

సీతారాం భుజం మీద చేయివేసి ముందు కువస్తూ కూర్చున్నాడు రాజు. "ఏమిటి సీతా- ఆలోచించేస్తున్నావ్?"

బలహీనంగా నవ్వి

"ఏమంటోంది మీ చెల్లి?"

"నీతో అనటానికి భయపడుతోంది. బాబా గారి దగ్గరకు తీసుకువెళ్ళమంటోంది"

"ఏమన్నావ్?"

"నీకంటే తప్పుతుందిగానీ నాకు తప్పు తుందా? వీలుచేసుకుని వెళ్దామన్నాను"

"నువ్వు నాకన్నా నాస్తికుడివిగదా- యిదంతా పిచ్చిలా అన్పించదూ?"

"ఒకప్పుడు అనిపించేది"

"ఇప్పుడూ?"

"అందరికీ ఏదోరకం పిచ్చి ఉండటమే మంచిదనిపిస్తోంది"

"ఎందుకనీ?"

"నిజం చెప్పమంటావా అబద్ధమా?"

"నువ్వు నిజమూ చెప్పలేవు, అబద్ధమూ చెప్పలేవు! రెండు విరుద్ధాభిప్రాయాలు చె ప్పావు! అందులో ఒకటి నిజమనీ రెండోది అబద్ధమనీ నీ ఏకాభిప్రాయం"

పకపకా నవ్వాడు రాజు.

"నువ్విలా మాట్లాడితే నాకింక బెంగ ఉండ దు బావా! బాధ మెదడుని తినెయ్యకుండా రక్షించుకోగలిగితే గుండెకీ శరీరానికీ మంచిది"

"నువ్వు నిజమూ చెప్పలేదు, అబద్ధమూ చెప్పలేదు"

"నిజం ఏంటంటే అందరికీ తలో పిచ్చి ఉంటే మాలాంటి తెలివయినవాళ్ళు మెరిగె య్యవచ్చు. అబద్ధం ఏమిటీ అంటే ప్రతి పిచ్చీ మనిషిని బాధలనుంచి ఏదోలా రక్షిస్తుంది"

సీతారాం దీర్ఘంగా నిట్టూర్చాడు.

"నేనూ ఓ పిచ్చి ఎక్కించుకోవాలనుకుంటు న్నాను"

"ఏమిటో అది!"

"వేణూ లేవదీస్తున్న విద్యార్థి ఉద్యమంలో చురుకుగా పాల్గోవాలని"

రాజు నవ్వాడు.

"అది ఓ పిచ్చి అంటావు.నర్లే... ఎక్కించుకొనే పిచ్చి ఏదో తొందరగా ఎక్కించుకో! ఖాళీలు భర్తీఅయిపోకుండా"

తెల్లబోయాడు సీతారాం.

"ఏం ఖాళీలు?"

"ఇలాంటి మూమెంట్స్ ఒక్కోమారు గాలి వాటుకి ఎదుగుతుంటాయిలే! తొలిదశలో రక రకాల పదవులు ఖాళీగా ఉంటాయి. నీకూ ఏదయినా దొరికితే – అది నాకూ మంచిదే!"

"నీకెలా మంచిదోయ్"

"ఎలా మంచిదో యిప్పుడేం చెప్పగలను? సొసైటీలో పైనున్నవాడు దేనినీ అశ్రద్ధచెయ్య కూడదు. ప్రతిచోటా లింకులు ఉండాలి. ఏలింకు ఎప్పుడు అవసరమవుతుందో ఎవడు చెప్పగలడంటావ్ బావా?"

సీతారాం ఓమారు ఒళ్ళువిరుచుకున్నాడు.

"నువ్వెంత స్నేహితుడివయినా బంధువ యినా నీకు ఈ సీతారాం లింకుగా ఉండదని నీకన్నా బాగా ఎవరికి తెలుస్తుంది రాజూ?"

రాజూ లేచి నుంచున్నాడు. టైము చూసు కుంటూ

"అవునవును! మరిచేపోయాను ఓ ఎంగేజ్ మెంట్ ఉంది"

అతను కొంతసేపటివరకూ రాజు వెళ్లినవ యిపే చూశాడు. క్రమంగా అతని కారు శబ్దం దూరమయింది.

సీతారాం బట్టలు వేసుకొని రాధని పిలిచా డు.

"మనం వేణూని కలవాలి- బయల్దేరు!"




రాధ అయోమయంగా చూసింది.

"తయారవ్!" నవ్వాడు.

అతని నవ్వు రాధకు ఎలా అర్థమయిందో గానీ ఉత్సాహంగా బయలుదేరింది.

★ ★ ★

"నాలుగు రోజుల క్రితం డాడీ, నేనూ నీ గదికి వచ్చాం తాళంకప్ప నీ బదులుగా దర్శన మిచ్చింది. ఎక్కడ తిరుగుతున్నావూ?"

"లక్షానొక్కవనులు నాకు! ఉపోద్ఘాతాలు మాని విషయం చెప్పు"

రాధ కొంటెగా చూసింది.

"డాడీ నిన్ను కలవాలనుకుంటున్నారు"

"ఎందుకూ..." అనుమానంగా అడిగాడు.

"ఏమో... నాకెలా తెలుస్తుంది?"

"ఒకే యింట్లో ఉంటున్నారు. మీ నాన్నగారి గురించే తెలీదా నీకు –"

"ఎలా తెలుస్తుంది వేణూ! మాతో చనువుగా ఉండరాయన"

"మనుషులంతా ఒకలా ఉండరు రాధా! సమీపంగా మసిలేవాళ్ళు కదలికలనుబట్టి ఎదుటివాళ్ల ఆలోచనలను గ్రహించవచ్చు. నువ్వు ప్రయత్నిస్తే మీ డాడీని అర్థంచేసుకోవచ్చు. మాట్లాడలేనివాళ్లకి తమని అర్థంచేసుకొజూసే వాళ్లమీద గురి ఏర్పడుతుంది"

"అన్నయ్యా గురించి అమ్మ మంచం పట్టిందా అమ్మతోనే సరిగ్గా మాట్లాడరు డాడీ! కానీ ఈమధ్య ఆయనలో చాలా మార్పు వచ్చింది. నన్ను పిలిచి ఏదో మాట్లాడదామను కుని ఏంలేదు వెళ్లిపో అన్నారు"

తేరిపారచూశాడు వేణు.

"కొంపదీసి నువ్వేమయినా పిచ్చిపిచ్చిగా వాగావా?"

"ఆ అవసరం నువ్వింకా యివ్వలేదు గదా!"

"అవును రాధా! నీవయసెంత? ప్రభుత్వం లెక్కల ప్రకారం చూసినా నీకు పెళ్లీడురాలే దు. ప్రేమా దోమాలాంటి పనికిమాలిన ఆలోచ నలకు నీకింకా యుక్తతరాలేదు రాధా!"

"ఇలాంటి సలహాలిచ్చే వయసు నీకు మాత్రం ఎక్కడిదీ? నువ్వు మెచ్యూర్డ్‌గా మాటలాడటంలేదూ –"

వేణు నన్నగా నవ్వాడు.

"నేను పుట్టింది అనాథగా! పెరిగింది యిత రుల దయమీద! నేర్చింది పోరాడుతూ బత కడం! ఈరకమయిన పరిస్థితులు నన్ను కొంత యుక్తిపరుడ్ని చేసి ఉండవచ్చు. నాలో ఉన్న ఆవే శమే కాకుండా కొంత ఆలోచనతో కూడా ఉండటా నికి నా ప్రత్యేక పరిస్థితులూ, నే చదివిన కొన్ని పుస్తకాలూ కారణం!"

రాధ నిట్టూర్చింది.

"ఏంకాదు! నీకు మొండిగా మాట్లాడ్డంవ చ్చు, నాకురాదు. నీకు మాటల్తో ఏడిపించ టంవచ్చు, నాకురాదు. నీకు నేనంటే లోకువ నాకు నువ్వంటే"

రాధ వాక్యం పూర్తిచేయలేదు. వేణూ తేలి కగా నవ్వాడు.

"నువ్వు చెప్పకపోయినా నీ మొహమూ వాలకమూ మీనాన్నగారికి కొంత అనుమానం కలిగించే ఉంటాయి"

రాధ మొహంలో అభిమానం చోటుచేసు కుంది.

"డాడీ ఏం అంత మీన్‌గా ఆలోచించరు! కావాలంటే మా అంకుల్‌గురించి అను... ఒప్పుకుంటాను"

"ఎందుకనీ? మీ నాన్నగారికి వయసుంది, అనుభవముంది. నీకంటే ఆయనను అర్థంచే సుకునే శక్తి వయసూ లేకపోవచ్చునేమోగానీ ఆయనను మభ్యపుచ్చే శక్తీ వయసూ మాత్రం లేవునుమా!"

"నీతో వాదించటం సరదాయేగాని నెగ్గడం నావల్ల కాదు కానీ యిప్పుడు వస్తావా నాతో మాయింటికి"

చటుక్కున అని నాలిక కరుచుకుంది రాధ.

"టైమెంత?"

"నాలుగు అవుతోంది" అంది రాధ.

"మీనాన్నగారు ఉంటారా యిప్పుడు?"

"ఉండరు"

"అయితే ఎనిమిది గంటలకు వస్తాను"

రాధ వెళ్లబోతూ ఒక్క సెకను అదోలా చూ

సింది. ఏమిటి సంగతన్నట్లు నవ్వాడు వేణు.

"నేను రమ్మన్నానని చెప్పకు"

"మీ నాన్నగారు మీన్‌గా ఆలోచించరు" నవ్వు దాచుకుంటున్నట్లు అన్నాడు.

రాధ వినవిసా నడుస్తూ వెళ్లింది.

రాధ ఇంటికి చేరుకునే వరకూ వేణు నవ్వూ, గొంతూ, మొహమూ వెన్నాడుతూనే ఉన్నాయి. వాటినన్నింటినీ ఆమె తనకు అనుకూలమయిన పద్ధతిలో పేర్చుకుంటోంది. చిత్రించుకుంటోంది. దృశ్య శకలాలను అనుసంధానంచేసే చిన్నిచిన్ని లింకులుగా ఆలోచనలు సాగేవయను ఆమెది.

బట్టలు మార్చుకుని కాఫీ కలిపి అమ్మకు యిచ్చి తను తాగింది రాధ. తన గదిలో మంచంమీద పడుకుంది కాస్సేపు. అప్పటికి ఆమెకి నచ్చిన, నప్పిన చిత్రం మనసుమీద స్థిరపడింది. ఏదో ఉల్లాసం ఆమెలో కదలాడుతూండగా ఫోను మోగింది.

"డాడీ వచ్చాక ఫోన్‌చెయ్యమని చెప్పు రాధా!" అన్నాడు రాజు.

"ఎందుకు?"

"నేను వస్తాను. అమ్మను చూడాలి"

రాధకి గాభరా వేసింది. రాజూ అంకుల్‌కీ, వేణూకీ పడదు. మామయ్యకి తనంటే ఎంత ప్రేమా! వేణూ మీద ఏదో ద్వేషం! ఎందుకో అర్థంకాదు. వేణూ వచ్చేరోజునే ఆయనావస్తే — యిద్దరూ ఎదురుబడితే —!?

"ఎన్ని గంటలకి అంకుల్"

"ఎంతకా... ఎనిమిదింటికి వేరేపనుందమ్మా- ముందే వస్తాను"

"అయితే డాడీని ఫోన్‌చెయ్యమంటావా?"

"అక్కర్లేదులే!"

రాధ కాస్త కుదుటపడింది. వేణూ వచ్చేసరికే అంకుల్ వెళ్లిపోతాడనుకుంది. కానీ ఆమె అనుకున్నట్లు జరగలేదు.

రాజూ సీతారాం కబుర్లు చెప్పుకుంటూండగా వేణూ వచ్చాడు. సీతారాంకి మాత్రం నమస్కరించి

"మీరేదో ముఖ్యమయిన పనిలో ఉన్నట్లున్నారు. కాస్సేపు బయట కూర్చుంటాను" అన్నాడు.

"అదేదో లోపలికి వచ్చేముందే ఆలోచించుకునుండాల్సింది అబ్బాయ్! ఫరవాలేదు- చర్చ నీగురించేలే!" అన్నాడు రాజు.

సీతారాం వేణుని కూర్చోమన్నాడు.

వేణుని చూసి పదిహేను రోజులయుంటుంది. కానీ అతని గురించి తరచు ఆలోచిస్తూనే ఉన్నాడు. ఆ కుర్రవాడిలో ఏదో శక్తి ఉంది. అది ఒకప్పటి తన స్వప్నం! ఈ కుళ్లిపోయిన సిస్టమ్‌లో తను యీ మాత్రమ 'యినా నిక్కచ్చిగా ఉండగలుగుతున్నాడూ అంటే ఆ శక్తి తాలూకు ఆనవాళ్లేవో యింకా మిగిలిపోయుండాలి! ఆ స్వప్నం వెనక ఒకప్పుడు తను పరుగుపెట్టినట్టే - వానూ పరుగు పెడతాడేమోననే తన భయం! వేణూకీ తనకీ ఎంత తేడా! సిన్సియర్ ఆఫీసర్‌గా తనకున్న పేరు ఆపేరు కోసం తను తాపత్రయపడటంవల్ల వచ్చిందా? తన నిక్కచ్చితనం వల్ల వచ్చిందా?

వేణూని చూడగానే అతను క్షణకాలం స్పందించాడు.

కొంతసేపటి క్రితం రాజు వేణూ గురించి మాట్లాడిన మాటలు చాలా దుర్మార్గంగా అనిపించి ఆ స్పందనకు తోడయినాయి.

వేణూ కూర్చున్నాక రాజు అతన్ని చూసినవ్వాడు

"ఆరోజు పోలీసులు నిన్ను వానూ గురించి విచారించడానికి తీసుకువెళ్తే అరెస్టు చేశారని ఎందుకనుకున్నావూ? చేస్తారనీ చేయాలనీ అనుకున్నావా?"

"అరెస్టు అందరికీ ఎట్రాక్షన్‌గదా! ప్రెస్ మంచి కవరేజ్ యిచ్చింది"

"ఆరోజు పేపర్లు ఫాలో అయ్యానోయ్! పరీక్షా ఫలితాలు పేరు చెప్పుకుని నువ్వేదో ఉద్యమమూ అదీయిదీ అని లైమ్‌లైట్‌లో కొస్తూంటే పాపం వాళ్లు నువ్వు వైస్‌ఛాన్సలర్ మీదకు దాడికి వెళ్తున్నావనే... మహా అన్యాయం!"

"వానూ మిస్సింగ్ పేరెట్టుకుని నన్ను తీసుకెళ్ళి మీరూ, యూనివర్సిటీ ఇన్యూచేసి పోలీసులూ నన్ను అట్టేబెడదామనుకున్నారు. సర్లే! అది నిజమేనని ఒప్పేసుకుంటే మంచిదనుకు





న్నాను. మధ్యలో ప్రెస్‌వాళ్లూ, పౌరహక్కుల సంఘాలవాళ్లూ తయారయిపోయారు''

"పోలీసులు నిన్ను వదిలేశారు. లోపల ఉంచలేక వదిలేసారనుకుంటున్నావు -''

"వాళ్ళగురించి నేనెప్పుడూ తప్పుడు అంచనాలు వేయను''

"ఎందుకు వదిలేసారంటావూ?''

"ఈ విషయం మీద మీతో చర్చలో నాకే మంత గిట్టుబాటు కనిపించటంలేదు''

రాజు తలవంకించుతూ తెచ్చిపెట్టుకున్న మెత్తదనంతో నవ్వాడు. అంతవరకూ వాళ్లిద్దరి మాటలూ వింటూ మార్చి మార్చి చూస్తున్నాడు సీతారాం. వేణూ వెనక ఆవేశమేగాక ఆలోచనా ఉందని అతనికి అనిపిస్తోంది. వానులో యిలాంటి ఆలోచనా, ఆవేశమూ తనకి ఏనాడూ కనిపించలేదు. కనిపించాలంటే తను చూడాలి. చూశాడా? భయంతో కళ్ళు మూసుకున్నాడా?

"అవునబ్బాయ్! నీకే లాభం లేకపోతే నువ్వు చర్చించవు. కానీ జస్ట్ నువ్వు వచ్చేముందు నీ గురించే మాంచి ఇంట్రస్టింగ్ టాపిక్ మావాడితో మాటాడుతున్నాను. అదేంటంటే''

అంటూ ఆగాడు.

వేణూ కూడా నవ్వాడు- చెప్పమనీ వద్దనీ తేల్చకుండా.

"నువ్వు చెప్పకపోయినా నేను చెప్పేస్తానోయ్! మావాడూ నీ మూమెంట్‌లోకి ఉరికెయ్యాలనుకుంటున్నాడు. దానిమీద కొంచెం వివరించాలనుకున్నాను. నిన్ను అరెస్టుచేసి వదిలేసిన సర్కిల్‌తో ఓరోజు పార్టీలో కూర్చున్నప్పుడు నీమీదకి సంభాషణ మళ్లింది మూడో రౌండ్‌లో.... మూడో రౌండ్ అంటే తెలుసా నీకూ?''

"ఎలా తెలుస్తుందీ? సరైన సావాసం లేకుండా?''

రాజు మొహం ఎర్రబడింది. సంభాళించుకున్నాడు.

"కొంచెం లూజ్ మాట వచ్చిందిలే! సావాసం ఏదయినా నీదేవ నిన్ను అక్కడికే చేరుస్తుంది! అందాకా యీ పాఠం తీసుకో! మొదటి రౌండ్‌లో ఎదుటివాడిని పట్టుకుందామని చూస్తావు! రెండో రౌండ్‌లో ఎదుటివాడిని మాటల్లో పెడదామని నువ్వు మాటల్లోపడతావు! మూడో రౌండ్‌లో ఎదుటివాడికి నీ తెలివితేటలు మచ్చు చూపించాలనుకుంటావు! నాలుగో రౌండ్‌లో నీ తెలివి తక్కువతనాన్నీ నీ లోపలి ఆలోచనలనీ

"ఈరోజు నాకు చాలా జ్ఞానం అబ్బుతున్నట్టుంది''

"ఆ సర్కిల్ మాటలు యధాతథంగా చెప్తే నీకింకా జ్ఞానం వంటబడుతుంది. మూసెయ్యాలంటే, తీసెయ్యాలంటే మన చేతిలోపనే బాసూ! – కుర్రాళ్ళకి చికిత్స చేసేటప్పుడు ఆడి జబ్బేదో ముందుగా తేలాలా? ఆ జబ్బు స్టేజీ మనం పట్టాల! మా లెక్కల ప్రకారం వీటిలో నాలుగు స్టేజీలున్నాయి. డెమొక్రటిక్కూ ప్రోగ్రెసివ్వూ మార్కిస్టూ రాడికల్లూ అంటారు- వరసాగ్గా ఆటెని! జబ్బునిబట్టి చికిత్స చెయ్యాల! అన్ని జబ్బులకీ తీసెయ్యటమే మందని మేం అనుకుంటాంగాని''

రాజు మాటలు ఆగాయి.

"మా మెలిమొగుళ్ళున్నారు! లీడర్లు! అళ్లు జబ్బుల్తో ఆడుకొంటారు! అళ్లు అందులో స్పెషలైజ్ చేసేశారు! అళ్ల ఆటసాగితే అది అళ్ల ప్రెబా అది తిరగబడితే మా దోషమూ అంటారు'' అంతకుముందు రాజు ఈ మాటలు చెప్పాడు. తనతో చెప్పినట్టే వేణూతోనూ చెప్తాడేమోనని ఎదురుచూస్తున్నాడు సీతారాం. కానీ ఈరోజుతను మాట్లాడింది చాలు అన్నట్టు ఊరుకోవటంతో కాస్తంత ఆశ్చర్యపోయాడు.

వేణూలో ఏమార్పులేదు. నిదానంగా ఉంద తని చూపు. ఎదుటిమనిషి దొరికాడనిపించినప్పుడు కలిగే చిన్నినవ్వేదో సీతారాంకి అనింది.

"చూశావా! నీ మేలుకోరి ఎంత మంచి సమాచారం చెప్పానో!''

"నా మేలుకోరి చెప్పానంటారు వాస్తవానికి ఏదయినా మేలు జరిగితే అది మీకే''

రాజుగొంతులో, చూపులో కొద్దిగా మార్పువచ్చింది.

"మధ్యలో నాకేం ప్రయోజనం?''

"జబ్బు స్టేజినిబట్టి చికిత్స ఉంటుంది! ఈ

మాట నర్సిల్ అన్నా మానినా యిప్పుడే తమరు సెలవిచ్చారు. మీరు యిచ్చినది టెస్ట్ డోస్! వాక్సిన్ అని పేరుపెట్టి టెస్ట్ డోస్ యిచ్చారు!"

రాజు చటుక్కున లేచాడు.

నెమ్మదిగా తనను తాను సంభాళించుకున్నాడు. టైము చూసుకుని — "అరరే... ఎనిమిదీ యిరవై! వెళ్లాలి. వస్తాను సీతా!" అనేసి గబగబా బయటకి నడిచాడు.

వెళ్తున్న రాజు వయిపే ఉంది వేణు చూపు.

వేణుని గమనిస్తున్న సీతారాంలో ఓ చిత్రమయిన ఊహ కలిగింది.

ఈ కుర్రాడు తనకింద ఉద్యోగం చేస్తూంటే అతని ఏన్యువల్ కాన్ఫిడెన్షియల్ రిపోర్టు ఎలా రాస్తాడూ??

వేణూ అతనివయిపు తిరిగి

"రమ్మన్నారుట"

"ఎవరు చెప్పారూ?" ఈ ప్రశ్న నోటిదాకా వచ్చి ఆగిపోయింది. ఇన్నాళ్లూ ఆలోచనల్లో కదలిన దగ్గరతనమూ, చూసిన వెంటనే కలిగిన స్పందనా, రాజుతో సమానంగా చేసిన సంభాషణవల్ల ఏర్పడిన సంభ్రమమూ ఈ ప్రశ్నకు జవాబుగా "రాధ" అని వస్తుందేమోనన్న చేదులో కాస్తంత వెనకబట్టాయి.

"వాసూ గురించి ఏమయినా తెలిసిందా వేణూ?"

"తెలిస్తే పరుగెత్తుకు వచ్చేవాడినంకుల్ —"

రాజుతో అంత అచితూచి మాట్లాడే యితని ధోరణి తనముందు ఎందుకంతగా మారిపోతుంది? మారిపోతూందన్నది తన దృష్టి విభ్రమమా, వాస్తవమా?

"ఏమయినా మాట్లాడవయ్యా వేణూ!"

"ఏం చెప్పమంటారంకుల్?"

సీతారాంకి సంభాషణ సాగించటంలేదు. తన మనసులో ఉద్దేశం వేరుగానే చెప్పవచ్చు! కానీ ఈ కుర్రాడి తెలివి కొంచెం బెదురు పుట్టిస్తోంది. అదే తెలివి తనవద్ద ప్రయోగించకపోటానికి కారణం రాధా? తనా? రాధే అయితే ఆమే అని తెలియబరిచే తెగువ వేణూలో ఉండితీరుతుందన్న ఆలోచన ఆ ప్రశ్న వేయకుండా చేసింది. తనే అన్న నమ్మకం కలిగించసాగింది. ఆ కదలికతో అన్నాడు

"నిన్ను చూడాలనిపించింది వేణూ!"

ఆయన చేతిమీద చేయివేసి "నాకు అర్థమయింది అంకుల్" అన్నాడు.

ఆ స్పర్శ ఒకమారెప్పుడో వయసులో తాను గాఢంగా ప్రేమించాననుకున్న లలిత చేతిని తాకిన సందర్భంలో డైరీలో రాసుకున్న వాక్యాన్ని గుర్తుచేసింది.

"శరీరాలకి హృదయానుభూతులను ఆవిష్కరించే శక్తి వుంది"

కొంతసేపు అలా ఉంచి చేతిని తీసేశాడు వేణు.

"అప్పుడప్పుడు వచ్చి మిమ్మల్ని చూస్తుంటానంకుల్!"

"తప్పకుండా వస్తూండు వేణూ!"

అంతవరకూ రాజూ వేణూలు మాట్లాడుకున్నారు. ఇద్దరిలోనూ ఏదో మాటల్లో కృత్రిమత్వం అదేదో తనకు నచ్చనిదేదో ఉంది. కానీ ఈ వేణూలో ఎంత సహజత్వం కనిపిస్తోంది- రాజూ ముందు.

ఆలోచనలను కట్‌చేస్తూ అన్నాడు సీతారాం-

"అవునూ నీ ఉద్యమం గురించి ఏం మాట్లాడనే లేదూ!"

వేణూ వెంటనే జవాబివ్వలేదు. అతని మొహంలో ఒక్కక్షణం కన్పించిన మార్పులకు కారణాలను తనకి ఇష్టమయిన పద్ధతిలో ఊహించుకొన్నాడు సీతారాం.

"నన్ను సిగ్గుపరుస్తున్నారు మీరు"

"అదేంటోయ్!" ఆశ్చర్యంగా అన్నాడు.

"అప్పుడంకుల్! వాసూని..." అంటూ ఆగాడు వేణు. అనేసి తాను సంబాళించుకున్నాక మళ్లీ అన్నాడు-, "వాసూని గురించి ఆందోళనతో మీరు నా గదికివచ్చారు. మళ్ళీ అవకాశం రాదేమోనన్నట్టు ఉద్యమంలో మిమ్మల్ని చేర్పటానికి — అలాంటి సమయాన్ని కూడా వాడుకున్నాను. మీరు మెంబర్లయ్యారు! అంతటితో నాపని అయిపోయిందిగదా! మీటింగులూ వివరాలూ అందరితోబాటే కరపత్రాలద్వారా

మీకూ తెలుస్తాయి. వానూ లేనిలోటు నేను తీర్చలేకపోయినా నేచేయగలిగేదేమున్నాచేస్తాను!''

వానూ కూడా యిలాంటి సందర్భంలో మరే తంత్రితోనయినా యిలా ప్రవర్తిస్తే ఎంత బాగుంటుంది! సీతారాం వేణూని నిదానంగా చూశాడు.

''భరద్వాజగారిని కలవాలన్నావారోజు?''

''మరొకరిద్వారా ప్రయత్నిస్తున్నానంకుల్!''

''అవుతుందా?''

''చూడాలి''

''అవకపోతే ఉద్యమం ఆగిపోతుందా?''

''భలేవారే అంకుల్! భరద్వాజగారు అకెడమిక్ కౌన్సిల్‌లో మెంబరు. జరిగినదాని గురించి మేం చేస్తున్న అభియోగాల గురించి వీసీని ప్రశ్నించటానికి ఒప్పించటానికి ఆ మీటింగ్‌లో ఆయన ప్రయత్నించాలన్నది మా ఆశ. అంత సులువుగా ఏమీ జరిగిపోదు; ఏదీ ఆగిపోదు! పైగా భరద్వాజగారు ముందుగా మా ఆందోళనను అర్థంచేసుకోవాలిగదా! ఆయనలాంటి ముక్కుసూటి మనిషి మాటకి చాలా విలువ ఉంటుందని నా అంచనా!''

భరద్వాజకీ తనకీ మంచి పరిచయమే ఉంది. అయితే అది యిలాంటి విషయాలలో విలువనిచ్చేటంతటిదా? ఆ విషయం నిర్ధారించుకోవాలి గదా! – సీతారాంకి సంభాషణను మరల్చాలనిపించింది.

''వానూ మార్కులిస్టు వచ్చింది''

''ఎలా వచ్చాయంకుల్?''

''సింగిల్ డిజిట్స్''

''ఇంపాజిబుల్''

''నిజం వేణూ!''

''అయితే యిందులో ఏదో పెద్దపొరబాటే ఉంది అంకుల్! ఇది మాకు బలమయిన కేస్! వాల్యూయేషన్‌లో యింతలోపం జరగదు! ట్యాబులేషన్‌లోనే జరగాలి. ఇలాంటి అవకతవకలన్నింటినీ మాకు తెలియబరచమని విజ్ఞప్తి చేశాం! మీరు తెలియజేశారా?''

''నాకు తెలియదే –''

''మా విజ్ఞప్తి పత్రాలు పోస్టులో ఉండి ఉంటాయి. అంకుల్... మీరు మాకు మార్కులిస్టు జిరాక్సు కాపీ యివ్వాల్సిందే! దయచేసి దీన్ని సీరియస్‌గా తీసుకోండంకుల్!''

తన కోసం ఏమీ కోరని యీ మనిషే తన లక్ష్యసాధనకోసం ఓ చిన్ని ఆధారం లాంటిది కనిపించేసరికి ఎంత తీవ్రంగా వేడుకుంటున్నాడూ... వేణూ అభ్యర్థనలో తీవ్రత అతని లక్ష్యంలో స్వచ్ఛతలా సీతారాంకి కనిపించింది. తన లక్ష్యంకోసం పోరాడే శక్తిగురించి ఆశ్చర్యపోయాడు.

''తప్పకుండా తెలియజేస్తాను వేణూ అంతే కాదు''

''ఆగారేం చెప్పండంకుల్!''

మరేం లేదోయ్ నీ మూమెంట్‌లో నేనూ ఏదయినా పనిచేయాలనుకుంటున్నాను. నాకు ఆఫీసు తర్వాత ఖాళీగా ఉంటుంది. అవసరమైతే భరద్వాజగారిని కలవటానికి ప్రయత్నిద్దాం...''

వేణూ సన్నగా నవ్వాడు-

''చాలా థాంక్స్ అంకుల్! చిన్న కరక్షన్... ఈ ఉద్యమం నా ఒక్కడిదికాదు, మన అందరిదీనూ...''

సీతారాం అతని భుజం తట్టాడు.

''నువ్వు యిక్కడే భోంచేసి వెళ్లు...'' అన్నాడు. రాధని పిలిచాడు.

''రాధా... వేణూ ఈరోజు మనతోబాటే భోంచేస్తాడు! వాష్‌బేసిన్ చూపించు- మొహం కడుక్కుంటాడు....'' అన్నాడు.

''అలాగే డాడీ!''

రాధ గొంతులో ఓ రకమైన యిష్టం తొంగి చూస్తోంది. అది భ్రమా! వాస్తవమా! ఏమయినా అది తనకు అయిష్టంగా ఉంది. కష్టం కలిగిస్తోంది.

రాధవెనకే వెళ్తున్నాడు వేణు!

ఆ దృశ్యం సీతారాంలో అనేక భావాలను రేపుతోంది.

స్త్రీ పురుషుల మధ్య సామాన్యమయిన ప్రవర్తనకీ సన్నిహితత్వానికీ తేడా ఉందని గమనించని సీతారాంని గతం ఓ వయిపు లాగుతుంటే, సన్నిహిత ప్రవర్తనకు సరిపడిన ఈడు

కూతురికి లేదనిపించే తండ్రి మనసు మరోవ యిపు లాగుతుంటే,స్త్రీ పురుషుల మధ్య స్వేచ్ఛ వారిమీద విధించే నిబంధనల కన్నా- వారి మానసికాభివృద్ధికి దోహదపడుతుందనిపించే ఆధునిక భావప్రభావం అతన్ని మరోవయిపు లాగుతోంది. ఆ ముగ్గడిలో కొంతసేపు కొట్టుమి ట్టాడి సీతారాం దాన్నుంచి బయటపడటానికి శారద గదివయిపు నడిచాడు.

లోకంలో నాగరికులమనుకుంటున్నవారు మానసికంగా ఎంత అనాగరికంగా ఉండగల రూ-

అనుకున్నాడు నిట్టూరుస్తూ-

★ ★ ★

"నమస్కారంసార్!"

"కూర్చోండి" అన్నాడు సీతారాం.

"నేను ఎస్సీ కాలేజీలో సీనియర్ లెక్చరర్ని. నాపేరు సోమశేఖర్"

"చెప్పండి- " తనముందున్న రిజిష్టర్ తెరి చాడు సీతారాం.

"ఏమిటా రిజిష్టరూ...?" సంశయంగా అడి గాడు సోమశేఖర్.

"మీరు ఇచ్చే కంప్లయింట్‌ను రాసుకుంటా ను..."

"అబ్బే... నేను చెప్పేది మీరు రాసుకోవా ల్సింది కాదండీ! మా కాలేజీకి వచ్చిన మార్క్సు కార్డుల్లో- మీరు నమ్మరు- పదిహేనూ యివరై శాతం ఖాళీగా వచ్చాయండీ... అదేంటని యూనివర్సిటీకి ఫోనుచేశాం...

మారుమాట్లాడకుండా ఖాళీకార్డులన్నీ పంపించమన్నారు..."

"మీలాగే మరికొందరు లెక్చరర్సు వచ్చి యిలాంటి సమాచారమే యిచ్చారు. ఇంత భారీయెత్తున యిలాంటి పొరపాట్లు ఎందుకు జరిగాయంటారూ...?"

సోమశేఖర్ విచారంగా తలఊపాడు.

"ఏం చెప్పమంటారండీ! ఇప్పుడు యూని వర్సిటీ వైస్ ఛాన్సలర్ చాలా స్ట్రిక్టు! పెద్దమని షీ! ఆయన టైంలోనే యిన్నిరకాల ఘోరాలు జరిగితే... ప్చ్! ఓ పక్కన స్టూడెంట్స్‌కి కాలేజీ లకు అప్లయిచేసుకునే గడువు అయిపోతోంది. దఫదఫాలుగా వస్తున్నాయి మార్క్స్ కార్డ్స్. ఆ వచ్చినవాటిల్లో రిజిస్టర్ నెంబర్లూ పేర్లూ మిస్స యిపోతుంటాయి. మళ్ళీ తిరిగి పంపటం... సరిచేయించటం... పిల్లలకీ తల్లిదండ్రులకీ ఆందోళన. అందర్లాగా వచ్చి జీతాలు పుచ్చు కుని ఏదో వాగేసి యిళ్ళకు పోదామనుకోడం చాతకాని నాలాంటి లెక్చరర్స్... యిదంతా చూసి ఏదో చెయ్యాలనుకుని ఏం చెయ్యాలో అర్థంకాక బాధపడుతున్నాం..."

కొంతసేపుండి వెళ్ళిపోయాడు సోమశేఖర్.

పదిహేను రోజులుగా ఆఫీసయాక నేరుగా అక్కడికి వస్తున్నాడు సీతారాం. విద్యార్థులనీ తల్లిదండ్రులనీ వాళ్ళకి జరిగిన అన్యాయాల ను తెలియబరచవలసిందిగా చేసిన విజ్ఞప్తి లకు అనేకమంది వస్తున్నారు. కొందరు పోస్టులో పంపుతున్నారు. వాళ్ళ ఫిర్యాదులను వేరువేరుగా వర్గీకరించి ఓ క్రమంలో పెడుతు న్నారు, మరో ఇద్దరు రిటైరయిన వ్యక్తులు సీతారాంతోపాటే అక్కడికి వచ్చి పనిచేస్తున్నా రు. వేణు మిత్రులతో వివిధ కళాశాలల్లోని విద్యార్థి సంఘాల సహకారంకోసం తిరుగుతు న్నాడు.

వానూ గురించి ఎలాంటి సమాచారం లేదు.

పత్రికలలో ప్రకటనలు వేయించాడు.

వారంరోజుల క్రితం పెద్దక్కయ్య పిల్లలతో వచ్చింది. తనకు ఓదార్పుగా ధైర్యంగా అని పించింది. ఆమె శారదలాంటిదికాదు. పెద్దగా రాగాలు తీసి ఏడిచింది. అందులో తనకేమీ తెచ్చిపెట్టుకున్నట్లేం అనిపించలేదు. పల్లె టూరి పద్ధతులూ ప్రేమలూ అలాగే ఉంటాయ నుకుని సరిపెట్టుకున్నాడు. బాబా దగ్గరకు తీసుకువెళ్ళమని శారద అడగలేకపోయింది గానీ అవిడే ఏదో గుడికివెళ్ళి అభిషేకాలు చేయించమని అడిగేసింది.

"నాకలాంటివి యిష్టముండవక్కయ్యా" అన్నాడు.

"అన్నీ నీకే తెలుసునన్నట్లు మాట్లాడతావేం" అంటూ బడబడా వాగేసింది అక్కయ్య. సారాంశమేమిటంటే- "కష్టంలోనూ అశుభంలో నూ నీ యిష్టం వచ్చినట్లు నువ్వుండగూడదు. సుఖంలో ఎలా ఉన్నా నిన్ను అడిగేవాడూ




అడ్డేవాడూ ఉండడు? కాస్తంత లోకానికిగూడా వెరవాలిరా అబ్బాయ్!-''

తనతో మాట్లాడటానికే వెరుస్తారు అంతా! అలాంటిది యీ సమయంలో ఆవిడకి ఏదో అధికారం వచ్చేసినట్లు మాట్లాడేస్తూంటే నవ్వొచ్చింది.

ఓ రాత్రి శారదకూడా పెద్దగా మాట్లాడేసింది.

"కొడుకు యింట్లోంచి పోయిన దుఃఖం నాదా? ఆవిడదా? ఈ వచ్చిన వాళ్ళందరికీ వేణ్ణీళ్ళు చూసీ-ఫలహారాలు చూసీ-వీళ్ళు ఊరిమీదపడి బలాదూరుగా తిరగడానికి కారేజీలు కట్టిచ్చీ-చస్తున్నాను నేను! ఏదయినా తక్కువయితే ముఖాలు యిలా పెట్టుకోడం అలా పెట్టుకోటమూ-పోన్లే బాధలో ఉంది మనమే సర్దుకోవాలని తోచదా! ఆవిడ అన్న మాటలకు మరొకత్తయితే ముఖంమీదే కడిగేసుండేది! నాబాధేదో మీదగ్గర చెప్పుకుంటున్నాను'' అంది శారద.

శారద ప్రవర్తనా, మాటలూ తనకు ఆశ్చర్యమూ, కోపమూ కలిగించాయి. బహుశా యిది బీ.పి. ప్రభావమే అయుంటుంది అని తనను తాను సర్దుకున్నాడు!

ఇలాంటి వాతావరణంలో ఈ ఉద్యమ కార్యాలయానికి వస్తూండటంవల్ల మేలే జరిగింది-

అనుకున్నాడు సీతారాం.

ఫిర్యాదులు వినటంవల్ల, చదవటంవల్ల యీ ఏడాటి చాలా అన్యాయం జరిగిందనిపించింది అతనికి.

సీతారాంకి లోలోపల అనేక అనుమానాలు ఉన్నాయి. అడుగుదామంటే వేణూ అందటంలేదు.

వేణూ ఉంటున్న మురికివాడలో చిన్నిచిన్ని వ్యాపారాలు చేసేవాళ్ళు ఎక్కువ. కూరగాయలూ, చవకరకం ప్లాస్టిక్ సామాన్లూ, జోళ్ళూ బట్టలు పళ్ళూ యిలాంటివన్నీ వాళ్ళు తోపుడు బళ్ళమీద వేసుకుని అమ్ముతారు. ఆ మురికివాడకి చాలా సమీపంలో ఆ నగరంలోకెల్లా పెద్ద మార్కెట్ ఉంది. అందులో అంతా టోకు వ్యాపారం సాగుతుంది. పది కేజీలకు తక్కువ బేరాలు లోపల సాగవు. ఈ బళ్ళవాళ్ళలో చాలామంది అక్కడ టోకున కొనుక్కుని బయట చిల్లరగా అమ్ముతుంటారు. వస్తూన్న జనానికి అన్నా అందుబాటులో ఉండటానికి కూరగాయలూ, పళ్ళూ వంటివేగాకుండా అనేక యితర వస్తువుల బళ్ళు అక్కడికి చేరుతుంటాయి! ఆ మురికివాడను ఖాళీ చేయించాలని కార్పొరేషన్ ఉద్దేశ్యం! దానివెనక ఎవరో పెద్ద వ్యాపారస్తుని సినిమాహాలు ప్రయత్నం ఉన్నట్లు వదంతి! మురికివాడ ఖాళీ చేయించటానికి ప్రయత్నాలు మొదలయాయి! వేరేచోట నగరం బయట స్థలాలూ, యిళ్ళూ యిస్తామన్నా తమ బతుకు తెరువుపోతుందని మురికివాడవాళ్ళు తిరస్కరించారు. దాంతో వేధింపు చర్యలు మొదలయాయి. బళ్ళవాళ్ళు మునుపటిలాగే ముడుపులు చెల్లించినా బీటు పోలీసులు లైట్లు ఎత్తుకుపోవటం, టైర్లు చిల్లులుపెట్టడం, బండిని పడదొయ్యటం వంటి జులుములు అప్పుడప్పుడు చెయ్యసాగారు. ఇలాంటివి చేసినా పోలీసులు బళ్ళవాళ్ళను తరమటానికి గట్టి ప్రయత్నం చేయటంలేదనిపించి కేసులు పెట్టడం ఫైనులు కట్టమనటం మొదలుపెట్టారు. మురికివాడలో మతంపేరిట తగాదాలు మొదలయాయి. ఇలాంటి తరుణంలో వేణూ పదిమందినీ పోగుచేసి ఓ సంఘంగా ఏర్పరిచేడు. వాళ్ళనుంచి నెలకి ఒక రూపాయి వసూలు చేశాడు. ఫైనులు కట్టేశాక వాళ్ళు తెచ్చిన రసీదు తీసుకుని వాళ్ళకి ఆ డబ్బులు ఈ నిధినుంచి తిరిగి యిచ్చేవాడు. లాయరుని పెట్టి కేసులు వాదించి ఫైనులు తిరిగి వసూలు చేశాడు. కొన్ని కేసులు పోయినా చాలావరకూ గెలిచేవారు. వేణూ మాటకు విలువ పెరిగింది. మతంపేరిట తగాదాలు మరీ పెరగకుండా అడ్డుకోగలిగాడు. దేవేంద్రన్ షణ్ముగన్‌లాంటి వ్యక్తులు వేణూ తలపెట్టిన పనిలో రేయింబవళ్ళు పనిచేయటం చూసి సీతారాం ఆశ్చర్యపోయాడు. వాళ్ళద్వారానే ఈ కథంతా విన్నాడతను.

అతనికి వేణూ మీద గౌరవం పెరగటంతో పాటు వానూనీ, అతన్నీ పోల్చుకోటం అలవాటయింది. ఓరోజు మాటల సందర్భంలో రాజాతో అన్నాడు. "ఈ ఉద్యమాల వెనకనున్న దీక్ష

ప్లానింగూ, తెలివీ మెచ్చుకోవలసిందే" అని.

రాజు తేలికగా నవ్వేశాడు.

"హత్యా దోపిడీ చెయ్యటానికి కూడా దీక్షా సాహసం, తెలివీ ప్లానింగూ ఏకాగ్రత...చాలా అవసరం బావా! మనమాలెక్కన మెచ్చుకుంటూపోతే ఇహ ఈలోకంలో నువ్వు మెచ్చుకోగూడనిదంటూ ఉండదునుమా!"

సీతారాం రాజు మాటలతో చల్లబడ్డాడు. ఆ మాటలో సత్యమేదో ఉన్నట్లనిపించింది.

ఆలోచనలనుంచి బయటపడి వాచీ చూసుకున్నాడు.

ఏడవుతోంది.

బయట ముసురుగా ఉంది. తనలాగే అక్కడికి వస్తున్న మరో యిద్దరూ రిటైరయిన వాళ్ళే! న్యాయానికి తనకన్న ఎక్కువ తీరిక ఉంది. అయినా తనంత క్రమంగా రారు. అది సీతారాంకి గమ్మత్తయిన గర్వం కలిగిస్తూంటుంది.

ఆరోజు వాళ్ళు రాకపోయేసరికి మరింత ఒంటరిగా అనిపిస్తోంది.

వేణూ-అన్నసమయానికి రాకపోతే...?

భరద్వాజ ఎలాగయినా ప్రవర్తించగల వ్యక్తి. ఎంతో కష్టపడి అపాయింట్‌మెంట్ తీసుకున్నాడు. తీరా సమయానికి వెళ్ళకపోతే...?

సీతారాం ఆలోచనలు భరద్వాజ మీదకు సాగాయి.

ఒక ప్రాజెక్టు విషయంలో చాలా శ్రమపడి వివరాలు సేకరించి ప్రపోజల్సు తయారుచేశారు సీతారాం కార్యాలయంవారు. ఆ బృందంలో సీతారాం హోదాకు చిన్నవాడే అయినా శ్రమంతా దాదాపు అతనిదే! వారు పంపించిన ప్రపోజలును పరిశీలించి ఎక్స్‌పర్ట్ అభిప్రాయం చెప్పమని భరద్వాజను కోరింది మినిస్ట్రీ.

ఆ ప్రపోజల్‌ను తిరస్కరించవలసిందిగా భరద్వాజ సిఫారస్ చేసాడు. మినిస్ట్రీ ఆ విధంగానే దానిని తిప్పి పంపేసింది. అంతటితో కేసును మూసివేద్దామనుకున్నారు సీతారాం మీది అధికారులు. సీతారాం ఒప్పుకోలేదు. చివరికి "ఏం చేసుకుంటావో నీదే బాధ్యత! ఎక్కడ సంతకాలు పెట్టమంటావో చెప్పు" అన్నారు. తనవాదనను అనేక ఉత్తరాల ద్వారా వివరించగా వివరించగా భరద్వాజతో మీటింగ్ ఏర్పాటుచేసుకొని ఓ నిర్ణయానికి రాటానికి మినిస్ట్రీ అనుమతినిచ్చింది.

సీతారాం మీది అధికారి సమావేశానికి ఎప్పుడు వీలవుతుందీ తెలియజేస్తే ఏర్పాట్లు చేస్తానని భరద్వాజకు ఫోనుచేసి అడిగాడు.

" మీరు అంటూన్న సమావేశాన్ని గురించి మినిస్ట్రీ నుంచి నాకెలాంటి అభ్యర్థనాలేదు. నాకు ప్రపోజల్సును పంపించినది మినిస్ట్రీ. నా అభిప్రాయాన్ని వారికే నేను తెలపాలి. తెలియజేసాను. నిర్ణయం వారిదే! ఈ ప్రపోజల్స్‌మీద నేను నాఅభిప్రాయాన్ని మార్చుకోబోవటంలేదు. ఏంచేయదలుచుకున్నదీ మీ యిష్టం. ఈ విషయమ్మై నేనింక నా సమయం వ్యర్థం చేయను-"

అంటూ ఫోన్ పెట్టేసాడు.

సీతారాంని పిలిచి చెడామడా వాయించాడు మీద అధికారి.

"ఇందులో మన ఇంట్రస్టు ఏముంది? ఎందుకొచ్చిన తంట? మనం ఫైలు మూసేసి కూర్చుంటే అడిగేవాడెవడూ? ఈ సైంటిస్టులకీ, టెక్నాలజిస్టులకీ ప్రభుత్వాధికార్లంటే చిన్నచూపు. ఏ ప్రపోజల్ పెట్టినా దానివెనక వెస్టెడ్ ఇంట్రస్ట్ ఏదో ఉంటుందనే వాళ్ళ నమ్మకం. చూశావా ఆయన గొంతు! ఆ ఏరగన్స్! పోనీ మనకేమైనా లాభం ఉంటే ఆయన మాటన్నా మనం పడవచ్చు. ఎలాగోలాగ ఆయనని మెత్తబరచవచ్చు. ఎందుకీ న్యూసెన్సూ? కమాన్! క్లియరాఫ్ దీజ్ పేపర్స్! మళ్ళీ యీ విషయం నా దగ్గర తేకు!-"

సీతారాం ఫైలు తీసుకుని అక్కడనుంచి బయటపడ్డాడు. ఒకరోజంతా అతను రకరకాలుగా మదనపడ్డాడు.

ఓరోజు సెలవుపెట్టి నేరుగా భరద్వాజ దగ్గరకు వెళ్ళాడు.

"మీకు 'అపాయింట్‌మెంట్ యిచ్చానా?" భరద్వాజ సీతారాంని కూర్చోమనకుండా నిశితంగా చూశాడు.

"లేదు"

"మిమ్మల్ని కలియటానికి నా దగ్గర





సమయం లేదు''

"మీకు వీలయేదాకా నేను నిరీక్షిస్తాను"

"నాకీరోజు వీలవదు''-

"పోనీ యింటి దగ్గర కలవటానికి అభ్యంతరం లేకపోతే కలుస్తాను''

"ఇంటిదగ్గర నేనెవరినీ కలవను''

"మీరు ఎప్పుడు అపాయింట్‌మెంట్ యివ్వగలరో చెప్పండి''

భరద్వాజ తన కుర్చీలో యిబ్బందిగా కదిలాడు.

"మీ పనేమిటీ-? దానిని బట్టి చెబుతాను''

"మేం పంపిన ఓ ప్రపోజల్ మీద మీరు ఎక్స్‌పర్ట్ అభిప్రాయం యిచ్చారు. ఆ విషయం''

"అదా కథ- మంచిది! నేను అపాయింట్‌మెంట్ యివ్వను''

క్షణకాలం విస్తుపోయి నించున్నాడు సీతారాం. మెల్లిగా తననుతాను కూడదీసుకుంటున్నాడు.

"మీరు వెళ్ళవచ్చు'' అన్నాడు భరద్వాజ.

"సరే... ఇందాకా వచ్చాకా మీతో మాట్లాడకుండా నేను వెళ్ళబోవటంలేదు''

"అఫీషియల్ డ్యూటీలో వచ్చి నన్ను డిస్టర్బ్ చేస్తున్నట్టు, నా పనిని బాధ్యతారహితంగా ఆటంకపరుస్తున్నట్లూ మీమీది అధికార్లకి నేను రిపోర్టు చేయాల్సివస్తుంది''

"నేను శలవులో ఉన్నాను. నా స్వంత బాధ్యత మీద నేను మిమ్మల్ని కలియాలని వచ్చాను''

"మీ గవర్నమెంట్ ఉద్యోగస్తులు చేసే పనల్లా స్వంతం కోసమేగదా! మీరు తిన్నది తిని ఎవరికో కమిట్ అయితే నేనా ఆటలో పడేటంత గుడ్డిగవ్వను కాను''

"అంటే మీరు ఆ ప్రతిపాదనల మీద తెలియజేసిన అభిప్రాయంలో టెక్నికల్ ఏస్పెక్ట్ లేదు. మీకు మాబోటి ఆఫీసర్ల మీదున్న అభిప్రాయాన్ని వ్యక్తపరచటానికి మీకున్న సాంకేతికనైపుణ్యాన్ని పావులా వాడారు. మీరు చేసిన అభియోగం నిజమే కావచ్చు. నేను లంచాలు తిని నా వ్యక్తిగత ప్రయోజనం కోసమై ఈ ప్రతిపాదనలు చేయటానికీ-మీరు మీ వ్యక్తిగతాభిప్రాయాల కోసం మీ టెక్నికల్ నాలెడ్జినీ, మీ హోదానూ వాడుకోటానికీ తేడా ఏమీలేదు. మీరు నా ఆటలో పడకూడదనుకుంటూనే మీ ఆటలో పడిపోయే అవకాశంలేదా''

భరద్వాజ చేతిలోని పెన్సిల్‌ని టేబుల్ మీద పడేశాడు.

ఫాన్ స్పీడ్ పెంచాడు.

"కూర్చోండి!''

సీతారాం కూర్చున్నాడు.

"మీకు వీలయినప్పుడే మాట్లాడుకుందాంసార్! మీబోటి విద్యావేత్తలని కలుసుకోవాలని అనుకుంటుంటాను''

"పదినిముషాలలో నాకు క్లాస్ ఉంది. గంట తర్వాత నాకు ఖాళీ ఉంది. మీరు క్లుప్తంగా చెప్పితే సరే- లేకపోతే వెయిట్ చేయాలి-''

"అయిదు నిమిషాలలో ముగించటానికి ప్రయత్నిస్తాను. అవసరమయితే ఆ తర్వాత నిరీక్షిస్తాను''

"బావుంది! చెప్పండి''

"నేను ఈ ప్రాజెక్టు మొదటినుంచీ పనిచేశాను. ఈ వివరాల సేకరణకి ఎంతో శ్రమపడ్డాను. చాలా శ్రద్ధ తీసుకున్నాను. ప్రపోజల్ అంతా తయారుచేశాను. మీరెరుగుదురో లేదో గానీ ప్రభుత్వ యంత్రాంగంలో డెసిషన్ మేకింగ్‌కి రకరకాల స్థాయిలు ఉన్నాయి. ఈ ప్రపోజల్ తయారు చెయ్యటానికి పడిన శ్రమ ఒక ఎత్తూ, దీనిని మాపై అధికారులచేత ఔననిపించటం మరో ఎత్తు. న్యాయంగా వాళ్ళు నన్ను గైడ్ చేయాలి! సాంకేతిక విషయాలలో లోపాలు సరిదిద్దాలి! మెరుగుచేయాలి! తగ్గించాలి! సాధారణంగా అలా జరగదు. నామీద కాన్ఫిడెన్స్ ఉంటే నేను గుడ్‌లుక్స్‌లో ఉంటే వాళ్ళు సంతకం పెట్టేయవచ్చు. ఈ ప్రతిపాదనల తయారీ దశలో యితర రంగాలవారితో చర్చించటానికి వాళ్ళు వెళ్ళాల్సి ఉంటుంది! అవతలివాళ్ళలో కొందరు సమాన హోదాగల అధికారులతోనే చర్చిస్తామనే వాళ్ళుంటారు! అందరూ విషయాన్ని గురించి ప్రిపేర్ కావాలి. పెయిన్స్ తీసుకోవాలి. మీరన్నట్టు స్వంత లాభం ఉంటే అలాంటి పెయిన్స్ తీసుకోవ





చ్చు! కానీ ఒక్కోచోట నాలాంటి వాళ్ళుంటారు. వాళ్ళ అనుభవంతో, నిజాయితీలతో ఏదైనా తలపెడితే- ఏదీ చెయ్యనీయని ఎన్నెన్నో పరి స్థితులు''

అంటూ టైం చూసుకున్నాడు సీతారాం.

''—ముగించేస్తున్నాను! నా శ్రమ నా ఇన్ వాల్వ్‌మెంటులవల్ల మీతో సమావేశం కోసం మినిస్ట్రీ నుంచి అనుమతి తెచ్చుకోగలిగాం కానీ''

''మీరు చాలా కష్టపడ్డారు. అందువల్ల ఈ ప్రాజెక్టు మీద నా ఒపీనియన్ మార్చుకోమంటా రు''

టీజింగ్ చేస్తున్నట్లుంది భరద్వాజ గొంతు.

సీతారాం సిన్సియర్‌గా అన్నాడు-

''వద్దు! నా శ్రమా ఈ విషయంలో ఏ కాంట్రాక్టర్లకో లాభాలూ మా శాఖవారికి ప్రయో జనాలు మా ఉద్యోగస్తుల మీద మీ స్వంత అభిప్రాయాలు యివేవీ అనవసరం... అప్ర స్తుతం! మీరు సాంకేతికనిపుణులు! మేమ యితే యిందులో సాంకేతిక విషయాలతోబా టు అనేక యితర విషయాలు చూసుకోవాలి! మిమ్మల్ని నేను కోరేదేంటంటే సాంకేతిక విషయం మీద మీరు మాకు సమావేశానికి అవకాశం యివ్వాలి. అందుకు మీరు అనుమ తించితే నేను చాలా కృతజ్ఞుడిని! మీరు, మేమూ ఓపెన్‌గా ఉందాం!''

భరద్వాజ కొంతసేపు మాట్లాడలేదు.

''సరే... మీరు మీ సందేహాలన్నీ నాకు రాయండి. మీటింగ్ అవసరమయితే నేను తెలియజేస్తాను. లేదంటే మీ సందేహాలమీద నా అభిప్రాయాలు రాస్తాను.''

సీతారాం కృతజ్ఞతలు చెప్పి వెళ్ళిపోయా డు.

ఆ ప్రాజెక్టు విషయమై మరికొన్నిసార్లు సీ తారాం భరద్వాజను కలిశాడు. చివరకి భర ద్వాజ యిచ్చిన సూచనలను తీసుకుంటూ సరికొత్త ప్రతిపాదన మినిస్ట్రీకి పంపారు. రాజ కీయ ప్రాధాన్యతలవల్ల చివరకి ఆ ప్రతిపాదన మూలబడింది.

భరద్వాజ అతని రంగంలో దేశంలోని మొ దటి పదిమంది ప్రముఖులలోనూ ఒకడు. ఓ సెమినార్‌లో అతను పేపరు చదివాడు. ఆ సెమినారుకు సీతారాం కూడా హాజరయ్యాడు. ఆ సెమినారు ఓ మూడు నక్షత్రాల హొట లులో ఏర్పాటుచేశారు. అక్కడ యిచ్చిన బఫేలో అందరూ మునిగితేలుతుండగా సీ తారాం వీలుచూసుకుని భరద్వాజను పలక రించాడు. భరద్వాజ చదివిన పేపరు మీద కొంతసేపు మాట్లాడాడు సీతారాం. భరద్వాజ ఆ మీదట సెమినార్లమీదా పేపర్లమీదా అందులో పాల్గొనేవాళ్ళమీదా అనేకవిషయాలు మాట్లాడాడు. అందులో కొంత సీతారాంకి అర్థ మయింది, కొంతకాలేదు. కానీ ఒక్క విషయం అతనికి స్పష్టమయింది.

భరద్వాజ పడకకుర్చీలో కూర్చుని వేదాంతా లు వల్లించే మనిషికాదు. తన రంగంలో తను చేయగలిగినదంతా చేయాలనుకునేవ్యక్తి. అలాంటి వ్యక్తులనూ, వారి శ్రద్ధనూ పూర్తి వినియోగంలోకితెచ్చుకొనే అవకాశం మాత్రం లేదు —

అలా అనుకున్నాక భరద్వాజ మీద అతని గౌరవం పెరిగింది.

అలాగే అతనికున్న పరిమితులలో నమ్మద గిన వ్యక్తిగానూ ఎంతో కొంత అర్థం చేసుకొనే మనిషిగానూ సీతారాం కన్పించాడు భరద్వా జకు.

ఫలితంగా సీతారాంను తన యింటికి ఆహ్వానించాడు భరద్వాజ.

ఆ తర్వాత వాళ్ళు అప్పుడప్పుడు కలుసుకొ నేవారు.

సీతారాంకి భరద్వాజమీద ఎంతో తెలిసున్న వాడన్న గౌరవం.

భరద్వాజ తన స్వంత విషయాలమీదా, కుటుంబవిషయాల మీదా సీతారాంతో మాట్లా డేంత చనువు పెంచుకున్నాడు.

అయినా అపాయింట్‌మెంట్ అడగకుండా సీతారాం వెళ్ళేవాడుకాదు.

తమ మధ్యనున్నది స్నేహమని భరద్వాజ అంటున్నా అది మీ మంచితనమూ పెద్దతన మూ అంటాడు సీతారాం; అనుకుంటాడు కూడా.

వేణూ గురించి, ఉద్యమం గురించి స్వా

ల్బంగా పరిచయమిచ్చి ఫోనులోనే అపా యింట్‌మెంట్ కోరాడు సీతారాం.

భరద్వాజ వెంటనే ఒప్పుకున్నా ఆ గొంతులో మార్పుకి సీతారాం తనకు తోచిన అర్థాలు వెతుక్కున్నాడు.

వేణూ అన్న సమయానికి రాకపోతే?

టైం చూశాడు- ఏడున్నర.

తడిసి ముద్దయిపోయిన బట్టలతో లోపలికి వచ్చాడు వేణూ.

"ఆలస్యమయిపోయిందంకుల్"

సీతారాం మాట్లాడలేదు.

బట్టలు మార్చుకోసాగాడు వేణూ "ఏం చే యమంటారంకుల్! ఎన్‌కే కాలీజీవాళ్ళు వస్తా మన్నారని కూర్చున్నాం! ఎవడూ సమయానికి రాడు! వచ్చిన దగ్గరనుంచీ మనమీదా, ఉద్య మంమీదా లక్షప్రశ్నలు! పైకి తేలరుగానీ రాజ కీయపార్టీలకి అనుబంధ యూనియన్లు వాళ్ళు మరీ కొరకరానికొయ్యలు. వాళ్ళని ఒప్పించలేం"

"ఎందువల్లా?" ఆశ్చర్యంగా అడిగాడు సీ తారాం.

"చెప్తాను"అంటూనే తయారయి బయట పడ్డాడు. ఇద్దరూ ఆటో ఎక్కారు.

"ఎందువల్లో చెప్పటానికి చాలా కథ ఉంది! సింపుల్‌గా చెప్పాలంటే ఉద్యమంవల్ల ఎవరు పైకి వస్తారో అనేదే అసలు బెంగ"

నగరంలో యిరవై రెండు కాలేజీలున్నాయి. యస్.యఫ్.ఐ కింద పన్నెండూ ఏబీవీపీకింద అయిదూ యూనియన్లు ఉన్నాయి. వాళ్ళ మద్దతు కోసం ప్రయత్నిస్తున్నాడు. అది కుద రని చోట తాత్కాలికంగా కొందరు విద్యార్థు లని ఆయా కళాశాలల ప్రతినిధి సభ్యులుగా చేర్చాడు. వాళ్ళ వాళ్ళ కాలేజీలలో ఉద్యమం అవసరాన్ని గురించి ప్రచారం చెయ్యమన్నా డు. ఎప్పటికప్పుడు కాలేజీలలో మద్దతు ఎలా ఉన్నదో గమనించుకోవలసి వస్తోంది. ఏద యినా కార్యాచరణకు దిగాలంటే కొంత గేద రింగ్ ఉండాలి. కొందరు వాళ్ళంతట వాళ్ళు వచ్చినా కొందరు వెళ్తేగాని మాట్లాడటంలేదు.

ఇదంతా చెబుతూ అన్నాడు-

"మార్చ్ టూ యూనివర్సిటీకి తేదీ నిర్ణ యించి పిలుపునిచ్చాంగానీ అక్కడ గేదరింగ్‌ను బట్టి మన ఉద్యమం భవిష్యత్తు ఉంటుందంకుల్! దానికి ముందు కౌన్సిల్ మీటింగ్‌లో భరద్వాజగారు ఏ మాత్రం మాట్లా డినా ప్రెస్‌నుంచి కవరేజ్ వస్తుంది. దానికి





మనం కరపత్రాలద్వారా వైడ్ పబ్లిసిటీ యిస్తాం! దాంతో మనకి కొంత స్టాండ్ వస్తుంది! ఈ ఉద్యమం ఉత్తి అల్లాటప్పా వ్యవహారం కాదని ఓ మారు అర్థమయితే అన్ని కాలేజీల నుంచి చకచకా మద్దతు వస్తుంది"

వేణూ చెప్తున్నది వింటున్నాడు సీతారాం.

భరద్వాజ చాలా చికాకుగా ఉన్నాడు.

ఆ రోజు ఉదయం అతను పాల్గొన్న సమావేశంలో తోటి సభ్యులు చేసిన వాదనలూ, వెలిబుచ్చిన అభిప్రాయాలూ మెదడుని విడవటంలేదు.

ఇంటికివచ్చి కొంతసేపు చదివినా తన ఉనికిని ప్రశ్నించే ఆలోచనలు సాగుతూనే వున్నాయి.

వాన మొదలయింది. వాతావరణంలో మార్పువచ్చింది.

భరద్వాజ టైం చూసుకున్నాడు. సీతారాం అనుకున్న సమయాన్ని తప్పడు. ఎవరో కుర్రాడిని తీసుకువస్తానన్నాడు. ఆ గొంతునిబట్టి ఏదో అబ్లిగేషన్‌తోనే వస్తున్నాడని తెలిసిపోయింది. అదేమిటో వచ్చాక వివరిస్తానన్నాడు. తను నిలదీసి అడిగి వుండేవాడే! సీతారాం మీదనున్న ప్రత్యేకతవల్ల అడగలేదు- అందువల్ల కూడా భరద్వాజ చికాకుగా వున్నాడు.

తను నియమాలకి విరుద్ధంగా పోడని సీతారాంకి బాగానే తెలిసుండాలి. ఏమో... ఔట్ ఆఫ్ ది వేలో అతనొకవేళ ఏమయినా ఆశిస్తే-? సీతారాంకి పెళ్ళికెదిగిన కూతుళ్ళూ, ఉద్యోగానికి ఎదిగిన కొడుకులూ ఉన్నారేమో! స్వంతానికి నియమాలెన్ని పాటించినా పిల్లల దగ్గరకు వచ్చాకకూడా పాటించేవాళ్ళు మరీ అరుదు. సీతారాం పరిధికిమించి లోపలికి రానిచ్చేనేమోనన్న ఆలోచన భరద్వాజ చికాకుని మరింత పెంచింది.

అన్న సమయందాటి అరగంట గడిచాక గేటుబయట ఆటోచప్పుడు వినిపించింది.

భరద్వాజ రీడింగ్ రూంలోకి నడిచాడు.

"—పదినిముషాలు వెయిట్ చెయ్యమన్నారు అయ్యగారు" అన్నాడు పనికుర్రాడు.

సోఫాలో కూర్చున్నాక సీతారాం వేణు మొహంలోకి ఆందోళనగా చూశాడు. వేణు భరోసాగా నవ్వాడు.

"భరద్వాజగారు హేతువుకు చాలా విలువ ఇస్తారు అంకుల్!"

"అదిసరే! అసలు నీతో మాట్లాడటానికి అంగీకరించాలిగదా!"

వేణు అస్థిమితంగా కదిలాడు.

"చూద్దాం అంకుల్!" అన్నాడు ఆలోచనగా పెదాలు బిగించి.

పది నిముషాల తర్వాత భరద్వాజ వచ్చాడు. ఇద్దరూ లేచి నుంచున్నారు.

వేణువయిపు తేరిపారచూశాడు.

"కూర్చోండి!" అన్నాడు తను కూర్చుంటూ. "నా సంగతి మీకు తెలుసుగదా సీతారాంగారూ! మీరు టైంకి రావలసింది-"

"పొరపాటు నాదిసార్! మన్నించండి!"

గొంతులోగాని, భంగిమలోగాని గడుసుతనం కనిపించకపోటంతో భరద్వాజ కొంత మెత్తబడ్డాడు.

సీతారాం అన్నాడు- "ఇతను వేణూ! మా అబ్బాయి వానూకి క్లాస్‌మేట్. మా అబ్బాయి-"

అంటూ సందిగ్ధంగా భరద్వాజ వైపు చూశాడు.

"చెప్పండి!" అన్నాడు భరద్వాజ.

ఓ నిశ్చయానికి వచ్చినగొంతుతో సీతారాం ప్రారంభించాడు-

"మా వానూ పరీక్షపోయింది. ఇన్నేళ్ళుగా వాడు డిస్టింక్షన్ విద్యార్థి. నేను కొంచెం తొందరపడి విసుక్కున్నాను. వాడు ఎక్కడికో వెళ్ళిపోయాడు"

"ఎన్నాళ్ళయింది?" భరద్వాజ ముందుకి వంగి అడిగాడు.

"ఇరవై రోజులు దాటిపోయింది"

"అయామ్ వెరీసారీ... ఇన్నాళ్ళుగా నాతో చెప్పలేదు మీరు!"

సీతారాం మనసంతా బరువెక్కిపోయింది. క్షణకాలం కళ్ళు ఆర్ద్రమయ్యాయి. స్వయంగా ఎవరితోనూ తను వానూ విషయం చెప్పలేదు అయినా ఏమని చెబుతాడూ? ఏ ఘనకార్యం





జరిగిందని చెప్పుతాడూ?

చటుక్కున లేచి అతని భుజం మీద చెయ్యివేశాడు భరద్వాజ.

"మీరు నాకు చెప్పనందుకు తప్పుపట్ట టంలేదు సీతారాం. మనమధ్య కొంత ఆత్మీయత ఉంది. ఒకరితో పంచుకుంటే బరువు కొంతయినా తగ్గుతుంది. మీరు నాకా అవకాశం ఇచ్చి ఉండాల్సింది! సర్లెండి... ఎందుకలా జరిగింది?"

సీతారాం మంచినీళ్ళు తాగాడు. తర్వాత వాసూ బాగానే చదివాడనీ, సింగిల్ డిజిట్ మార్క్స్ రావటం విచిత్రమనీ చెప్పాడు.

"మీవాడి పేపర్లు రీవాల్యూ చేయించారా?"

"అన్ని పేపర్లలోనూ వాల్యూషన్‌లో పొరపాట్లు జరుగుతాయంటారాసార్?" అన్నాడు వేణూ.

అంతదాకా అతని ఉనికిని మరచిన భరద్వాజ చటుక్కున అతని మొహంలోకి చూశాడు.

"ఏం జరిగిందో మా విద్యార్థులెవరికీ అర్థంగావటంలేదుసార్! సీతారాంగారు కూడా స్వయంగా గమనిస్తున్నారు. మంచిమార్కులు రావాల్సిన ఎందరో ఫెయిలయ్యారు. ఉత్తీర్ణులయినవారి శాతం చాలాదారుణంగా పడిపోయింది. ఈ విషయమై మేం ఆందోళన చెయ్యాలనుకుంటున్నాం సార్!"

భరద్వాజ సాధికారమయిన గొంతుతో అన్నాడు-

"అకడమిక్ కౌన్సిల్ సమావేశంలో వీసీని ఈ విషయమై ప్రశ్నించాలంటూ త్యాగరాజన్ ద్వారా ప్రయత్నం చేసినది నువ్వేగదా?"

త్యాగరాజన్‌కి తన పేరు తెలిసే అవకాశంలేదు. భరద్వాజ ప్రశ్నకి ఏం జవాబు చెప్పటం- తనే అనటమా కాదా?

"నేనే సార్" వేణూ ఒప్పుకున్నాడు.

"నేనేమన్నదీ నీకు చేరే ఉంటుంది-"

వేణు తల ఊపాడు. భరద్వాజ సాలోచనగా సీతారాం వేపు ఒక్కసారి చూపు మలిచాడు. తర్వాత అన్నాడు.

"వీసీ సంగతి నాకు బాగా తెలును. చాలా స్ట్రిక్టు. మంచిమనిషి. కులరాజకీయాలకీ, పార్టీ రాజకీయాలకీ అతీతుడు. మీ ఆందోళనలో నాకే పాయింటూ కనిపించటంలేదు. పరీక్షలు నిర్వహించకుండానే మిమ్మల్ని పాస్‌చేసేయాలన్న వితండవాదం తప్పించి-"

వేణూ కించిత్తు షాకింగ్‌గా చూశాడు.

"మీరూ ఇలా అంటారని నేను ఊహించలేదుసార్!"

"నీ ఊహలకి నేను బాధ్యుడను కాదోయ్-"

పట్టించుకోనట్టు కొనసాగించాడు వేణు.

"మీ భావాలు మీ ఉపన్యాసాల ద్వారా మా విద్యార్థులకి సుపరిచితాలు. హేతువుకి ప్రాధాన్యతనిస్తారని ఇన్నాళ్ళుగా మేం విశ్వసించాం!"

క్షణకాలం ఆగి అన్నాడు భరద్వాజ-

"నీ పాయింట్ ఏమిటో చెప్పు"

"స్టాటిస్టిక్స్‌నిబట్టే ఈనాడు మనం నిర్ధారణకు వస్తున్నాం! ఒక్కమారుగా పన్నెండూపాయింట్ ఎనిమిది రెండు శాతం ఉత్తీర్ణత పడిపోయింది. ఇలా ఇంతకుముందు జరగలేదు. ఒక్క ఏడాదిలో విద్యార్థుల శ్రద్ధా తెలివి తగ్గిపోవటంగాని, అధ్యాపకుల బోధనాసక్తి శక్తి తగ్గిపోవటంగాని- జరిగే అవకాశంలేదు. అయితే మరే కారణమయ్యుంటుంది?" ఆగాడు వేణు.

"వీ.సీ... వీ.సీయే కారణం! ఇదేగదా నీ పాయింటూ"

"లేదుసార్! నేనలా అనటంలేదు. యూనివర్సిటీ అధిపత్యం ఆయనది గనక- మా సమస్యలను ఆయనముందే పరిష్కారం చేసుకోవాలిగనకా- ఆయనకి వ్యతిరేకంగా ఉద్యమం తలెత్తినట్లు కనిపించకతప్పటంలేదు"

"మరెవరిదయితే తప్పు?"

"అసలు తప్పు జరిగిందా లేదా అన్నది తేలాలిసార్! నక్కృత్తుగా ఎక్కడో జరిగిన చిన్ని చిన్ని పొరబాట్లకి ఉద్యమాలు పుట్టవు. పుట్టించటమూ సులభంకాదు. చాలా భారీయెత్తున అక్రమాలు జరిగినట్టు ఖండితంగా తేలాలి. ఆపైన అవి ఉద్దేశపూర్వకంగా జరిగాయా. యాదృచ్ఛికమా అన్నది ప్రశ్న. ఉద్దేశపూర్వకమే అయితే ఏమిటా ఉద్దేశమన్నది ఆఖరు

ప్రశ్న''

భరద్వాజ అదోలా నవ్వాడు.

''నీ ప్రశ్నలకి జవాబుల కోసం ఉద్యమాలు సాగవు-''

''మీరన్నది వాస్తవమేసార్! జరిగిన అక్రమం వెనక ఉద్దేశమూ దానివల్ల ప్రయోజనం పొందినవారు బయటపడ్డాకనే ఉద్యమం పుంజుకుంటుంది. జరిగినదానిని సరిదిద్దటమూ- భవిష్యత్తులో జరగకుండా జాగ్రత్తపడేట్టు చేయటమే ఉద్యమానికి లక్ష్యం. అందుకే ముందుగా మేమీ సర్వే ప్రారంభించాం''

''ఏమిటి నీ సర్వే? ఎవరు చేస్తున్నారు?''

భరద్వాజ గొంతులో చిరుమార్పు కనిపించటంతో వేణు ఉత్సాహంగా అందుకున్నాడు.

''ఉత్తీర్ణత శాతం ఏ మేరకు పడిపోయిందన్నది మొదటి అంశం. పొరబాట్లూ అక్రమాలూ ఎంతవరకూ జరిగాయి ఇది రెండవ అంశం. దీనిగురించి అధ్యాపకులు ఏ విధంగా భావిస్తున్నారు? ఇదిమూడు. రిజల్ట్సుని ప్రకటించటానికి ఏర్పాటుచేసిన పద్ధతులన్నీ సక్రమంగా అమలు చేయబడినాయా ఇది నాలుగు. ఇంతవరకూ మేం అనుకున్నవివి. ఇవికాక సర్వేచేస్తున్న వారిదృష్టికి వచ్చిన ఇతర అంశాలు. ఇద్దరు విద్యావేత్తలు, ఓ రిటైర్డ్‌జడ్జీ, పౌరహక్కుల సంఘానికి చెందినవారొకరూ ఓ పబ్లిక్‌ఫిగరూ మా అభ్యర్థన మన్నించి పూర్తి సహకారం ఇస్తామన్నారు. సర్వేచేసి నివేదిక ఇస్తామన్నారు''

భరద్వాజ వేణు చెప్పినది విని ఏమీ మాట్లాడలేదు.

సీతారాం వాళ్ల సంభాషణను వింటూ భరద్వాజనే గమనిస్తున్నాడు. ఓ బరువయిన సంఘటనను చెప్పి అతనిని తాను వాడుకోటానికి [illegible]బరిచానన్న కించ అంకురించింది- ఈ ఉద్యమాల వల్ల, సర్వేలవల్ల వెళ్ళిపోయిన వాను తిరిగి వస్తాడా? తనకి జరిగిన నష్టం పూడుకుంటుందా? ఇంతకీ వాడు ఏమయిపోయాడు!? బతికే ఉన్నాడా? ఈ చివరి ఆలోచన అతనికి నిస్సత్తువ కల్గించింది. దానితో ఆ కించ మొక్కఅయింది. భరద్వాజను తను ఏ ప్రయోజనమాశించి అంతగా అర్థించాడూ?- చూస్తుంటే అతనిలో ఎలాంటి సహకారధోరణి కనిపించటంలేదే!- ఈరకమయిన భావన అతనికి దుస్సహంగా తన ఉనికిపట్లనే తీవ్రమయిన వెలితిగా మారి పెనువృక్షమయింది.





అక్కడ మౌనం ఏర్పడగానే అన్నాడు సీతారాం-

''భరద్వాజగారూ... నా మీద సానుభూతితో ఏదయినా చేస్తే అది నాకు కష్టంగా ఉంటుంది. మీరేం చేయగలిగారో దానివల్ల వేణుకి లాభమేమిటో నాకు అర్థంకాదు. కానీ-''

తను ఏం చెప్పాలో, ఏం చెబుతున్నాడో సీతారాంకి అర్థంకాలేదు.

భరద్వాజ నవ్వాడు.

''అలాగే సీతారాంగారూ! మీగురించి నేను ఈ విషయంలో ఏమీచేయను. ఇతను చెబుతున్న సర్వే గురించి నేను ఆలోచిస్తున్నాను'' అంటూ వేణువయిపు చూశాడు.

''మీ సర్వేలో మరో అంశాన్ని చేర్చాలి వేణూ! పాఠ్య గ్రంథాలలో ఇవ్వబడిన విషయం పరిధిని ప్రశ్నాపత్రాలలో దాటారా? ఎంత శాతం దాటారూ? ఇది గడచిన ఏడాదికీ ఇప్పటికీ పెరిగిందా లేదా?''

వేణూ కళ్ళు మెరిశాయి.

''చాలా ముఖ్యమయిన పాయింట్‌సార్- తప్పకుండా సర్వేలో చేర్చమని కోరతాను-''

భరద్వాజ మరికొన్ని సూచనలు చేశాక వేణూ వాటిని నోట్ చేసుకున్నాడు.

''అకడమిక్ కౌన్సిల్ సమావేశంలో నేనీ విషయమై వీసీని అడుగుతాను. అయన రియాక్షన్ ఏమిటో చూద్దాం'' అన్నాడు భరద్వాజ.

ఇద్దరూ బయలుదేరుతున్నప్పుడు సీతారాంని ఉండమని కోరాడు భరద్వాజ. అతనికి ఎంత త్వరగా బయటపడతానా అని ఉంది- కాదనలేక ఉండిపోయాడు. వేణూ సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు.

భరద్వాజ మరోమారు టీ తెప్పించాడు.

''మీకోసమే నేను ఒప్పుకున్నాననుకుంటున్నారా?''

సీతారాం అలాంటి ప్రశ్నకు మరో సంద

ర్యంలో అయితే ఎటూ తేల్చని నవ్వు నవ్వుతాడు. ఆ సమయంలో అతను జవాబివ్వలేదు.

"నేను ఒప్పుకోటానికి కారణం మీరు మాత్రంకాదు. ఈరోజు జరిగిన ఓ సమావేశం నన్ను కలవరపెట్టింది. నేనేం చెయ్యగలనన్న విచారం కలిగించింది సీతారాం" అంటూ నిట్టూర్చాడు.

భరద్వాజ సీతారాం ముఖంలోకి చూడకుండా సోఫాలో వెనక్కి జారబడి కళ్ళు మూసుకుని చెప్పటం ప్రారంభించాడు దాని సారాంశం!

పరిసరాల కాలుష్యత ఈనాటి మానవుడి జీవితంలో ఓ ప్రచ్ఛన్నభూతం. అభివృద్ధి చెందిన దేశాలలో కాలుష్యతాస్థాయిని కొంతవరకూ అదుపుచేయగలిగినా అభివృద్ధిచెందుతున్న దేశాలలో ఇది త్వరితంగా పెరిగిపోతోంది. దీని గురించి ప్రపంచ ఆరోగ్య సంస్థ, తదితర స్వచ్ఛంద సంస్థలూ సమీకరిస్తున్న వివరాలనూ చేస్తున్న హెచ్చరికలను దృష్టిలో పెట్టుకుని ప్రభుత్వం అనేక చర్యలు తలపెట్టింది. కాలుష్యాన్ని తొలగించటానికీ, కాలుష్యం నిరోధించటానికీ యోజనలు మొదలయ్యాయి. ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్లలాగే ప్రతి ఫ్యాక్టరీకి ఎన్విరాన్‌మెంట్ ఇన్‌స్పెక్టర్లను ఏర్పాటుచేయాలన్న ప్రతిపాదన వచ్చింది. ఎన్విరాన్‌మెంటల్ ఇంజినీరింగ్ పేరుతో డిగ్రీ స్థాయిలోనూ, డిప్లమాస్థాయిలోనూ కొత్తకోర్సులు ప్రారంభించాలని ప్రభుత్వం యోచిస్తోంది. ఈ కొత్తకోర్సుకి సబ్జెక్ట్సును నిర్ధారించటానికి ఓ నిపుణుల సంఘాన్ని నియమించింది. అందులో భరద్వాజ ఒకడు. ఆయన చాలా శ్రమించి సబ్జెక్ట్సును ఎంపికచేశాడు. పరిసరాల కాలుష్యతతోబాటు- విశాలమైన దేశంలోని వివిధ వాతావరణాల తారతమ్యాలను దృష్టిలో ఉంచుకుని అందుకు తట్టుకుని నిలబడగల యంత్రాలనూ, విడిభాగాలనూ పరీక్ష చేసే విధానాలను కూడా తీసుకుని సబ్జెక్ట్సును ఎంపిక చేశాడు. ఆయన లిస్టును దాదాపు మిగిలినవారంతా అంగీకరిస్తూ మరికొన్నింటిని చేర్చాలని ప్రతిపాదించారు. ఇందులో ఆ సబ్జెక్ట్సుకు సంబంధమేమిటన్నాడు భరద్వాజ.

"ఒకొత్త కోర్సుని ప్రవేశపెడుతున్నారంటే మీరు కేవలమూ ఆకోర్సు గురించే యోచించితే చాలదు. దానిని చదువుకునే విద్యార్థుల గురించీ ఆలోచించాలి"

"సబ్జెక్ట్సు ఎక్కువయితే విద్యార్థులకి సులువని నేను అనుకోలేను" అన్నాడు భరద్వాజ.

"అలా అని నేనూ అనుకోలేను! కానీ వాళ్ళ విద్యకు ప్రయోజనం ఉండాలి. ఉద్యోగం దొరకాలి. దానికి ఉద్యోగావకాశం ఉండాలి. మనమెలాగూ ఉద్యోగాలు చూపించలేం! కనీసం వాళ్ళ చదువు ఎక్కడికెళ్ళినా చెల్లుబడి అయ్యేలా చెయ్యాలి అందుకు సబ్జెక్ట్సు పెంచాలి. కోర్సుకి పేరు కూడా ప్రత్యేకంగా కాకుండా జనరల్‌గా ఉండాలి"

భరద్వాజ ఆలోచనలోపడ్డాడు.

ప్రత్యేకంగా ఒక అంశాన్ని ఎంచి క్షుణ్ణంగా బోధించినప్పుడు విద్యార్థి నైపుణ్యం పెరుగుతుంది. తద్వారా దేశంలో సగటు నైపుణ్యం బాగా పెరుగుతుంది. అనేకరకాల అంశాల మీద పరిచయమాత్రపు చదువును ఇవ్వాలి. లేదా ఓ మనిషి శక్తికిమించిన చదువును నిర్దేశించాలి. రెండు విధాలా విద్యార్థికి భారమే! అంతకుమించి విద్యార్థి నైపుణ్యం పెరగదు. అతని సామర్థ్యం పూర్తిగా వినియోగంలోకి రాకుండాపోతుంది. ఫలితంగా దేశంలో సగటు నైపుణ్యస్థాయి తగ్గిపోతుంది. ఈ సమస్యను గురించి ఆలోచిస్తున్నకొద్దీ అతనికి చికాకు పెరిగిపోతోంది.

తన పాయింట్‌ని ఒప్పించాలన్న ప్రలోభాన్ని తొలగించుకోటానికీ, ఎదుటి వాళ్ళూ అలాంటి ప్రలోభాన్ని విడిచి మాట్లాడుతున్నారని నమ్మించుకోటానికీ ప్రయత్నంచేస్తూ సాగుతున్న చర్చను వినసాగాడు భరద్వాజ.

అవసరాన్నిబట్టి విద్యార్థుల సంఖ్య పరిమితం చేస్తే మంచిదని భరద్వాజను ఒకరు సమర్థించారు. "అది మన చేతులలో ఉండదు. సీట్ల సంఖ్యను ప్రభుత్వాలు అనేకరకాల ఒత్తిడులకు లొంగిపెంచుకుంటూ పోవటం మనకి తెలుసు. వెంటనే ఉద్యోగాలు దొరికే అవకాశమున్న చదువులకు విద్యార్థులు ఎగబడతారు. ప్రైవేటు సంస్థలు ఆ చదువును అందివ్వటానికి కళాశాలలుపెట్టి సొమ్ముచేసుకోటానికి చూస్తాయి. ఫలితంగా విద్యార్థుల

సంఖ్య అవసరాలకుమించి పెరిగిపోతుంది'' అన్నారు మరొకరు.

''తన సామర్థ్యం ఈ దేశానికి ఎంతవరకూ వినియోగపడుతోందీ! మానవ సముదాయం తాలూకు మొత్తం సామర్థ్యాలను టాప్ చేయగ లిగితే మానవ జీవితం ఎంత సజావుగా సాగుతుందీ! తను ఏమీ చేయలేకపోటానికి కారణం ఏమిటి? లోపం ఎక్కడుంది? అది నివరణాతీతమయిన లోపమా?''

అంతా విన్నాకా

సీతారాంకు అతని బాధ కొంతవరకూ అర్థ మయింది. కొంత అర్థం కాలేదు దానిని పూర్తిగా తరచేశక్తి అతనికిలేదు. నిపుణుని నైపుణ్యం అతని ఆత్మవిశ్వాసంమీదకూడా ఆధారపడి ఉంటుంది. నైపుణ్యమూ ఆత్మవిశ్వా సమూ కొంతవరకూ పరస్పరాధారాలు. వ్యక్తి ఆత్మవిశ్వాసానికి దెబ్బతగిలితే అతను విలవి లలాడిపోతాడు. ఇలాంటి సందర్భాలలోనే కొందరు మేధావులు ఆత్మహత్యలు చేసుకున్నా రు. ఈ విధంగా సీతారాం ఆలోచించలేదు. భరద్వాజ గొప్పవాడు. తనకెందుకూ అనుకో కుండా లోకాన్ని గురించి యోచించే సహృద యుడు. ప్రభుత్వోద్యోగంలో తన శక్తి వినియో గంలోకి రావటంలేదే అని పడేమథన తనకు నిత్యానుభవం గనక భరద్వాజ వేదనా అంటు వంటిదే- ఆ విధంగా ఆలోచించాడు సీతారాం.

''మీలాంటివాళ్ళు చాలా అరుదుగా ఉంటా రు సార్! చెప్పదగ్గవాడిని కాదుగానీ వీలయి నంతవరకూ చేయటమే మంచిది''

భరద్వాజ అతనేమన్నదీ విన్నట్టేలేదు.

''విద్య ఎందుకు సీతారాం! వ్యక్తి వికాశానికీ, దేశ వికాశానికీనూ! వ్యక్తి సంస్కారాభివృద్ధికన్న వ్యక్తి జీవికకీ- దేశ ఆర్థికాభివృద్ధికన్న వ్యక్తి జీవికకీ- ప్రాధాన్యత. విద్య కేవలమూ వ్యక్తి జీవికకే అయినప్పుడు నాకీదేశంమీదా, దాని అభివృద్ధిమీదా నమ్మకంపోతోంది-''

టీ వచ్చింది.

భరద్వాజతో స్వవిషయాలు మాట్లాడడు సీ తారాం. ఆరోజు వాసు విషయం చెప్పాక భరద్వాజ ప్రతిస్పందన ఆధారంగా ఏర్పడిన వెలితి లోలోపల పనిచేస్తూవుంది. భరద్వాజ వ్యక్తపరిచిన వేదన ఉన్నతంగా అనిపించ టంతో దానిముందు తనవేదన సంకుచితంగా కనిపించి ఆ వెలితి మరింత పెరిగింది. వాస్తవానికి తననుంచి తను తప్పించుకోటానికే ఉద్యమంలో ఉడతాభక్తిగా ప్రవేశించాడు. అయితే వేణూ ప్రవర్తన, నిమగ్నత. నిబద్ధత తనని గాఢంగా ఆకర్షించాయి. దాంతో ఉద్య మంపట్ల సీరియస్‌నెస్ పెరిగింది. ఈరోజు భరద్వాజ కూడా దాన్ని గురించి అనుకూల ధోరణిలో మాట్లాడినట్లు అనిపించటంతో సీ తారాం టీకప్పు కిందనుంచుతూ అడిగాడు.

''ఈ ఉద్యమం గురించి ఏమంటారు సార్?''

''ఏంలాభంలేదు'' అన్నాడు భరద్వాజ పె దవి విరుస్తూ.

తెల్లబోయాడు సీతారాం.

''అంటే?''

''కుర్రాళ్ళు హుషారుగా ఏదో చేస్తున్నారు. వద్దంటే మానతారా? చెయ్యనీండి కానీ ఈ సర్వే కొంత నావెల్‌గా ఉంది. మంచి ఇంట్ర స్టింగ్ స్టాటిస్టిక్స్ దొరుకుతాయి''

అతనన్నది ఈసారి కూడా సీతారాంకి దొరక లేదు. అతను తనకన్నా మేధావి గనక తనక న్నా మిన్నగా ఆలోచించగలడనిపించింది.

''వేణూమీద మీ అభిప్రాయం ఏమిటి సార్?''

''ఒక్కమారు కలిసిన వ్యక్తిమీద అభి ప్రాయం ఏముంటుంది సీతారాం? ఆవేశపరు డిని నమ్మవచ్చా, నిదానస్తుడిని నమ్మవచ్చా అన్నదో ప్రశ్న. మీ వేణూలో వయసుకుమించిన నిదానం ఉంది. కనక ఆ ప్రశ్నకు మీ ఇష్టంవ చ్చిన జవాబిచ్చుకోవచ్చు''

ఈ విధంగా కొంతసేపు సంభాషణ సాగాక సీతారాం సెలవు తీసుకుని బయటపడ్డాడు.

అతనిలోని వెలితికి అయోమయం తోడ యింది.

* * *

ఇంటికి చేరేసరికి పదిదాటిపోయింది.

రాధ తన గదిలో చదువుకుంటోంది.

శారద, కమల, కమల పిల్లలూ ఎవరి అలికిడీలేదు.




బట్టలు మార్చుకుని కొంతసేపు విశ్రాంతి తీసుకున్నాక రాధని పిలిచాడు.

"అయ్యయ్యో! మీరు వచ్చారా చూడలేదంటూ" గబగబావెళ్ళి డైనింగ్ టేబుల్‌మీద భోజనం ఏర్పాటుచేసింది. వచ్చి భోజనానికి కూర్చున్నాడు సీతారాం.

"మామయ్య వచ్చి అమ్మనీ, పెద్దత్తనూ, వాళ్ళనీ బాబా దగ్గరకు తీసుకువెళ్ళాడు" అంది రాధ.

సీతారాం భోజనం పూర్తి చేశాడు. రాధ కంచం తీసేసింది. అంతవరకూ ఆమెనే గమనిస్తున్నాడు. అతనికి ఎవరితోనైనా ఏదో ఒకటి మాట్లాడాలనివుంది. ఎప్పుడూ రాధను తను దగ్గరకు తీసుకుని మాట్లాడలేదు. రాధ పని పూర్తిచేసుకుని తన గదిలోకి వెళ్తూండగా ఆపి దగ్గర కూర్చోబెట్టుకున్నాడు.

"ఏం చేస్తున్నావ్?"

"చదువుకుంటున్నాను"

మళ్ళీ సంభాషణ ఆగిపోయిందని గుర్తు వచ్చాక అన్నాడు "అమ్మ ..." అంటూ సంశయంగా ఆగాడు. బిత్తరపోయి చూసింది రాధ.

"అన్నయ్య ఏమయ్యాడనుకుంటోంది అమ్మ?"

"మొన్ననెవరో భూతవైద్యుడు దగ్గరకు తీసుకువెళ్ళాడు మామయ్య. అంజనమో అదేంటో వేశాడట. అన్నయ్య క్షేమంగా ఉన్నాడట. ఏదో భూతాలు పట్టాయని శాంతులో రక్షలో ఏంటో చేయించాలనీ చెప్పాట్ట"

ఆ వార్త చెప్పటంలో రాధ గొంతులో అయిష్టత తొంగిచూస్తోంది. సీతారాం ఆదుర్దాగా అడిగాడు.

"అమ్మ నాతో చెప్పలేదేం?"

విస్తుపోయినట్లు అంది "మీరూ ఇలాంటి చెత్తనమ్ముతారా డాడీ?"

"నువ్వేమనుకుంటున్నావు?"

"నమ్మరు!"

"అన్నయ్య-?"

"వాడా!? వాడిసంగతి నాకు పూర్తిగా తెలీదుగానీ-"

"చెప్పు"

"వేణుతో స్నేహంగా ఉండేవాళ్ళెవరూ ఇలాంటివి నమ్మరు"

రాధ నోటమ్మట వేణు విషయం చేదుగా వినిపించింది. అతనిలో వెలితిని మరింత పెంచింది.

"అమ్మ శాంతి చేయిస్తాననంటే చేయించాలా వద్దా రాధా?"

"మాన్పించాలిసిందే!" తెగేసి చెప్పింది రాధ.

కూతురిని పట్టిపట్టి చూస్తుంటే ఎంతపెద్దదయిపోయింది! అనిపించింది. మెల్లగా అన్నాడు.

"అన్నయ్య ఎక్కడున్నాడో, ఎలా ఉన్నాడో చెప్పవేం! వాడినెలాగూ తీసుకురాలేకపోతున్నాం! కనీసం వాడు ఉన్నాడన్న నమ్మకమయినా అమ్మకు కలిగించాలిగదా రాధా!"

రాధవద్ద జవాబు తయారుగా వున్నట్లులేదు-

"అయితే శాంతి చేయిస్తారా మీరూ?"

"అమ్మ నాతో చెప్పలేదుగదా!"

"చెప్పదు... ఇలాంటివి చెపితే మీరు కోప్పడతారని భయం!"

తనదగ్గర అంతా భయపడతారు. ఎందువల్ల? అస్థిమితంగా ఉంది సీతారాంకు. వాసూ వెళ్ళిపోయినదగ్గర్నుంచీ తనలో ఏదో మార్పు వచ్చింది. తన ప్రతిచర్యా, ప్రతిభావమూ, ప్రతిమాటా పరిశీలనకు గురవుతున్నాయి.

"వెళ్ళు" అన్నాడు.

రాధ వెళ్ళబోతూ వెళ్ళబోతూ ఆగి "డాడీ" అంది. సీతారాం నిశితంగా చూశాడు.

"మీరు నిజంగా శాంతి చేయిస్తారా డాడీ?"

ఆ ప్రశ్న అతను ఊహించలేదు. వేణు గురించి ఏదో ప్రశ్న వస్తుందని అనుకున్నాడు. ఈ పదహారేళ్ళపిల్ల నమ్మకాలపట్ల అపనమ్మకం ఏర్పర్చుకుంది. అది ఎంత బలంగా ఉందీ అంటే తండ్రిపట్ల ఆమెకున్న నమ్మకమే దెబ్బతినేలా ఉంది.

"చేయించనమ్మా!" అన్నాడు.

రాధ వెళ్ళిపోయింది.

బిడ్డ దృష్టిలో తనపట్ల ఓ ఇమేజ్ ఉంది. అది తను మార్పు చేయలేదు. తల్లిమీద కూడా

రాధకు ఓ ఇమేజ్ ఉంది. దానిని శారద మార్చవచ్చు. తనలో మార్పు బిడ్డను గాయపరుస్తుంది. తల్లిలో మార్పు రాధకు తన నమ్మకాలపట్ల నమ్మకాన్ని మరింత పెంచుతుంది. అంటే ఓవిధంగా పిల్లల దృష్టికి తల్లిదండ్రులు బందీలన్నమాట! అలాగే తలిదండ్రుల ప్రవర్తనకు పిల్లలు బందీలన్నమాట! ఒకే కప్పుకింద బతికే వ్యక్తులు ఏదోవిధంగా ఒకరికొకరు బందీలన్నమాట! ప్చ్! సమాజంలో వ్యక్తులచుట్టూ వాళ్ళు తీసుకున్న గిరులుకొన్ని- వాళ్ళ చుట్టూ వ్యక్తులు గీసిన గిరులు మరికొన్ని-

సీతారాం ఆలోచనలు ఎటుతీసుకువెళితే అటువెళ్తున్నాడు. అతనికి కాలం తెలియటంలేదు.

శారద, కమల, రాజూ ఒంటిగంటదాటాక వచ్చారు.

భర్త ఇంకా మెలకువగా ఉండటంతో శారదకు గాభరా వేసింది.

రాజు బండి దోవలో పాడయిదంటూ నవ్వుతూ నవ్వించే ప్రయత్నం చేస్తూ మాట్లాడాడు. అతను వెళ్ళిపోయాక సీతారాం తన గదిలోకి వెళ్ళిపోయాడు.

ఆడపడుచుకీ, పిల్లలకీ అవసరాలు చూసి శారద గదిలోకి రావటానికి కొంత సమయం పట్టింది.

"ఏమండీ!" అంది మెల్లగా.

సీతారాంకి జవాబివ్వాలనిపించలేదు. మెల్లగా సమీపించి భర్త మొహాన్ని పరిశీలించింది. నిద్రపట్టేసిందనుకుంది. బయటకు నడిచి విభూతి తీసుకువచ్చింది. భర్త నుదుటిమీద అంటీఅంటనట్టుగా పెట్టబోయింది.

సీతారాం కళ్ళువిప్పి చూసేసరికి చటుక్కున చెయ్యి వెనక్కి తీసేసుకుంది.

లేచి కూర్చుని లైట్ వేశాడు సీతారాం.

శారద చటుక్కున వెనుదిరిగి మంగళసూత్రాలను కళ్ళకు అద్దుకుంటోంది.

"శారదా!"

అతనివయపు తిరిగింది. కళ్ళలో ఏదో ఓ ఉత్సాహాన్ని భయం మూసివేస్తున్న ఛాయలు. ఇన్నేళ్ళుగా ఆమె తనతో పడుకుంది. తనతో వివిధ ప్రదేశాలు చూసింది. బంధుమిత్రుల వివాహాలకూ, మంచిచెడ్డలకూ హాజరయింది. కానీ ఆమె తనతో సహజీవనం చేసిందా? రాజుకీ, తనకీ మధ్య స్నేహం బంధుత్వమయింది. కానీ బంధువుగా మారిన ఈ స్త్రీతో తను స్నేహం చేయగలిగాడా? వాసూతో తను ఏంపంచుకోలేకపోయాడో అదే ఈమెతోకానీ, రాధతోగాని పంచుకోలేకపోయానన్న అనుమానం స్థిరపడి ఎరుకగా మారి సీతారాంని నమిలివేస్తోంది. కేవలమూ తను ఉద్యోగాన్ని ప్రేమించాడు. పనిని ప్రేమించాడు. అది ఇచ్చే సంతృప్తిని చుట్టుకుని జీవించాడు. తెలిసీతెలీని వయసులో లలితని ప్రేమించానని భ్రమించాడు. భావరాహిత్యంలో ఆ ప్రేమభావన చుట్టూ ఊహలు చేసుకున్నాడు. ఆమెను వివాహమాడినా ఈ శారదతోకన్నా దగ్గరకు వెళ్ళగలిగేవాడా? ఎందువల్ల? తనలో లోపమేమిటి?

సీతారాంలో వెలితి రకరకాల ప్రశ్నలు వేయిస్తోంది.

"ఏదో చెప్పాలనుకుంటున్నావు- చెప్పు శారదా!"

"మీరేమయినా అంటారు-"

"అనను... చెప్పు-"

"బాబాగారు చెప్పారండీ! మన వాసూ క్షేమంగా ఉన్నాడట! తిరిగి వస్తాడుట! తప్పకుండా తిరిగివస్తాడుట! వాడినేదో గ్రహం వక్రదృష్టితో చూస్తోందిట. తిరిగివచ్చి నా తలకు కొరివిపెడతాడట-" అంది అతని నుంచి దూరంగా చూస్తూ. ఆమెకళ్ళు ఆర్ద్రంగా ఉన్నాయి.

ఆమె చేయిపట్టుకుని దగ్గరకు తీసుకున్నాడు.

అతనిచేయి ఆమె వీపుమీద కదులుతోంది.

అంతే! ఒక్కమారు ఆమె బిగ్గరగా స్వేచ్ఛగా ఏడవనారంభించింది.

అతను ఆమెను మాటలతో ఓదార్చలేదు.

భర్తనుంచి ఆమె పొందుతున్నది ఆమె శరీరంద్వారా ఆమె మానసాన్నీ, ఆమె జీవితాన్నీ పూరిస్తోంది.

ఆమెకు అతను ఇష్టంగలిగినదానిని ఇవ్వగలుగుతున్నానన్న భావనతో అతనిలోని వెలితి

తొలగి తనమీద తనకొక నమ్మకం ఏర్పడసా గింది.

అతనికి వేణూ గుర్తువస్తున్నాడు.

ఆ కుర్రవాడు లోకాన్ని తనదిగా భావించుకో గలుగుతున్నాడు.

రాజు మాటలు గుర్తువస్తున్నాయి.

"హత్య చెయ్యటానికీ కావాలి బావా దీక్షా తెలివీ, సాహసమూ, యోజనా..."

అతనికి రాజుమాటలు అతని గొంతు నుంచి వచ్చినట్లనిపించలేదు. వేణూకి రాజూ పట్ల తనవట్లాగల విరుద్ధభావాలకు కారణం అర్థమయినట్లనిపించసాగింది.

రాజు తెలివీ భరద్వాజ తెలివీ వాటి ముందు తనకి కలిగే వ్యతిరేకభావనలూ కొంత స్పష్టమవుతున్నట్లవసాగింది.

శారద పసిపిల్లలా కావలించుకుని పడు కుంది! సీతారాంకి లోకాన్ని కావలించుకున్న ట్లుంది.

తనలోనికి మరో ప్రాణిని చేర్చుకోటంలోని అనుభవం అతని వెలితిని పూరించి సమస్తలో కాన్నీ ప్రేమించి స్వీకరించే భావనకు అంకురా ర్పణ చేసింది.

ఆ క్షణంలో అనుభవం సారధియై ఆలోచన ను నడిపిస్తోంది.




యూనివర్సిటీ ముందు పోగయిన విద్యా ర్థుల సంఖ్యను గమనిస్తుంటే రమ, రవి, నటరాజుల మొహాలు ఆందోళనతో నిండుతు న్నాయి. వేణు మొహాన్ని గమనిస్తున్న రమకు అతని భావాలు అందటంలేదు. వాగ్దానం చేసిన అనేక కళాశాలల నుంచి ఒక్కరు కూడా రాలేదు. అట్టలు వక్కనవడేసి విద్యార్థులు కబుర్లలోపడ్డారు. వేరుశనగకాయలూ బఠాణీ లూ పుచ్చకాయముక్కలూ అమ్ముడవుతు న్నాయి.

చూపులన్నీ రోడ్డుమీదేవున్న వేణు భు జంమీద ఓ చెయ్యిపడింది! బీయస్‌యమ్ కాలేజీ ప్రతినిధి. అతనివెనకే మరో ఇద్దరు.

"లాభంలేదు గురూగారూ! మూడుదా టింది. మీరు చూస్తూ కూర్చోండి. మేం వెళ్ళిపో తున్నాం"

వేణు కదలక తప్పలేదు. ఏభయిమందికి లోపు విద్యార్థులతో ఊరేగింపు మొదలయింది. గేటునుంచి వీసీ కార్యాలయంవయిపు సాగింది.

"విద్యార్థి ఉద్యమం వర్ధిల్లాలి! వీసీ చర్యలు నశించాలి-"

వీసీ కార్యాలయం చేరాక కొంతసేపు నినా దాలు చేశారు. వేణూ కొందరు విద్యార్థులతో ఓ బృందంగా లోపలికి నడిచాడు.

"వీసీలేరు"

"ఉన్నాడు. మాకు తెలుసు" నటరాజు ఉద్రేకంగా అన్నాడు. వేణూ అతని భు జంమీద చెయ్యివేసి తగ్గమన్నట్లు నొక్కాడు.

"పరీక్షలలో అక్రమాలు జరిగాయి. వాటిని వీసీగారి దృష్టికి తీసుకురావాలి. మా మెమొ రాండం ఆయన తీసుకోవాలి. అందాకా మేం ఇక్కడనుంచి కదలం" అన్నాడు వేణు.

"ఆయనలేరు. ఉన్నప్పుడు వచ్చి ఆయన ను కలవండి"

"ఆయన ఈరోజు వచ్చారు"

"రాలేదని అనటంలేదే! ఒంటిగంటకు వెళ్ళిపోయారు"

"ఇలా ఎన్నిసార్లు పారిపోతాడూ?" అన్నా డు నటరాజు.

"అదేదో ఆయన్నే అడగండి"

వేణూ ఓ నిశ్చయానికి వచ్చి "పదండి పోదాం!" అన్నాడు.

"ఎక్కడికి?" అన్నారు నడుస్తూ.

వేణూ ఆలోచించుతూ "కంట్రోలర్ ఆఫ్ ఎగ్జామ్స్ దగ్గరకి"

కంట్రోలర్ తన సీటులోనే ఉన్నాడు. ప్యూన్ వచ్చి చెప్పగా అతను గదిలోంచి బయటికి చూసి వాళ్ళ స్లోగన్స్ విన్నాడు. వీసీ కార్యాలయానికి ఫోన్‌చేసి ఆయన లేనట్టూ, విద్యార్థులు అక్కడినుంచే వచ్చినట్లూ తెలిసింది. తర్వాత వాళ్లని లోపలికి పంపమన్నాడు ప్యూన్‌తో.

"పరీక్షలలో అక్రమాలు అంటే ఏమిటీ?" అన్నాడు కంట్రోలర్ వేణూ బృందం చెప్పినదంతా సావధానంగా విని.

వేణూబృందం ఒకరి మొహాల్లోకి ఒకరు చూసుకున్నారు. వేణూ ఓపికగా అన్నాడు-

"మా సమస్యలన్నీ ఇప్పటిదాకా చెప్పుకున్నాం! ఈ మెమోరాండంలో రాసాం మీరొకమారు చదివితే బోధపడుతుంది"

కంట్రోలర్ వేణూ అందించిన పత్రాన్ని అందుకుని చదవటం మొదలుపెట్టాడు. పూర్తిగా చదివి మెల్లగా నవ్వాడు.

"- బాగా రాశారు. ఇంగ్లీష బాగుంది. నాకు మంచి ఇంగ్లీషంటే ప్రాణం. కానీ ఇది వీసీగారు చూసుకోవాల్సిన వ్యవహారం"

"ఆయన లేరు గనకే మీకోసం వచ్చామని ముందే చెప్పుకొన్నాం!"

"అవునవును- సరే మీ అభ్యర్థన మేరకు నేను దీన్ని తీసుకొని వారికి పంపించగలను. అంతకుమించి నాకెంత సానుభూతి ఉన్నా నేనేం చేయగలను?"

"మీరు కంట్రోలరాఫ్ ఎగ్జామ్స్- ఇందులో మీ బాధ్యతావుంది. ఈ విషయాన్ని పరిశీలిస్తామని మాట ఇవ్వాలి"

పెద్దగా నవ్వాడు కంట్రోలర్.

"మీరింకా చిన్నవాళ్ళు. ఇప్పుడే కాలేజీ మెట్లెక్కారు. వీసీగారి క్రమశిక్షణ గూర్చి, బాధ్యత గురించి తెలిసేగదా ప్రభుత్వం రికమెండ్ చేసిన పేర్లని తప్పించి గవర్నరుగారు వారిని నియామకం చేశారు! ఆపైన వారు యూనివర్సిటీలోని అన్ని విభాగాలనూ స్వయంగా పర్యవేక్షణ చేసుకుంటున్నారు! అమాటకువస్తే ఈ రిజల్ట్స్ ప్రకటించేముందూ, మార్కుల టాబులేషన్‌లోనూ ఉన్న పద్ధతులన్నీ ఏకపక్షంగా మార్చేసారు. ఇదంతా వారు మీ బాగుకోసమే చేశారని నా నమ్మకం! మీరు నా పిల్లలవంటివాళ్ళే! మీరు బాగా చదివాక కూడా పరీక్షలు పోగొట్టుకుంటే మీ తల్లిదండ్రులు పడేబాధ నాకూ తెలును! సర్లే అని మీరంటూన్న అక్రమాల గురించి సరిచేస్తాననో పరిశీలిస్తాననో మాట ఇచ్చాననుకోండి- దానివల్ల నష్టం మీకే!"

"అదెలాగా?" అన్నాడు నటరాజు.

"మీరింకా కుర్రవాళ్ళు. ఆయనగనక నేనేదో నా స్వంతలాభంకోసం మీతో కలిసిపోయినట్టు భావించారా మీపని మొదటికే మోసమవుతుంది! నన్నంటారా నన్నేం చేయలేడు గనకే అసలు సమస్య"

విద్యార్థుల బృందం సెలవుతీసుకుని బయటకి నడిచింది.

వెళ్తూన్నవాళ్ళ ముఖాలు చూస్తూ వాళ్ళ గుసగుసలు వింటున్నారు గుమస్తాలు.

"కంట్రోలర్‌గారు ఆజ్యంపోసేవుంటారు"

"పొయ్యరామరి! గడ్డివాముదగ్గర కుక్కపిల్లలాగ తయారయాడు- కనీసం తోటివాడన్న ఇది కూడాలేదు మనకడుపులుకొట్టి"

"ష్... ఆ ఆనందంగాడు వీసీమనిషి. మననే చూస్తున్నాడు. కాస్తంత తగ్గి మాట్లాడుకోండి-" అన్నాడు.

బయటకు వచ్చాక కొంతసేపు మాట్లాడుకుని తరవాత కార్యక్రమం నిర్ణయించుకుందామన్నాడు వేణు.

"ఇంక నిర్ణయించుకోటానికేముంది బ్రదర్- ఇదంతా అయేపనికాదు. రిజల్టు వచ్చిన కొత్తలో ఆ వేడిలో సరేనన్నారు. ఈ గొడవల్లోకి దిగటంకన్న బుద్ధిగా ఇంటిదగ్గర చదువుకొని మళ్ళీ పరీక్షకు వెళ్తే నరనేనుకునుంటారు. పోతే డిగ్రీకాలేజీలవాళ్ళు దీన్ని పట్టించుకోటం అంత సులువుకాదు-"

"రేపు వాళ్ళకూ ఇదే జరగవచ్చుగదా?" అన్నాడు రవి.

"ఆ పాయింట్ అందరి బుర్రల్లోకీ ఎక్కాలి గదా! దెబ్బరేపు తగ్గుతుందీ మందు ఈవేళరానుకో- అంటే వినేవాడెవడు?"

మాట్లాడుకుంటూ యూనివర్సిటీ గేటు ముందు చెట్లకింద చేరారు. కొందరు బస్సుకన




బడగానే పరుగెత్తారు.

మిగిలినకొద్దిమందితోనూ వేణూ అన్నాడు-

"- మనం నిరుత్సాహపడకూడదు. మనం అడుగుతున్నదాంట్లో అన్యాయమయినది ఏమీలేదు. కాలేజీ యూనియన్లవాళ్ళని మరో మారు కలునుకొని నచ్చజెప్పటానికి ప్రయత్ని ద్దాం! మనం చేయించిన సర్వే వివరాలను వీలయితే పత్రికలలోనూ లేకపోతే కరపత్రాల ద్వారానూ తెలియబరచి గట్టి ప్రచారం చే ద్దాం-"

"మనం కనీసం వీసీని కలునుకుంటే మరింత వాల్యూవచ్చేది-" అంది రమ.

"ఇప్పుడయితే ఏం? వీసీ మనని కలునుకో నన్నాడని ప్రచారం చెయవ్వచ్చు-" అన్నారొక రు.

"ఛఛ... మనం కొన్ని ఎథిక్స్ పాటించాలి" అన్నాడు రవి.

రమ అతనివంక విచిత్రంగా చూసింది ఆమెకు తండ్రి గుర్తువచ్చాడు.

"ఎథిక్స్ మనకొక్కరికేగాదు ఎదుటివాళ్ళకీ ఉండాలి" అన్నారొకరు.

"ఎదుటివాళ్ళకు ఉండవని మనం ముందే అనుకోటం అధర్మం. మనం వాటిని పాటించిన ప్పుడు ఎదుటివాళ్ళూ పాటిస్తారు" అన్నాడు రవి.

ఇంతట్లో దుమ్మురేపుకొంటూ మూడుకార్లు ఒకదానితర్వాత ఒకటి వచ్చి వాళ్ళముందు ఆగాయి. చకచకా పదిహేనుమంది వాటి ల్లోంచి దిగారు.

"సారీబానూ... అన్న సమయానికి రాలేకపో యాం-" అన్నాడు మధు జేబులోంచి సిగరెట్ బాక్సు తీస్తూ. అతను ఆదర్శవిద్యామందిరం కాలేజీకి ప్రెసిడెంట్. అతను ఆఫర్ చేసిన సిగరెట్ని చిరునవ్వుతో తిరస్కరించాడు వేణు.

"పదండి పదండి... ఏహొటల్లోనయినా కూర్చొని మాట్లాడుకుందాం. మరీ బొత్తిగా రోడ్డు మీద దుకాణమేంటీ?" అన్నాడు మధుతో వచ్చిన ఓ విద్యార్థి.

వేణూ నవ్వాడు.

"మనం రోడ్లమీదే పోరాడాల్లాగుంది! మీ టింగులు రోడ్డు మీదయితే తప్పేంలేదుగాని జరిగిందేంటీ అంటే-"

అతని మాటపూర్తవనీలేదు రమ. ఉద్రే కంతో ఆమె ముఖం మరింత ఎర్రబడింది.

"హొటళ్ళకీ సినిమాలకీ తిరిగే మీరు రాక పోతేనరే! మీ కాలేజీల నుంచి కూడా ఒక్క పురుగుకూడా రాలేదంటే మీరు ఎవరికీ ఈ విషయం చెప్పలేదన్నమాట. ఇప్పుడొచ్చి సారీ అనేస్తే చాలా? అందరూ ఎంత శ్రమయిపో యారూ!"

"సారీ అనకపోతే కాళ్ళు పట్టుకోవాలా? బోడి కాగితం ముక్క వీసీకి ఇవ్వటానికి మీరు చాలరా?" అన్నాడు మధు.

"ఆ మాత్రందానికి ఇప్పుడెందుకు దయచే శారూ?" అంది రమ ఘాటుగా.

"కంట్రోలరాఫ్ ఎగ్జామ్స్ ఫోన్ చేసి స్వ యంగా చెప్పాడు గనక" అన్నాడు మధు స్నేహితుడొకడు.

"షటప్" అన్నాడు మధు- తన స్నేహితు డిని ఉరిమి ఉరిమి చూస్తూ.

వేణూ దీక్షగా వాళ్ళిద్దరినీ గమనిస్తున్నాడు.

మధు అతని నుంచి మొహం తప్పించి వేణూ వయిపు తిరిగాడు. ఈలోగా అతని మరో స్నేహితుడన్నాడు-

"మేం లేటయిపోయాం! అందుకని వీడు జరిగింది తెల్సుకుందామని యూనివర్సిటీకి ఫోన్చేస్తే మీరు కంట్రోలర్గారి దగ్గరకు వెళ్ళి నట్లు తెలిస్తే"

"సర్లెండి... జరిగిందేదో జరిగింది. ఆవేళ ఆందోళన చేయాలనీ, యీరోజు మార్చ్ టూ యూనివర్సిటీ అని అందరం కలిపి నిర్ణ యించుకున్నాం! తీరా మీరు రాకపోయేసరికి అప్సెట్ అయింది రమ! ఇప్పుడు మీరు వచ్చారు గనక భవిష్యత్ కార్యక్రమం గురించి ఓ నిర్ణయానికి వద్దాం-" అన్నాడు వేణు.

"రెండు రోజులు ఆగాలి!" అన్నాడు మధు.

దేనికన్నట్లు చూశాడు వేణు.

"మా విద్యార్థులు రకరకాలుగా అంటున్నా రు. మనం ఓ జాయింట్ కార్యాచరణ సంఘం ఏర్పాటుచేసుకుందామని నా అయిడియా"

అన్నాడు మధు.

"మనమిప్పటికే చాలా కమిటీలు ఏర్పాటు చేశాం! మళ్ళీ మరో కమిటీ ఏంటో నాకు బోధపడటం లేదు-" అన్నాడు నటరాజు. అతను గవర్నమెంట్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజ్ విద్యార్థి.

"మీ గాస్ (G.A.S) కాలేజీగాళ్ళకి ఏం బోధపడుతుందిలే!-" అన్నాడు మధు బృందంలో ఒకడు.

"మాటలు తిన్నగా రానీ-" అంటూ నటరాజు లేచాడు.

ఇద్దర్నీ శాంతపరిచేక మధూ అన్నాడు-

"బాసూ! మనం ఓ సలహాసంఘాన్ని ఏర్పర్చుకోవాలని వాళ్ళంతా అంటున్నారు. అందులో అనుభవమున్న రాజకీయనాయకులుంటే మన ఉద్యమానికి సరైన గైడెన్స్, డైరెక్షనూ వస్తాయి"

"వేరే సలహాసంఘం దేనికీ? మనం ఆలోచించుకో లేకపోతేగదా-?" అంది రమ.

ఆమె మాటలు పట్టించుకోనట్టు అన్నాడు మధు.

"పెద్దలు యిందులో చేరి మనకి గైడెన్స్ యిస్తే బాగుంటుంది- మనమే కుర్రతనంగా నడిస్తే- చూసావుగదా యిప్పుడేమయిందో- యిదే బాగుంటుందో- నువ్వే చెప్పాలి వేణూ!"

రమ వేణు వయిపు ఆత్రంగా చూసింది.

మధు ఏదో ఎత్తుతో వచ్చాడని అర్థమవుతోంది. అతని వెనక పది కాలేజీల మనుషులున్నారు. వాళ్ళంతా ప్రైవేట్ కళాశాలలవాళ్ళు! ఈ మధుని ఉద్యమం గురించి ఒప్పించటానికి తలప్రాణం తోకకి వచ్చింది.

వేణు నిదానంగా నవ్వాడు.

"చెప్పు వేణూ!" అంది రమ ఆత్రంగా.

"నువ్వన్నదాని గురించి చర్చించవలసిందే మధూ! ఇప్పటిదాకా మనం ఆలోచించుకున్నట్టే పోతున్నాం! ఎక్కడా దెబ్బతిన్నట్టే లేదు! ఈరోజు విద్యార్థులు మనం చేసిన ప్రచారంతో అంచనాకడితే బాగా వచ్చినట్టే లెక్క! మనం ప్రచారాన్ని ఉధృతం చేయాలి! ఏసీ ముందు మన బలప్రదర్శన వల్ల ఉద్యమం పుంజుకుంటుందనీ, ఆ తర్వాత కార్యాచరణ గురించి చర్చించుకుందామనీ గడచిన సమావేశంలో తీర్మానం చేసుకున్నాం! సరే నువ్విప్పుడేదో కొత్త ప్రతిపాదన చేస్తున్నావు! దీన్ని గురించి మనం యిప్పటికిప్పుడు ఎలా నిర్ణయం తీసుకోగలం? వచ్చే సమావేశంలో మనం చర్చించుకుని మెజారిటీ దాన్ని అంగీకరించితే- నువ్వన్నట్టు సలహా సంఘం ఏర్పాటు చేసుకోవచ్చు. అందాకా మన వెనకటి నిర్ణయాలను అమలు చేద్దాం!" అన్నాడు వేణు.

"అదేం కుదరదు! మా ప్రతిపాదన అంగీకరించకపోతే మేంపోతాం! ఇందులో ఉండం!" అన్నాడు మధు స్నేహితుడు.

"ఇప్పుడు మీరున్నారా- వేరేగా పోడానికీ?" అంది రమ.

మధు మొహం మీద నుంచి చూపు మళ్ళించలేదు వేణు.

మధు చూపు మళ్ళించగానే వేణు పెదాలు గమ్మత్తుగా విచ్చుకున్నాయి.

"అతనన్నది ఖాయమేనంటావా మధూ?"

మధు వేణుని సమర్థించటంతో మళ్ళీ ఎవరూ మాట్లాడలేదు.

రమ కొంచెం విసురుగా పోయి ఎడంగా నుంచుంది.

జరగవలసిన కార్యక్రమం గురించి కొంతసేపు వేణూ మాట్లాడాడు. మధు ప్రెస్ కవరేజ్ బాధ్యతను అంగీకరించాడు. ఆరోజు జరిగిన సమాచారాన్ని గురించి రవిని రాయమన్నాడు వేణు.

కంట్రోలరాఫ్ ఎగ్జామ్స్ యిచ్చిన సమాధానం బాధ్యతారహితమైనదనీ, ఆయన తీరు విద్యార్థి ప్రతినిధులకు తీవ్రమయిన అసంతృప్తి కలిగించిందనీ, దానివల్ల ఉద్యమాన్ని తీవ్రతరం చేయాలన్న నిర్ణయం తీసుకున్నామనీ రవి రిపోర్టు రాశాడు.

వేణూ దాన్ని చదివి మధుకి యిచ్చాడు. అతడు దానిని తన బృందంలో ఒకరికి యిచ్చాడు. అతను చదువుతూనే దానిని మార్చాడు.

కంట్రోలరాఫ్ ఎగ్జామ్స్ తన నిస్సహాయత వెల్లడించటంతో విద్యార్థి నాయకులు తమ




ఆలోచనలను సరిచేసుకోవలసి వచ్చినదనీ- బాధ్యతాయుతమయిన పదవిలోవున్నవారి పరిస్థితే యిలా వున్నందుకు ఆందోళనపడ్డారనీ- అందువల్ల ఉద్యమం పట్ల విద్యార్థులకు సరికొత్త స్ఫూర్తికలిగిందనీ, దీక్ష పెరిగిందనీ రాశాడు.

వేణు భృకుటి ముడివడింది. "దీనిని కొంచెం మారిస్తే" అన్నాడు వేణు.

కొంత తర్జనభర్జనల తర్వాత ప్రెస్ రిపోర్టు తయారయింది.

కంట్రోలర్ యిచ్చిన సమాధానం తీరు విద్యార్థి ప్రతినిధులకు తీవ్రమయిన అసంతృప్తి కలిగించిందనీ- బాధ్యతాయుతమయిన పదవిలో వున్నవారి పరిస్థితి గురించి కూడా విద్యార్థులు ఆందోళన చెందారని- అందువల్ల ఉద్యమాన్ని తీవ్రతరం చేయాలన్న నిర్ణయానికి వచ్చారనీ- రాశారు.

"బాధ్యతారహితమయిన సమాధానం" అనేది ఉండాలని రవి పట్టుబట్టాడు. కాని వేణు ఎవరిమీదనయినా తొందరగా ఓ నిర్ణయానికి రావటం ధర్మం కాదని నచ్చజెప్పాడు.

వేణూ రమా మధూ బృందం నుంచి మరో యిద్దరూ ఓ బృందంగా కాలేజీ యూనియన్ల వాళ్ళతో సంప్రదించటానికి నిర్ణయం జరిగింది. ఆ యూనివర్శిటీ పరిధిలోకి వచ్చే నగరం బయటి కాలేజీలన్నింటికీ లేఖలు రాయాలనుకున్నారు.

కాలేజీలన్నింటి ముందూ సభలుపెట్టి ప్రచారం చేయాలని రమ పట్టుబట్టింది. ఓవక్క యూనియన్లవాళ్ళ సహకారం కోసం చర్చలు సాగిస్తూ మరోవక్క ప్రత్యేకంగా సభలు పెట్టడం సబబు కాదన్నారు. చివరికి నగరంలో కూడలి స్థలాలలో మీటింగులు పెట్టుకోవచ్చునే అంగీకారానికి తెచ్చాడు వేణు.

అందరూ విడిపోయేసరికి ఎనిమిదిన్నరయిపోయింది. వేణూ రమ ఆటోలో బయలుదేరారు.

"మధూ అయిడియా ఏమిటి?" అన్నాడు వేణు. రమ చాలాసేపటి నుంచి మాట్లాట్టం లేదని గ్రహించాక.

"నాకు తెలీదు-"

"నీకు కోపం వచ్చింది-" అన్నాడు వెంటనే.

"నీకులా నేను నంగిరినంగిరిగా చెప్పలేను"

"నీ కోపం నాకు అర్థమవుతుంది రమా! కాని కోపంతో పనులు జరగవు సరిగదా ఆగిపోతాయి-"

"నాకోపం వాళ్ళమీద కాదు, నీమీదే! రారని అనుమానించిన బ్రాహ్మలు వచ్చారు! వచ్చి తిన్నగా ఉండక ఈ బెదిరింపులూ, కొత్త ప్రతిపాదనలూనా! ఏంటీ ఈ కంగాళీ అంతా-?"

"అందుకేగదా పెండింగ్‌లో పెట్టాం-"

"మనకా అవసరం ఏమిటి? మన సమస్య వాస్తవం! దానిని మనం చూసినట్లు నలుగురూ చూడాలి! చూసేలా మనం చేయాలి! అందుకు మనం అన్ని వనరులూ వాడుకోవాలి గనక వాడుకుంటున్నాం! మనకేదో వ్యక్తిగతంగా ఉపకారం చేస్తున్నట్టు వాళ్ళ దబాయింపేమిటి? నీ గాంధీ వేషమేంటి?"

వేణూ జవాబివ్వలేదు.

ఆటో రమ యింటిముందు ఆగింది.

"ఈ కోపంలో నా జవాబు నీకు బోధపడదు రమా! ముందా కోపం తగ్గనీ"

రమ ఆటోలోంచి ఉరికి వెనుదిరిగి చూడకుండా యింట్లోకి వెళ్ళిపోయింది. వీధి అరుగు మీద కూర్చున్న నిరంజనశర్మ కూతురి వయిపు చూశాడు.

వేణూ ఆటోకు డబ్బులు చెల్లించి పంపేశాడు.

ఒక్క సెకను అతను అక్కడే నిలబడి శర్మను గమనించగానే నమస్కరించాడు.

అతను జవాబుగా తలపంకించాక

"పనుందండీ... మళ్ళీ కలుస్తాను" అని నెమ్మదిగా నడుచుకుంటూ బయలుదేరాడు.

మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్- అన్న గాంధీగారి పుస్తకాన్ని చదువుతున్న శర్మ తిరిగి అందులో నిమగ్నమయిపోయాడు.

రమ తిరిగివచ్చి వీధిలోకి చూసింది.

ఆ తర్వాత తండ్రి వయిపు చూస్తూ "ఇంత గాలిలో ఆరుబయట ఎందుకూ? లోపలికి పదండి" అంది.

★ ★ ★

వీధిలోకీ- యింట్లోకీ తిరుగుతున్నాడు సీతారాం.

శారద వచ్చి హాల్లో కూర్చుంది. బయట చలిగా ఉంది. విండోఫాన్స్‌ని మూసివేసింది — ఈ చలిలో వాసూ ఎక్కడున్నాడో- అన్న ఊహ కలిగింది. మనసంతా గిజగిజలాడింది. ఇంట్లోంచి ఒక్కపైసా తీసుకువెళ్ళలేదు. రెండుజతల బట్టలు తీసుకువెళ్ళాడు. కనీసం ఓ దుప్పటి అయినా తీసుకువెళ్ళాడో లేదో!

వీధిలోంచి యింట్లోకి వచ్చి గడియారం వయిపు చూశాడు సీతారాం!

"ఎవరికోసమండీ చూస్తున్నారూ?" అంది శారద.

"యూనివర్శిటీలో ఏదో ప్రదర్శన వుందీ, అయ్యాక వస్తానూ అన్నాడు వేణు-" అన్నాడు వీధిలోకి చూస్తూ-

శారద దుఃఖం తమాయించుకోలేక అంది-

"మీకింక వాసూ గొడవేపట్టనట్లుంది-"

ఆమె కళ్ళలోకి వెర్రిగా చూశాడు సీతారాం. శారద గాభరాగా అంది-

"మీరేవో వ్యాపకాలు పెట్టుకున్నారుగానీ నాకు అస్తమానూ వాడి ధ్యాసే!"

నిట్టూర్చాడు సీతారాం.

"మానవ ప్రయత్నమంతా చేస్తున్నాను శారదా! వాడిని వెదకటానికీ నన్ను నేను కుదుటపరచుకునేందుకూనూ!-"

అతనంత తగ్గి మాట్లాడటంతో నిష్ఠూరంగా అంది- "మీరేం చేస్తున్నారో ఏమో! పూర్వం యింటిపట్టునయినా ఉండేవారు!-"

సీతారాంకి యిప్పటికే తను అధికంగా మాట్లాడినట్లు ఫీలింగు తోసుకురాసాగింది. గబగబా వెళ్ళి బయటవరండాలో నుంచున్నాడు.

శారద వెనకనే వెళ్ళి కొంతదూరంగా నుంచుంది. సీతారాం తనలో తనే ఏదో గొణుక్కుంటున్నట్లు అనిపించింది. కొంతసేపు చూసిచూసి అంది

"లోపలికి రండి! చలిగాలి మీ వంటికి పడదు"

లోపలికి నడుస్తూ అడిగాడు సీతారాం "రాధ వచ్చేసిందా?"

"ఇంట్లోనే ఉంది!!" అంది శారద.

"ఇంట్లోనే ఉందా... పిలువ్?" అన్నాడు.

రాధ వచ్చి పక్కగా నిలబడింది "పిలిచారుట!"

ఆమె వయిపు చూసి ఓ నిశ్చయానికి వచ్చినట్లుగా అడిగాడు:

"యూనివర్శిటీకి వెళ్ళావా?"

"లేదు" అంది రాధ వెంటనే.

వెళ్ళే ఉంటుందనుకున్నాడు సీతారాం. నిరసన ప్రదర్శనలో పాల్గొనే వుంటుందని అతని నమ్మకం. అయితే అది అతనికి యిష్టంగా లేదు. అయిష్టంగా ఉందనీ, అలాంటివాటిలో పాల్గొనవద్దనీ గట్టిగా హెచ్చరించాలని కూడా లేదు. ప్రదర్శన విషయాలు ఆమె ద్వారా తెలుసుకోకూడదన్న ఆలోచనవల్లనే యిందాకా ఆమెను అడగలేదు. అడిగితే దానికి అనుమతినిచ్చినట్లవుతుందని లోలోపల భయం. దానిని ప్రస్తావించకపోవటమే మార్గంగా కనిపించింది. కానీ తొమ్మిదయినా వస్తానన్న వేణు రాకపోయేసరికి మనసు పరిపరివిధాలపోయింది. కొన్నాళ్ళుగా ఉద్యమంలో పనిచేస్తూండటం వలన దానిపట్ల ఏర్పడిన కుతూహలంతో ప్రదర్శన పూర్తయ్యాక వేణూని వచ్చి జరిగినది చెప్పమన్నాడు. ఆనాడు వేణూని పోలీసులు మూసెయ్యడం గుర్తువచ్చాక వేణూ గురించి ఆదుర్దా పెరిగింది.

అతను అయోమయంగా అన్నాడు 'ఎందుకనీ?"

రాధ కొంచెం ఆగి మెల్లగా అంది "ఊరికినే!"

ఆ గొంతూ మొహమూ జవాబూ ఏదో వ్యక్తిగత కారణంవల్లనే ఆమె వెళ్ళివుండదని అర్థమయ్యేటట్టు చేశాయి.

అదేమిటో రెట్టించి అడగాలనిపించలేదు

"వేణూ వస్తానన్నాడు. ఇంకా రాలేదు"

"ఏమో మరి! ఎక్కడికి వెళ్ళాడో!" అంది.

"సర్లే... వెళ్ళు" అన్నాడు.

అరగంటదాకా ఆలోచనలతో గడిపి రాజుకి ఫోన్ చేశాడు. సాధారణంగా ఆ సమయంలో దొరకడు. దొరికినా మామూలు స్థితిలో వుండ





డు.

"-ఏమిటీ?" కంగారుగా అడిగాడు.

"మరేం లేదు. వాసూ గురించి ఏం చేశావని శారద నిలదీసిందిందాక?"

"నువ్వు నన్నూ నేను పోలీసులనూ అడగటమూ- జవాబూ మామూలేగదా సీతా! ఏం చేద్దామంటావూ?"

"పాపం వేణూ కూడా గట్టి ప్రయత్నమే చేశాడు" కావాలనే అన్నా కాజువల్‌గా ప్రస్తావించినట్టు అన్నాడు.

"వేణూనా? ఓ... అవునవును ఆ తలబిరుసు కుర్రాడు" అంటూ బిగ్గరగా నవ్వి- "నీకు మంచి కాలక్షేపమే అవుతున్నట్టుందే?"

సీతారాం జవాబివ్వలేదు.

"సీతా... ఎన్నాళ్ళబట్టి చెబుతున్నాను నీకూ హాయిగా వలంటీర్ రిటైర్‌మెంటు తీసుకో నా బిజినెస్ నేనొక్కడినీ చూసుకోలేకపోతున్నానూ- అని! బిజీగా ఉండటం కోసం అలాంటివాటిలోకి దిగాలా రోజురోజుకీ నీకు మతిపోతోందిగానీ"

ఆ మాటలు అలా వస్తూనే ఉన్నాయి. సీతారాం ఫోనుని చెవినుంచి తప్పించాడు. అవతల్నించి శబ్దం ఆగగానే అన్నాడు

"ఈవేళ నగరంలో విశేషాలేమిటీ?"

"అదేంటి? అర్ధరాత్రిపూట కొత్తరకం ప్రశ్నలు వేస్తున్నావు?"

"ఏం లేదు-"

"ఏదో ఉందన్నమాట. చెబుదూ"

"వేణూ వస్తానన్నాడీ సాయంత్రం! యూనివర్శిటీలో వాళ్ళ డిమాన్‌స్ట్రేషన్ ఏదో ఉంది"

"మీవాడు తిన్నగా ఉంటాడా? రక్షకవర్గాలు భక్షించేసుంటాయి"

సీతారాంకి చాలా బాధనిపించింది. గొంతు పొడారిపోయినట్లయింది.

"పోలీసులు కాల్పులు జరిపారంటావా?"

"నీ యింట్రస్టు చూస్తూంటే మా మూర్తికి ఫోనుచేసి కనుక్కోవాలనే వుంది. అయితే నా యింట్రస్టు చూసి మా మూర్తి కరదండాలు తీసుకొస్తాడేమోనని భయంగా వుంది బావా!"

"నీలాంటివాళ్ళను వాళ్ళేం చెయ్యగలరూ?"

"ఆ కుర్రాడి సాంగత్యం వంటబట్టినట్టే వుంది. ఒక్క సీక్రెట్ చెప్పనా? పోలీసులు స్వపక్ష విపక్షరహితులు. కర్తవ్యపరాయణులు. సినిమాలు చూడటంలేదా?"

"వాళ్ళూ మానవులే రాజూ!"

"వేణూలాంటాళ్ళు పోలీసుల్లోనయినా మానవత్వం చూస్తారుట. మాలాంటి వాళ్ళలో చూడరుట!!"

"సరే... ఉంటాను—" అని ఫోన్ పెట్టేసాడు.

సీతారాంకి చికాకు ఎక్కువయింది. సాయంత్రం రేడియోలో ప్రాంతీయవార్తలు వినుండాల్సింది. ఏమో! అందులో పోలీసు కాల్పుల గురించి సమాచారం ఉంటుందనేమిటీ?! ఉదయం పేపరులో చూడాలి. వాటిల్లో మాత్రం పూర్తినిజాలు దొరుకుతాయా?

పదకొండు దాటాక బట్టలు వేసుకుని బయల్దేరాడు సీతారాం.

ఆటో దిగి మెట్లమీదుగా కిందకు వెళ్ళాడు. కుక్కల అరుపులు వెన్నులోంచి వణుకు పుట్టిస్తున్నాయి. చాలీచాలని కాంతి. అస్తవ్యస్తంగా ఉన్న వీధులు. ఎవరో తాగుబోతు పేలాపన. ఎక్కడినుంచో ఎవరిదో శోకం! పసిపిల్ల ఏడుపు! వెనక్కి తిరిగి వెళ్ళిపోదామన్నా భయంగానే వుంది.

వేణూ గదిలోంచి దీపపు కాంతి కన్పిస్తోంది. తలుపు తట్టాడు. తలుపు తీసిన వేణూకి ఆశ్చర్యంతో మాటరాలేదు.

"వస్తానన్నావు- రాలేదేం?" అన్నాడు సీతారాం నవ్వుతూ.

"రండి రండి—" అంటూ కూర్చోబెట్టాడు.

"ఇంత అర్ధరాత్రివేళ వచ్చారేంటీ? కుక్కలు అల్లరిపెడతాయే?"

సీతారాం మంచినీళ్ళు తాగాడు. గదిలో నేలమీద తేవేంద్రన్ పడుకుని వున్నాడు. వేణూ రాస్తున్న కాగితాలు మంచంమీద పడున్నాయి.

"చాలా కంగారుపడ్డాను వేణూ! నువ్వు వస్తానని రాకపోయేసరికి—"

"వద్దామనే అనుకున్నానంకుల్! ఓపని తగిలింది. అయినా మీరంతలా ఎదురు చూస్తార





నుకోలేదు. మన్నించండంకుల్!"

"మన్నించడానికేముందిలే! నువ్వు క్షేమంగా ఉన్నావు—అదే చాలు"

"నా క్షేమానికేం అంకుల్! యింతలో ఏమయిపోతానూ?"

"ప్రదర్శనలో ఏదయినా గొడవయిందేమోనని—"

"ఏంలేదంకుల్..."అంటూ జరిగినదంతా చెప్పాడు.

సీతారాం బయలుదేరాడు.

వేణూ అతనితోబాటే నడిచాడు. ఓ యింటి ముందు ఆగి లోపలికి చూసి తలుపు తట్టాడు. తలుపు తీసి బయటకు వచ్చిన మనిషితో "—ఆటో కావాలి రహమాన్!"అన్నాడు. అతను బట్టలు వేసుకుని వస్తానన్నాడు. రోడ్డు మీద ఉంటామన్నాడు వేణు.

"—ఈ రాత్రివేళ ఆటోలు దొరకటమూ కష్టమే—అంకుల్!" అన్నాడు వేణు.

సీతారాం- అవునవును- అన్నాడు. రోడ్డు మీద నిలబడిన ఆ వ్యక్తిని చూస్తుంటే వేణూకి అదోలా అనిపించింది.

"వాసూ క్షేమంగానే ఉన్నాడు అంకుల్!"అన్నాడు అప్రయత్నంగా.

సీతారాం ఉలిక్కిపడ్డట్టు చూసాడు.

"ఎక్కడున్నాడూ—?" అన్నాడు ఆత్రుతగా.

"సుదర్శనమని ఓ మిత్రుడు మద్రాసు వెళ్ళినప్పుడు స్టేషన్లో చూసానన్నాడు. చాలా సేపు వెతికాడుటగానీ మనుషుల్లో కలిసిపోయాడట—"

"నిజమా? పారబడ్డాడంటావా?" సంభ్రమంగా అడిగాడు.

వేణు నెమ్మదిగా అన్నాడు.

"పారబడి వుండడంకుల్!"

సీతారాంకి అతను నిజం చెపుతున్నట్లనిపించలేదు. తనకి ఓ ఆశ కల్పించటానికి ఏదో కల్పించి చెపుతున్నట్లనిపించింది. దాంతో అతనికి వేణూ మీద మరింత ప్రేమగా అనిపించింది.

వేణూ భుజంమీద చెయ్యివేశాడు.

సులేమాన్ ఆటో వచ్చి పక్కన నిలిచింది.

సీతారాంని తీసుకుని బయలుదేరింది.

వేణూ క్షేమంగా ఉండటం, అతను వాసూ ప్రసక్తి తేవటం సీతారాంని ఓ రకమయిన తృప్తితో నింపాయి.

చీకటినీ, కార్పొరేషన్ దీపాల వెలుతురునీ, చెట్ల నీడలనీ చలినీ మంచునీ దాటుకుంటూ పోతోంది ఆటో!

★ ★ ★

"యస్సార్!"

"...."

"కేర్‌ఫుల్‌గా ఉంటాం సార్.."

"..."

"శక్తివంచనలేకుండా ప్రయత్నిస్తాం సార్.."

మూర్తి ఫోన్ దించేసాడు. తన క్రింది వాళ్ళను పిలిపించాడు.

"విద్యార్థుల మార్చ్ టూ యూనివర్సిటీ ప్రోగ్రాం రేపే! తెలుసుగదా!"

అంతకు ముందే చర్చించిన ఆ విషయం గురించి మళ్ళీ ఏమిటని అయోమయంగా చూసారు వాళ్ళు.

"మనం దీని రంగు మార్చాలి—"

"సార్!"అన్నాడు సర్కిల్ సంశయంగా.

"గవర్నమెంటుకీ, వీసీకీ పడదు. ఈ డిమాన్‌స్ట్రేషన్‌ని పట్టించుకోవద్దని నిన్నటివరకూ ఆదేశాలు. జరగకుండా చెయ్యమని యిప్పుడు ఆదేశాలు—"

"ఇతర జిల్లాల నుంచి కూడా వస్తున్నారుట సార్!" అన్నాడొకరు.

"స్టేషన్‌లోనూ మెయిన్‌రోడ్లమీదా మనం కొందరిని ఉంచడమే! బస్సుల్లో స్టూడెంట్‌లా కనిపించినవాడినల్లా నాలుగు తన్ని వెనక్కి పంపటమే!" అన్నారింకొకరు.

మూర్తి బలహీనంగా నవ్వాడు.

"మన ప్రభుత్వం అపోజిషన్ పార్టీ కింద ఉంది. మన టాస్క్ మరింత కష్టం! విద్యార్థులు గుమిగూడటాన్ని మనం అలా చేయాలి. వాళ్ళు ఆ తర్వాత తిన్నగా ఉండరు. అప్పుడే

మనం రంగంలోకి దిగాలి—"

ఆదేశాలను జారీచేశాడు. సాల్యూట్ చేసి బయటకు నడిచారు.

అస్థిమితంగా ఉందతనికి.

సెంటర్లోనూ, స్టేట్‌లోనూ ఒకే గవర్నమెంటుంటే యింత న్యూసెన్సు వుండదు—అనుకున్నాడు నూరోసారి!

అది అతని చేతిలోలేదు!

ఆ రియలైజేషన్ అతనిని ధ్వంసం చేసింది.

మూర్తి అరున్నర అడుగుల మనిషి. శారీరకంగా ఎంతటి బలవంతుడో మేధోపరంగానూ అంతే. కలిగిన కుటుంబంలో పుట్టాడు. ముగ్గురు అన్నదమ్ములలో ఆఖరువాడు. చదువులో జీనియస్. అతను చిన్నతనం నుంచీ గంభీరంగా ఉండేవాడు. సున్నితంగా స్పందించేవాడు. ప్రపంచానికి మూలమేమిటి? మానవుడి పుట్టుకకు ప్రయోజనమేమిటి?—అన్న ప్రశ్నలతో గ్రంథాలను చదివాడు. చదివిన దానిని గురించి ఆలోచనలు చేసేవాడు. కోరిక సమస్త దుఃఖాలకూ కారణమన్న బుద్ధుని, బోధనను అతను మనస్ఫూర్తిగా నమ్మాడు. మానవుడు కోరికలను వదులుకోలేక అవస్థలుపడుతూ వ్యవస్థలను సక్రమంగా నడవకుండా చేస్తాడని అతను ఆలోచించాడు. క్రమశిక్షణద్వారా వారి కోరికలను నియంత్రణ చేయవచ్చని అతను ఊహించాడు. అందుకు పోలీసు విభాగం చక్కని అవకాశం యిస్తుందని అతను విశ్వసించాడు. అప్పటికి అతను పోస్ట్‌గ్రాడ్యుయేట్ అయ్యాడు. అయ్‌పీయస్‌కు వెళ్తానన్నాడు యింట్లో.

అన్నలిద్దరూ నేవీలో పెద్ద పదవులలో ఉన్నారు. నువ్వూ మాలాగే ఇందులో చేరితే బాగా పైనవుతావు - అన్నారు. మూర్తి వినలేదు. ట్రైనింగ్ పూర్తిచేసాడు ఆ తర్వాత...

అతను ఎంచుకొన్న వ్యవస్థలో అతని ఊహకు అందని కొన్ని అనుభవాలు ఎదురయాయి. వాటిని అతను తన శక్తినంతటినీ వినియోగించి విశ్లేషించటానికి పూనుకున్నాడు. అతనికి తన అంచనాలు తారమారవటానికి కారణం తన సామర్థ్య లోపమో, తను ఎంచుకున్న వ్యవస్థ లోపమో తేల్చుకోవలసి వచ్చింది. చివరికి అతను పోలీసు వ్యవస్థ (మాత్రమే) తాను ప్రేమించే యీ దేశాన్ని తాను గర్వించే మానవజాతి భవితవ్యాన్ని తానూహించే మంచి స్థితికి చేర్చజాలదన్న ఊహను ఆశ్రయించాడు. కనక ఈ వ్యవస్థ ద్వారా తాను చెయ్యగలిగినదయినా చేయాలనుకున్నాడు.

ఆ దశలో అతను తోటివాళ్లను గమనించటానికి ప్రయత్నించాడు. ఈ వ్యవస్థలో రకరకాల వయసులవాళ్లున్నారు. రకరకాల సంస్కారాల వాళ్లున్నారు. రకరకాల చదువుల స్థాయిలువాళ్లున్నారు. పైవాళ్లు కిందవాళ్లకి ఆదేశాలు ఇస్తున్నట్లు కనబడుతున్నా. కిందనున్న కేడర్ తాలూకు అవిద్య ప్రభావం మొత్తం కిందనుంచి పైకి ప్రసరిస్తున్నట్లు అతనికి అనిపించసాగింది. చాలీచాలని జీతాలూ - ఎదిగీఎదగని హృదయాలు - జీవికకోసమే ఈ వృత్తిని స్వీకరించే అవసరాలు - పై వాళ్లను మెప్పించటానికి మాత్రమే ఉపయోగించాల్సిన బుద్ధీ - కిందవాళ్లను నొక్కి ఉంచటంద్వారా మాత్రమే జీవించే మనసూ - అతనికి కిందనుంచి పైకి కనిపించసాగాయి. ఈ మొత్తం స్వరూపంపట్ల అతను చేసిన ఊహలు కనీసం ఈ వ్యవస్థలో తను తనుగా నిలబడాలన్న నిర్ణయానికి చేర్చాయి. అంటే చేయగూడని దానిని చేయకుండా వుంటే సరిపోతుందనుకున్నాడు.

ప్రపంచంనుంచి తాను ఎంచుకున్న వ్యవస్థలోకి - అందులోంచి తనలోకీ అతను ఆలోచనలు సాగాయి. తాననుకున్నదానికీ, తాను చేయవలసినదానికీ అంతరం అతనికి అనుభవం కాసాగింది.

ఉద్యోగంలో చేరిన రెండేళ్ల తరువాత అతను ఓ ఎయిర్‌హోస్టెస్‌ని వివాహమాడాడు. ఉద్యోగ జీవితంవల్ల మానసిక జీవితంలో వస్తున్న మార్పులు అతని వైవాహిక జీవితాన్ని దెబ్బతీశాయి. ఆమె జీవితాన్ని దర్శించి ప్రేమించి అనుభవించే విధానమూ అతని విధానమూ వేరయ్యాయి. ఆవిడ ఆనందం అతనికి కృత్రిమంగానూ, ఇరిటేటింగ్‌గానూ కనిపించసాగింది. అతని అంతర్ముఖత్వమూ, గంభీరత్వమూ ఆమెకు దుర్భరమయ్యాయి. చివరికి వాళ్లు విడిపోయారు. మూర్తి వివాహం




గూర్చి మళ్లీ ఆలోచించలేదు. స్త్రీ సుఖం వయివు తొంగి చూడలేదు. అన్నలూ వదినలూ చూపే ప్రేమనూ, ఇచ్చే సలహాలను జాలిగా భావించాడు. భరించలేకవారితో సంబంధాలు తెంచేసుకున్నాడు.

తాను ఏదో చేయగలనన్న విశ్వాసం! దానిని సాధించాలన్న ఆకాంక్ష. ఈ దశలన్నింటిలో వేషాలుమాత్రం మార్చుకున్నాయి. చివరికి అతనిలో అవి దిగంబరంగా నిలిచాయి. ఏదో చెయ్యగలను. ఏదో చేయాలి - అవే అతనికి జీవమూ, ఆధారమూగా మిగిలాయి. మానవు లందరిలోనూ తన సామర్థ్యంవల్ల దాదాపుగా ఓ విశ్వాసం వుంటుంది. విజయవంతమైన వ్యవ స్థలు ఆ విశ్వాసాన్ని ఆ జీవస్వభావాన్ని - సమర్థవంతంగా వినియోగించుకోగలుగు తాయి. దానికోసం ఆయా వ్యవస్థలు చేసే చమత్కారమల్లా వారి ఆకాంక్షలను కొన్ని నమూనాలలోకి పోతపోయటమే! ఆధునిక వ్య వస్థ తయారుచేసుకున్న నమూనాలన్నింటిలోకీ విజయవంతమైనది వృత్తిలో మెట్లను ఏర్ప ర్చటం! ప్రమోషన్స్! రివార్డ్స్! మెడల్స్! కమెండేషన్స్! ఇన్సెంటివ్స్! మూర్తి ఆకాంక్ష వాటిల్లోకి ప్రవేశించినా ఏకోన్ముఖత లేకపోవటంవల్లన అందులో విజయం దొరకలే దు. తాను వంగలేకపోవటం వలనే - వృత్తిలో కూడా అనుకున్నమేరకి - ఎగబాకలేకపోయాన నుకుంటాడు. ఉద్యోగంలో చేరకముందు అత ను దొంగతనం కన్నా దొంగ సిద్ధాంతాలు ప్రమాదకరమైనవనుకున్నాడు. దొంగ సిద్ధాంతాలకు విరుగుడు మంచి సిద్ధాంతాల ను స్థిరనిశ్చయంతో అమలుచేయటమే అను కున్నాడు. ఆ మీదట మంచివయినా చెడ్డవ యినా సిద్ధాంతాలుండటమే ప్రమాదకరమను కున్నాడు. ఓ దొంగను టాకిల్ చేయగలిగినట్లు ఓ సిద్ధాంతాన్ని నమ్మేవాడిని టాకిల్ చేయలే నని అనుకోసాగాడు. ఫలితంగా సిద్ధాంతాలలో బేధాలను విడిచిపెట్టి అసలు భావాలుండ టమే ప్రమాదకరం అనుకొనేస్థితికి చేరుకున్నా డు.

అతని నిస్సహాయభావన పిచ్చెత్తి స్తూంటుంది. ఆరోజు అతనలాంటి స్థితిలో ఉండగా రాజునుంచి ఫోన్ వచ్చింది.

"సాయంత్రం నీ ఎంగేజ్‌మెంట్స్ ఏమిటి?"

"ఏంటి హడావుడి?"

"ఎ.యస్.భూషణం. విన్నావా పేరు?"

"ఆదర్శ విద్యామందిరం"

"నీ జ్ఞాపకశక్తికి జోహార్లు! నువ్వు జీని యస్‌వి. ఆ మానవుడు వివేకనగరంలో తన కాలేజీకి ఓ బ్రాంచి తెరవబోతున్నాడు. దానికి ప్రారంభోత్సవం నువ్వుచేయాలని ఆశపడుతు న్నాడు-"

పెద్దగా నవ్వాడు మూర్తి.

"నా చెవులు క్లియరయిపోయాయిగానీ - అసలు విషయం కలిసినపుడు చెబుతాను గదా!"

మాట్లాడుతూనే డైరీ తిరగేస్తున్నాడు మూర్తి.

"ఎన్ని గంటలకి-"

"ఎనిమిదికి. నేవచ్చి తీసుకువెళ్తాను-"

"ఈ రోజు తప్పదా?"

"బాబ్బాబు... ఎలాగయినా వీలుచేసుకో వాలి-"

"ఏంటా ఇంపార్టెన్స్ యీరోజుకి-"

"నీ పోలీసుబుద్ధి పోనిచ్చుకున్నావుగాదు- తప్పకుండా రావాలి-"

ఫోన్ దించేసాడు మూర్తి. అతనికి రాజంటే అసహ్యం. ప్రతిమనిషీ ఏదో అవస రంకోసమే చుట్టూ తిరుగుతాడు. తప్పదు! వాళ్లలోంచే తను ఎంచుకోవాలి. సంభాషణను ఇంటలెక్చువలైజ్ చేయగలడు. అప్పటికీ చాలామార్లు రాజుని తిరస్కరిస్తూనే ఉంటాడు.

"గురువువంటికి ఆడ గాలీ బ్రాందీ వాసనా పట్టవు-" అని రాజు ముందే హెచ్చరించాడు.

భూషణం తరవున ఏర్పాట్లుచూస్తున్న మనిషి ఇరుకునపడిపోయాడు. ఆ రెండూ ఉంటే పని సులువు. రాజే మార్గాంతం చెప్పా డు.

"మంచి ఫుడ్...ఎన్ని రకాల డిషెస్ వీల యితే అన్నీ చూడు! సెలక్టెడ్ కంపెనీ ఉండాలి-"

భూషణానికి నగరంలో నాలుగు కళాశాలలు

న్నాయి. విద్యార్థులూ తల్లిదండ్రులూ ఆ కళాశాలల్లో సీటు దొరికితే భవిష్యత్తు గ్యారంటీ అయిపోయినట్లు భావిస్తారు. వాటికి మంచి అకెడమిక్ రికార్డు ఉంది. బిజినెస్‌కోసం అడ్వర్టయిజ్‌మెంట్సు చేసే స్థితినుంచి ట్యాక్స్ ఎగ్జెంప్షన్స్‌కోసం అడ్వర్టయిజ్‌మెంట్స్ ఇచ్చే స్థితికి ఎదిగాడని కొందరు అంటూంటారు.

మూర్తి రాజుతో సరిగ్గా ఎనిమిది గంటలకు వచ్చాడు.

భూషణంతోపాటు పరిచయం చేసినవాళ్లలో నలుగురూ ప్రైవేట్ కళాశాలల వాళ్లేనని గ్రహించాడు మూర్తి. భూషణం కాలేజీకి ఆడపిల్లల హాస్టలు, మగపిల్లల హాస్టల్సూ ఉన్నాయి. వాటిలో ఎలాంటి గొడవలూ యీమధ్య జరిగినట్టులేవే అనుకున్నాడు మూర్తి. భూషణానికి విద్యార్థులకోసం బస్సులూ ఉన్నాయి.

పరిచయాలు, ముగిశాయి.

చట్టనిర్వహణతోబాటు పోలీసులకు న్యాయనిర్ణయాధికారం వుండాల్సిన అవసరంమీదకు చర్చమరలింది. మూర్తి అది పెట్సన బ్లక్ట్. ఆ అవసరాన్ని ఒకప్పుడు అతను గట్టిగా నమ్మేవాడు.

డిన్నర్ మొదలయింది.

ఒకతను ఎమోషనల్‌గా వాదించాడు. న్యాయనిర్ణయాధికారం పోలీసుల చేతుల్లో ఉండరాదన్నాడు. ఉండాలని అంతే ఉద్రేకంగా మరొకతను వాదించాడు.

భూషణం ఎటూ మాట్లాడలేదు.

రాజు తన సహజధోరణిలో వాళ్లమీదకు విసిరేటపుడు హెచ్చుమోతాదులో వల్గారిటీని జోడిస్తున్నాడు.

మూర్తి కూడా తన పాయింట్‌ను బలంగా చెప్పాక మొదటి అతను తగ్గిపోయాడు. - "మీరన్నదాన్లో నాకో కొత్త పాయింట్ కనబడుతోంది సార్! మీ కోణంనుంచి నేనెపుడూ వ్యూ చేయలేదు. అయ్ విల్ గివ్ ఎ థాట్‌టుయిట్!" అన్నాడు.

భూషణం తన వినతిని అందజేసాడు.

మూర్తి కళాశాల ప్రారంభోత్సవం చేయటాన్కి ఒప్పుకున్నాడు.

భూషణం రిలీవ్‌డ్‌గా మొహంపెట్టి అన్నాడు.

"మా కాలేజీలు క్రమశిక్షణకు మారుపేర్లు. చూసారా ఇన్నాళ్ళుగా మా విద్యార్థులు ఎప్పుడూ ఆందోళనల్లోకి దిగలేదు. మీవంటి వాళ్లు నాలుగు మంచిమాటలు చెపితే వింటారు మా కుర్రాళ్లు. ఏంలాభం? ఇప్పుడు -" అంటూ ఆగాడు.

మూర్తి సన్నగా నవ్వాడు.

"రేపు మార్చ్‌టూ యూనివర్శిటీలో గనక దిగితే ముందే హెచ్చరించండి - మక్కెలు విరిగిపోతాయని-"

"చెప్పాను సార్! గట్టిగా చెప్పుదామంటే నోరురావటంలేదు. వాళ్ల వాదనలో పాయింట్ వుంది. మా కాలేజీలలో పాస్‌పర్సంటేజ్ పడిపోయింది"

"మీ రిపుటేషన్ దెబ్బతింది-" అన్నాడు మూర్తి.

భూషణం కొంచెం తడబడ్డాడు.

"అదీ పాయింటే! ఒకప్పుడు ఆ రిపుటేషన్ మీదే మా బతుకు ఆధారపడుండేది! అయితే మేం ఇందులో పాతుకుపోయినవాళ్లం! స్టూడెంట్స్ సంఖ్య రోజురోజుకీ పెరుగుతున్నప్పుడు పాస్‌పర్సంటేజ్‌కి పెద్ద ప్రభావం ఉండదు. నలుగూరూ చూసేదిపుడు డిసిప్లిన్. పోతే - ఏడాదంతా కష్టపడి చదివిన స్టూడెంట్స్ శ్రమకు ఫలితం దొరక్కపోతే - వాళ్లేం చేయగలరు? అదే మా వర్రీ - వాళ్ల వర్రీనూ!"

మూర్తి పెద్దగా నవ్వాడు.

రాజు అన్నాడు - "మన వెంకట్రామయ్యగారూ స్టూడెంట్స్ వర్రీలో పాయింట్ ఉందన్నారు-"

మూర్తి లేచాడు టైం చూసుకుంటూ.

"అపొజిషన్‌లో కూర్చున్నాక అన్ని ఆందోళనల్లోనూ పాయింట్స్ కనిపిస్తాయి" అన్నాడు నడుస్తూ.

"పొజిషనో అపొజిషనో - వాళ్లలా మారుతుంటారు. మనమే శాశ్వతంగా వుండేది-" రాజు అతన్ని అనుసరించాడు.

కారు ఎక్కాడు మూర్తి. కారుదాకా వచ్చి అందరూ సెలవు తీసుకున్నారు.




రాజు డ్రైవ్ చేస్తున్నాడు.

"పోలీసోడివయినా నీకు పోలీసు దెబ్బచాత కాదు. నొప్పి పెట్టాలిగాని దెబ్బకనబడకూడదు. రిపుటేషన్ దెబ్బతినేసిందనేగదా వాళ్ల ఏడుపూ - అది మళ్లీ అనడమెందుకూ-"

మూర్తి వెంటనే మాట్లాడలేదు. ఆలో చనగా అన్నాడు.

"-రాజూ! గవర్నర్ వీసీని, ప్రభుత్వాభీష్టాని కి వ్యతిరేకంగా నియమించారని గదా గోల యింది! అప్పుడు వెంకట్రామయ్యగారు గవ ర్నరు చర్యనీ వీసీనీ సమర్థించారుగదా-!"

వెంకట్రామయ్యా ఆ రాష్ట్రానికి మాజీముఖ్య మంత్రి. కేంద్రంలో అధికారంలో ఉన్న తాము మళ్లీ రాష్ట్రంలో అధికారాన్ని చేపట్టాలంటే వెంకట్రామయ్యకన్న సమర్థుడు లేడన్న అభి ప్రాయంలో అధిష్టానవర్గం ఉన్నట్లు పేపర్లు చెపుతున్నాయి.

"అదే- అదే నేనన్నదీనూ! నాకు నా వ్యాపా రమూ, నీకు నీ ఉద్యోగమూ సజావుగా సాగా లంటే మనమే కొంచెం వెనకాముందూ చూసు కోవాలి! నిజమే! నీతో నేను సరిపోను! నీ అయిడియల్స్ ముందు నేనెంత! కాని ఎన్నా ళ్లు ఇలాగ? నువ్వూ పీస్‌ఫుల్‌గా.."

మూర్తి అస్థిమితంగా ఫీలయాడు.

"అయితే ఏంటంటావ్?"

"రేపు విద్యార్థి ఉద్యమం సక్సెస్ అవాలి-"

"అలాగే - రేపొద్దుటే నువ్వు వచ్చెయ్. వచ్చి స్టూడెంట్స్ ముందు నిలబడు! వాళ్లు విసిరే రాళ్లూ రప్పలకీ నమస్కారబాణాలు అడ్డంగా వెయ్! అసలు పోలీసులకి సత్యాగ్రహంలో ట్రైనింగిచ్చేస్తే బెటరు-"

రాజు నవ్వాడు.

"ఏంచెయ్యాలో ఎలా చెయ్యాలో నీకు తెలీ కనా నాచేత వాగించటం-?"

మూర్తి కొంతసేపు మాట్లాడలేదు.

"లాభంలేదు రాజూ! రేపటి ప్రదర్శన ఫె యిలవుతుంది. ఖచ్చితమైన ఆదేశాలు న్నాయి-"

"నీఇష్టం! నీకు వెంకట్రామయ్యా సంగతి తెలుసు"

మూర్తి మాట్లాడలేదు.

"ఫెయిలవటానికీ, సక్సెవటానికీ పెద్ద తేడా లేదు బాసూ. రేపటి మీ చర్యలను బట్టే విద్యార్థులలో ఉద్యమంపట్ల దీక్ష ఉంటుంది. పిక్చర్ మీదా, హెడ్‌మీదా ఉంటుందంతా - గవర్నమెంటు ప్రచారసాధనాలకూ, ప్రైవేటు పత్రికలకూ పిక్చరు వేరుగానే ఉంటుందెప్పుడూ-"

మూర్తి నిట్టూర్చాడు. తనేం చేసినా ఏదో దెయ్యాన్ని పూజించినట్లే?!

కారు మూర్తి బంగ్లా ముందు ఆగింది. అతన్ని దించేసి రాజు బయల్దేరాడు.




"నేను అనుమతించను-" చాలా దృఢంగా వుంది వైస్‌ఛాన్సలర్ గొంతు.

ఫోన్‌ని పక్కనపెట్టి "బాస్టర్డ్!" అని గొణు క్కున్నాడు మూర్తి.

"-సర్... విద్యార్థుల ధోరణి చూస్తుంటే వాళ్లు హింసకు దిగేటట్టు కనబడుతున్నారు-"

"లెట్‌దెమ్!"

"నగరవీధులలో వాళ్ల ఊరేగింపు మొద లైంది. ఇప్పటివరకూ ఎలాంటి అవాంఛనీయ సంఘటనా జరగలేదు. అందువల్ల మేం వాళ్లని యూనివర్శిటీ కాంపస్‌లోకి వదలక తప్పదు. ఓమారు లోపలికి ప్రవేశించాక మీ కార్యాలయం ముందూ, మీ ముందూ శాంతంగా ఉంటారన్న నమ్మకంలేదు. ముందే మీరు అనుమతించితే మేం పొజీషన్స్ తీసు కొని తగిన బందోబస్తు చేస్తాం! ఏదయినా జరిగాక మీరు మమ్మల్ని రమ్మన్నా జరిగినదాని కి, జరగబోయేదానికి మీరే బాధ్యులవుతారు. మరో మారు ఆలోచించండి!!"

"నేనేమీ ఆలోచించటంలేదు. ఇప్పుడు మీకు నేను అనుమతినివ్వను"-

మూర్తి ఫోన్ దించేశాడు.

మీదనున్న నాలుగురకాల ఒత్తిళ్లనూ విదిలించుకుని టోపీ పెట్టుకున్నాడు. వాకీటాకీలలో ఆదేశాలు జారీఅయాయి. "విద్యార్థులు రెచ్చగొట్టినా రెచ్చిపోవద్దు-"

టౌన్‌హాల్ ఆవరణనుంచి విద్యార్థుల ఊరేగింపు మొదలయి ముఖ్యవీధులగుండా సాగింది. వేణూ, రవీ ఎంపికచేసిన కార్యకర్తలు పదేసి గజాలకు ఇద్దరు చొప్పున ఉండి ఎలాంటి గొడవలు జరగకుండా చూసుకుంటున్నారు. విద్యార్థులు తమ కాలేజీ బానర్లతో ఒకరివెనక ఒకరు సాగుతున్నారు. ఉత్సాహవంతులు చిన్నిచిన్ని నృత్యాలతో జానపదగీతాల వరసలతో కట్టిన పాటలతో ప్రదర్శనలు ఇస్తున్నారు. నినాదాలు ఇస్తూ గొంతునొప్పి పుట్టినవాళ్లు తగ్గగా రెండోవాళ్లు అందుకుంటున్నారు. వాళ్ల పక్కగా నడుస్తున్న పోలీసుల్లో కొందరు గంభీరంగా నడుస్తున్నారు. కొందరు విద్యార్థులతోబాటు చిన్నగా నవ్వుతూ లాఠీలు ఊపుకుంటూ జోకులు వేస్తున్నారు. సర్వీసులోకి రాకముందు అలాంటి ఊరేగింపులలో తమ అనుభవాలను గుర్తుచేసుకుంటున్నారు. ట్రాఫిక్‌పోలీసు వాహనాలను ఆపి ఊరేగింపుకు అనుమతిస్తున్నారు.

వీసీ దిష్టిబొమ్మను తగలేయాలని పట్టుపట్టారు మధూ బృందం! వేణూ రవీ ఒప్పుకోలేదు. రమలాంటివాళ్ళు మధుని సమర్థించారు.

"మనం చదువుకుంటున్నాం! డీసెన్సీని మనం మెయిన్‌టైన్ చేయకపోతే మరెవరు చేస్తారు? ఎట్టి పరిస్థితుల్లోనూ నేను దాన్ని అంగీకరించలేను" రవి.

"నీబోడి అంగీకారం ఎవడిక్కావాలి?" మధు స్నేహితుడు అరిచాడు.

"మన ప్రదర్శన వ్యక్తులనుద్దేశించికాదు- అయినా చిన్నవిషయం మీద తగువెందుకూ? చర్చించి నిర్ణయించుకుందాం-" అన్నాడు వేణు.

"ఎన్నింటికని చర్చలు? అందరికీ మాషారు ఉండొద్దూ?" అన్నాడు మధు.

"మధూ హండ్రెడ్ పర్సెంట్ కరెక్ట్! మాస్‌లో ఉన్నప్పుడు మాస్‌ని టికిల్‌చేసేవి ఇలాంటివే! కసిపుట్టించకపోతే దీక్ష పెరగదు!" అంది రమ.

వేణూ రమ వయపు తీక్షణంగా చూసాడు.

"ఆవిడనెప్పుడూ చూస్తూనే ఉన్నావుగాని బాసూ! ఇప్పుడు ఆవిడ పాయింట్‌ని చూడు-" అన్నాడు మధు.

ఆ గొంతులోనూ మాటలోనూ వెకిలితనం ధ్వనించినా రమ పట్టించుకోలేదు.

రవి మాత్రం అంగీకరించలేదు. అతను వినయవిద్యాపీఠం కాలేజీ విద్యార్థి. దానిని ఓ స్వామిగారు నడుపుతున్నారు. ఆయన వేదాల గురించీ, వైదిక జీవనం గూర్చీ, భారతీయుల గత వైభవం గూర్చీ ఎప్పుడూ మాట్లాడడు. మానవుని ప్రవర్తన గురించి, విలువలగురించి మాట్లాడతాడు. నేటి మనిషి, రేపటికి అందివ్వాల్సిన దానికున్న ప్రాధాన్యతను గుర్తించాలంటాడు. ఆ కళాశాలలో రవికి తిరుగులేని పరపతి ఉంది.

చివరికి వేణూ ఆ కార్యక్రమాన్ని ఈ ప్రదర్శన నుంచి వాయిదా వేయించగలిగాడు. రవి ప్రదర్శనలో పాల్గొన్నాడు.

అయితే మధుబృందం కాలేజీల ఊరేగింపు చివర్లో ఉన్నాయి. ఓ గడ్డి బొమ్మకు బట్టలు తొడిగి తీసుకువచ్చారు. యూనివర్సిటీ గేటు ముందుకు చేరింది ఊరేగింపు. కాళ్ళుపీకిన విద్యార్థులలో ఉత్సాహం మళ్ళీ వచ్చింది. నినాదాలు పెరిగాయి. వీసీ గడ్డిబొమ్మను తగలబెట్టారు.

గేటుదాకా వచ్చిన పోలీసులు అందర్నీ సాగనంపుతున్నట్లుగా నిలబడిపోయారు. వీసీ కార్యాలయంముందు నినాదాలు చేసాక వేణూ మధూ రవీ మరో ఆరుగురు బృందంగా వీసీ ఛాంబర్‌వయిపు నడిచారు. ఓ ఉద్యోగివచ్చి వీసీ వాళ్ళను కలుసుకుంటారని, కాన్ఫరెన్స్ హాలులో కూర్చోమని తీసుకువెళ్లి చోట్లు చూపించాడు.

"కొంతసేపయిన తర్వాత వీసీ కార్యాలయం ఉద్యోగులు ముగ్గురు వచ్చారు. తర్వాత వీసీ తన సీటులో కూర్చున్నాడు. తర్వాత అంతా కూర్చున్నారు. యాభైఅయిదే




ళ్ళ వయసు కనిపించని ఆరోగ్యం నిండిన ముఖం. నుదుటిమీద సన్నని పొడుగాటి బొట్టు. పంచె, కోటు, అనవసరంగా పెరగని శరీరం.

అందరి మొహాల్లోకి ఓమారు కలయజూసాడు.

తగలబెట్టిన బొమ్మకు బొట్టుపెట్టామా లేదా అని గుర్తుచేసుకుంటున్నాడు మధు. ఏదో గౌరవం కలిగింది రవికి. తమని కలుసుకోటానికి వీసీ వెంటనే అంగీకరించటం వేణుకి షాకింగ్‌గా ఉంది.

"మీరేం చెప్పాలనుకుంటున్నారూ?" వీసీ గొంతు స్పష్టంగా నెమ్మదిగా అజ్ఞాపిస్తున్నట్లుగా ఉంది.

వేణూ గొంతు సవరించుకున్నాడు. వీసీ చూపులు అతనిమీద నిలిచాయి. లేచి నిలబడి తనను తాను పరిచయం చేసుకుని వరసగా అందరినీ పరిచయం చేసాడు.

"మా సమస్యలను ఈ మెమొరాండంలో తెలియజేసుకున్నాం" వేణు చేతిలోని కాగితాన్ని ప్యూన్ వచ్చి అందుకుని వీసీ ముందుంచాడు. దాన్ని అతను చదువుతుండగా మధు అన్నాడు.

"దాన్ని ఇంతకుముందే కంట్రోలర్‌గారికి..."

వీసీచూసిన చూపుతో మధు ఆగాడు.

"ఈ కాగితాన్ని నేను చదవటంకోసమే ఇచ్చారనుకుంటాను"-

"అవునుసార్!"

వీసీ చదవటం పూర్తిచేసాడు. దానిమీద సంతకంచేసి ఓ ఉద్యోగికి ఇచ్చాడు.

"ఇందులో మీరు రెండు అభియోగాలుతెచ్చారు. ఒకటి ఉత్తీర్ణతాశాతం పడిపోవటం. రెండవది భారీయెత్తున అక్రమాలు జరగటం- ఈ రెండూ సత్యమని నేను అంగీకరించటంలేదు-"

"మాదగ్గర ఆధారాలున్నాయి-" అన్నాడు వేణు.

"ఏమిటవి?"

తాము చేయించిన సర్వే వివరాలను అందజేసాడు వేణు. వాటినొకమారు తిప్పిచూసి అన్నాడు వీసీ-

"ఇవి ఆధారాలు కాదు. మీ ఆరోపణలకు మీరు స్వంతంగా తయారుచేసిన స్టాటిస్టిక్స్ ఇవి. వీటి అథెంటిసిటీని నేను గుర్తించను-"

"బాధ్యతగల కొందరు పెద్దమనుషులు చేసిన సర్వే అది-" వేణు.

"వాళ్ల బాధ్యతనూ, పెద్దమనిషితనాన్నీ నేను కాదనటంలేదు. కొన్ని కాలేజీలలో వాళ్ళు సేకరించిన అభిప్రాయాలివి. రికార్డ్సు అన్నీఉన్న నన్ను ఈ పెద్దమనుషులెవరూ కలవలేదు, సంప్రదించలేదు-"

వేణు మాట్లాడేలోగా మధు అన్నాడు.

"టాబ్యులేషన్ రిజిస్టర్‌లో కావాలని చేయిపెట్టారు-"

"వీసీ నన్నగా తలవంకించుతూ కుర్చీలో వెనక్కిజారబడి నవ్వాడు.

"గుడ్- మంచి పాయింట్ తెచ్చావు-" కొంచెం ఆగి అన్నాడు.

"నేను ఈ కుర్చీలో కూర్చోకముందు ఇలాంటివి జరిగాయని విన్నాను. దానివల్ల ఫెయిలయ్యే విద్యార్థులు పాసవటానికి అవకాశముంది. పాస్ పర్సంటేజీని అది పెంచుతుందిగాని తగ్గించదు-"

మధు తడబడుతూ కూర్చున్నాడు.

"నావాదనకు ఆధారంగా కొన్ని ప్రత్యేకమయిన కేసులు చూపిస్తాను-" అన్నాడు వేణు.

"మొత్తం కెరీర్‌లో డిస్టింక్షన్‌లో ఉండేవాడు ఈ అబ్బాయి. పరీక్షపోవటమేగాదు- ఏ సబ్జెక్టులోని పది మార్కులుదాటలేదు-" అంటూ వాసూ మార్కుల లిస్టులన్నీ ఇచ్చాడు.

వీసీ వాటి నన్నింటినీ చూసి-

"ఈ కుర్రవాడిమీద నేనూ జాలిపడతాను. కానీ నేను సిస్టమ్‌ని మార్చలేను. నేనిక్కడున్నది విద్యార్థిని ఆఖరిపరీక్షలో పరీక్షించటానికేగాని నా ఇష్టంవచ్చినట్లు వ్యవహరించటానికి గాదు-"

"సార్... మీరిందులో ఎలాంటి అసహజమూ చూడలేదా?" అన్నాడు రవి.

"ఏడంతా బాగాచేసి చివరి పరీక్షలో అంతలా పడిపోటం- ఎవరికయినా ఆశ్చర్య



మేమరి! అందుకు నేనేరకంగా బాధ్యుడిని?"

"సార్... మీవంటివారే అలాగంటే ఎలా?" అన్నాడు రవి.

"రీవాల్యూ చేయించుకొనే పద్ధతి అందుకే వుంది-"

"అందరిదగ్గరా డబ్బుండొద్దూ-?" అన్నాడు మధు.

వీసీ అతనివైపు తిరిగి అతని దుస్తులను పరిశీలనగా చూస్తూ-

"నువ్వన్నదాంట్లో సత్యముందబ్బాయ్! అందరిదగ్గరా డబ్బుండదు. సరే... కొందరు పేద విద్యార్థులకు- ఇలాంటి దృష్టాంతాలు చూపించితే- నేను ఋణసహాయం ఏర్పాటుచేస్తాను-"

"రీ వాల్యూయేషన్లో ఆ కుర్రాడికి మంచి మార్కులు వస్తే?" అన్నాడింకొకడు.



"రావొచ్చు... రావాలనే నేనూ కోరతాను-"

"దానికి మీ సమాధానం ఏమిటి?"

"పొరబాట్లు ఎక్కడయినా జరగవచ్చనే ఈ పద్ధతి ఏర్పాటయింది"

"భారీయెత్తున జరిగిన పొరబాట్లు కప్పిపుచ్చుకోటానికి మీరే అప్పటికప్పుడు ప్రతిపాదన చేస్తున్నారని నేను అభిప్రాయపడుతున్నాను" అన్నాడు వేణు.

వీసీ అతన్ని గుచ్చిగుచ్చి చూసాడు.

"ఎలాగయినా అభిప్రాయపడే హక్కు నీకుంది-"

"రిజల్ట్సు ప్రకటించేముందు మీరు ఇచ్చిన గడువు చాలా తక్కువ. తొందర తొందరగా వ్యవహరించారు. చాలా తక్కువమందితో మరీ రహస్యంగా ఇదంతా నడిపారు. పరీక్షాఫలితాల ప్రకటననంతటినీ పర్యవేక్షించటానికి రిజల్ట్సు కమిటీని నియమించలేదు. అకెడమిక్ బాడీని సంప్రదించలేదు. సాధారణంగా జరిగే పద్ధతులన్నీ మీరు ఉల్లంఘించారు. ఇవన్నీ మా సర్వేలో వెల్లడయాయి. మీరు దీనికి బాధ్యత వహించాలి" అన్నాడు వేణు.

"ఈ విశ్వవిద్యాలయానికి వైస్‌ఛాన్సలర్‌గా నేను ఏమి చేయవచ్చో, ఏమి చేయగూడదో నాకు తెలుసు. నియమాలను అతిక్రమించినపుడు నన్ను ప్రశ్నించటానికి పద్ధతులున్నాయి. వేదికలున్నాయి. నేను వారికి బాధ్యుడిని. మీకు జవాబివ్వాల్సిన అవసరం నాకులేదు"

"మీరు కంట్రోలరాఫ్ ఎగ్జామ్స్ పరిధిలోకి ప్రవేశించారు" అన్నాడు మధు.

"నువ్వు ఎవరి తరపున మాట్లాడుతు న్నావ్?"

వీసీ ప్రశ్న అర్థంకాక తబ్బిబ్బయాడు మధు. మరొకరు అందుకున్నారు.

"మా విద్యార్థుల తరపునే"

"అతన్ని మాట్లాడనీ-" వీసీ గొంతు ఖంగు మంది.

దాంతో నలుగురూ ఒక్కసారే మాట్లాడటంతో గందరగోళంగా తయారయింది. వేణు లేచి నలుగురినీ శాంతపరిచాడు.

వీసీ నిశ్శబ్దం ఏర్పడ్డాక అన్నాడు-

"ఈ యూనివర్సిటీ నిర్వహణలో పైవాళ్ళ జోక్యాన్ని నేను సహించేదిలేదు- నా క్రింది ఉద్యోగులకు ఉద్యోగాలు చెయ్యటమూ వచ్చు. వాళ్ల హక్కులను కాపాడుకోటమూ వచ్చు. విద్యార్థులుగా మీరు మాట్లాడేదాన్నే నేను వింటాను"

వేణు ఏదో అందామని ఓమారు అందరి వైపూ చూశాడు. రవి వెంటనే లేచి అన్నాడు- "పేద విద్యార్థులకు రీవాల్యూచేయించుకోటా నికి మీరు అప్పులు నిజంగా ఇప్పిస్తారా సార్?"

"ప్రయత్నిస్తాను"

వేణూ మధుమొహాన్ని చదవటాన్కి యత్నించాడు.

"మీ ప్రతిపాదన మేం తిరస్కరిస్తున్నాం. మేం ఉద్యమాన్ని కొనసాగిస్తాం" అన్నాడు వేణు.

"మీఇష్టం- మీ ఉద్యమం ఏమిటో నాకు అర్థమయింది"

వీసీ ఒక్క సెకను వ్యవధిఇచ్చి లేచి వెళ్ళిపో యాడు. వాళ్లల్లోవాళ్ళు మాట్లాడుకుంటూ అక్క డనుంచి బయల్దేరారు. బయటకు వెళ్ళాక విద్యార్థులకు ఏం చెప్పాలా అన్నది నిర్ణ యించుకోవాలన్నాడు వేణు.

వీసీ ప్రతిపాదన న్యాయంగా ఉందనీ, సాధించిన దానితో ఉద్యమాన్ని నిలుపు జేయ టమే సబబనీ అన్నాడు రవి. మధు అతనిమీ దకు దూకుడుగా లేచాడు. వేణు వారించాడు.





రవికి నచ్చజెప్పవచ్చుగానీ రవిలా ఆలోచించే వాళ్లందరికీ నచ్చజెప్పలేమన్నాడు. రవి తన అభిప్రాయాన్ని చెప్పాడుగానీ మనతో విడిపో టంలేదనీ, మెజారిటీని అంగీకరించే మనిషనీ అన్నాడు. రవి భుజం మీద చేయివేసి శాంతప రిచాడు.

"మన డిమాండ్స్ గురించి అసలు ప్రస్తా వించనేలేదు" అన్నారొకరు.

"మన ఆరోపణలనే తిరస్కరించాక ఇంక డిమాండ్స్ ఏమిటి?"

"చాలా తెలివిగా మనల్ని దోవ తప్పించా డు"

"అందుకేగదా- మనకి గైడెన్స్‌కోసం- సలహా సంఘం ఏర్పాటు చేసుకోవాలని చెప్తున్నాను" అన్నాడు మధు.

అందాకా మాట్లాడని వేణు వెంటనే అన్నా డు.

"ఆ తర్వాత ఆలోచిద్దామది. ముందు విమల ఏదో చెపుదామనుకుంటోంది! విందాం"

"మరేంలేదూ... రవిచెప్పిందే రైటులా ఉంది. వీసీగారు అప్పులివ్వటానికి ఒప్పుకు న్నారంటే- అంతా సంతోషిస్తారు" అంది విమల.

"అంతకన్న అప్పులు నేనూ ఇవ్వగలను" అన్నాడు మధు చిరాగ్గా.

వేణు గొంతుపెంచి అన్నాడు- "అందరూ తమ అభిప్రాయాలు చెప్పారు. ఉద్యమాన్ని కొనసాగించాలని దాదాపు అందరం అను కుంటున్నాం!"

రవి ఏదో అనబోతూంటే ఆగమని సౌంజ్ఞ చేసి కొనసాగించాడు వేణు "మన ఆరోపణల ను వీసీ ఒప్పుకోలేదు. మనం చూపిన ఆధారా లవల్లా, వాస్తవాలవల్లా ఒత్తిడికిలోనయి తన పొరపాట్లు కప్పిపుచ్చటానికి ఓ కంటితుడుపు ప్రతిపాదనచేసారు. దానిని అక్కడికక్కడే తిర స్కరించి ఉద్యమం కొనసాగించటాన్కి విద్యార్థి నాయకులు నిర్ణయించారు- ఇలా ప్రకటనలు చేద్దాం! దీనికి మీ అందరకీ సమ్మతమేగదా!"

మధు బృందం సమర్థించటంతో, వేణు నచ్చజెప్పటంతో రవి గొంతు మూతబడింది. ఆ విధంగా ప్రకటన తయారుచేసి విద్యార్థులకు

వివరించి తదుపరి కార్యక్రమాన్ని త్వరలోనే నిర్ణయించి తెలియజేస్తామన్నారు.

రమ, వేణు ఒకే సిటీ బస్సు ఎక్కారు.

"ఏమీ మాట్లాడటంలేదు నువ్వు"

"ఆ డెలిగేషన్‌లోకి నన్నెందుకు తీసుకోలేదు?" సూటిగా అడిగింది.

"నువ్వు ఆవేశపరురాలివి"

"మధూ కన్నానా?"

"మధూ... మధూ..."

"నాలాగే మధూ కూడా నీవెనకాల కోరస్‌పాడదు. కానీ వాడి వెనక కోరస్‌పాడే వాళ్ళున్నారు- అదీ కథ!"

"రమా నీకు నిజంగా నేను అర్థంకాలేదా?"

"లేదు"

"నామాటను శాంతంగా వింటావా?" అభ్యర్థన ధ్వనించిందా గొంతులో.

"ప్రయత్నిస్తాను" అంది.

"ఇలాంటి సమావేశాల్లో చాలా టాక్ట్‌ఫుల్‌గా మాట్లాడాలి. మేమిచ్చిన కాగితం చదువుతూనే ఆ టైంలో మమ్మల్ని దోవతప్పించగలిగిన ఘటికుడు వీసీ. మధు వెనక గుంపుంది. వాడి బుర్రలో మట్టే ఉంది. వీసీకి పూరాగా దొరికిపోయాడు. ఈ ప్రైవేటు కాలేజీలవాళ్ళకి, కంట్రోలర్‌కీ ఏవో సంబంధాలున్నాయి. మధుని వదుల్చుకోటం కష్టం. వాడిని మానేజ్‌చేయాలి. రవిది అదో తరహా, మిగిలిన వాళ్ళంతా బృందంలో ఉన్నామన్న గౌరవం దొరికితేచాలు సంతోషపడిపోయేవాళ్ళే. అసలు ఎక్కువ మంది మాట్లాడితే పనిసాగదు. మధుని దారితప్పించలేకపోయాను. వాడి సలహాసంఘం వెనకాల ఏదోఉంది. నీలాంటి వాళ్ళు ఇలాంటి ఉద్యమాలకు ఊపిరి. నిజమైన పనిచేయటానికి మీరే అవసరం" ఇలా రకరకాలుగా అందామనుకున్నాడు. అవేవీ అంతపకడ్బందీగా అనిపించలేదు. రమ దేనికి ఎలా రియాక్టవుతుందో ఆలోచన తెగలేదు.

"చెప్పబోయి ఆగిపోయావేం?" అంది రమ.

వేణు మొహం విచ్చుకుంది. కళ్ళు నవ్వుతున్నాయి.

"చెప్పు" అంది. రమగొంతులో కొద్దిగా ఉడుకుమోత్తనం వేణుకి కనిపించింది.

"నువ్వు పదవులు కోరుకునే రకమనుకోలేదు రమా! నీమీద నాకో ప్రత్యేకభావం ఉంది. నువ్వు నీ ఆవేశంతో కొండలు పిండికొట్టగలవు గానీ-"

మాటలకోసం తడుముకొంటున్నట్టుగా ఆగాడు.

"నెలరోజుల పరిచయంలో నన్నునాకన్న ఎక్కువ అర్థం చేసుకున్నట్టున్నావు"

రమ ఫస్టియర్ డిగ్రీ చదువుతోంది. వేణూ ఉద్యమానికి మద్దతుకోసం వెళ్ళినపుడు పరిచయమయింది.

వేణూ నవ్వు ఆగిపోయింది. రమ గొంతులో అంచనాకు అందని సీరియస్‌నెస్.

"నిజంగానే నీకు అన్యాయం చేసినట్టనిపించితే మన్నించు, ఈమారు మీటింగ్‌కి ప్రతినిధిగా నువ్వూ వద్దువుగాని..."

"ఛ నాకలాంటి కోరికలేదు" రమ గొంతు వేణుకి దొరికినట్టుంది.

"మరెలాంటి దుంది-?" చిలిపిగా ఉంది వేణూగొంతు.

రమ స్వచ్ఛంగా నవ్వింది.

వేణూ ఊపిరి పీల్చుకున్నాడు.

★ ★ ★

వాసూని ఎవరో చూసినవార్త సీతారాంని సందిగ్ధంలో పడేసింది. దానిని శారదతో పంచుకుంటే-? రాజుకి తెలిసిపోతుంది. రాజు వేణునీ ఆ సుదర్శనాన్ని అరెస్టు చేయిస్తే-? సుదర్శనం చెప్పగలిగేదేమీ లేకపోగా ఉద్యమం దెబ్బతినొచ్చు. ఏదోలా ఉద్యమాన్ని ఆపుజేయాలని చూసేవాళ్ళు నెపం దొరికితే వేణుని వదులుతారా?

ఈ రకమయిన ఊహలు సీతారాం చేసుకున్నాడు. ఇళ్ళువదిలి పారిపోని ఎందరో వాసులకయినా ఈ ఉద్యమం రక్షణనిస్తుంది గదా! ఆ ఊహతో సీతారాం క్రమంగా సర్దుకున్నాడు.

ఆ సాయంత్రం పేపర్లో యూనివర్శిటీ సమాచారం ప్రముఖంగా వచ్చింది. ఆ వివరాలు చదువుతుంటే సీతారాంకి వీసీ ఓ విలన్‌లాగా, విద్యార్థిపోరాటానికి నాయకత్వం వహిస్తున్న వేణూ ఓ హీరోలాగా అనిపించింది. మొదటిసారి పరాజయాన్ని చవిచూసినా రెండవసారి

విజృంభించి ఎదుటిబలాన్ని చావుదెబ్బకొట్టిన వేణూమీద మరింత ఆరాధనా అభిమానమూ కలిగాయి. అటువంటి వేణూకీ తద్వారా ఉద్యమానికీ తన మూలకంగా ప్రతిబంధకం ఏర్పడనందుకు తనని తాను మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు.

విజయానికి ఓ తమాషా శక్తి ఉంది. అది మనుషులను మరింత దగ్గరచేసే ఉద్రేకాన్నియిస్తుంది. విజయభావన సీతారాంకి అలాంటి ఉద్రేకమే యిచ్చింది!

ఇంటికి వస్తూనే- "శారదా! శారదా!" అంటూ పిలిచాడు. రాధ వచ్చింది.

"అమ్మ సినిమాకెళ్ళింది డాడీ!"

"నువ్వీరోజు యూనివర్శిటీకి వెళ్ళావా?"

లేదన్నట్లు తలాడించింది.

రెండుసార్లూ రాధ మార్చ్‌లోకి వెళ్ళలేదు. వెళ్లకపోవటంలో అసహజమేదో ఉంది. రాధలో వెనుకటి ఉత్సాహం కనపడటంలేదు. వేణూ మాట వచ్చినప్పుడు ఏదో మార్పు కనిపిస్తోంది. ఈతరం పిల్లలు- ఆడమగా- కేవలం స్నేహంగా ఉన్నా ఉండొచ్చు. ఆ మాత్రానికి వాళ్ల మధ్య మరేదయినా ఉండొచ్చని అనుమానించటమయినా ఉండాలని ఆశించటమయినా అర్థంలేనివనే, అనాగరికమే! తన ముభావంగాని అయిష్టంగాని గమనించి తనని తాను నిర్బంధించుకుంటున్నదా? శారద ఏమయినా ఆంక్షలు పెట్టిందా? లేక వాళ్ళిద్దరి మధ్యా ఏమయినా పొరపొచ్చాలు వచ్చాయా?

ఆఖరి ఆలోచన అతనిని భయపెట్టింది.

పిల్లలకి తాను యిచ్చినది స్వతంత్రమనే అతని భావన. తాను పెంచిన విధానం పెంచవలసిన విధానమేనని అతని విశ్వాసం. వాసూ యింట్లోంచి వెళ్ళిపోయాక ఆ రెంటికీ గట్టి దెబ్బతగిలింది. ఈ స్థితిలో అతనికి రాధా వాసూలాగే చేస్తుందేమోనన్న ఊహ భయకంపితుడిని చేసింది.

"ఇలా కూర్చో అమ్మా!" అన్నాడు.

ఎదురుగా కూర్చోబోతే పక్కనే కూర్చోబెట్టుకున్నాడు. బెరుకుబెరుకుగా కూర్చుంది.

కొంతసేపు ఆలోచనలలో ఊగిసలాడి అన్నాడు-

"నువ్వు నాకో మాటయివ్వాలి రాధా"

"ఏంటది డాడీ?"

"ఎట్టి పరిస్థితులలోనూ అన్యాయ్యలా చెయ్యనని..." అంటూ చెయ్యి జాచాడు. రాధ ఆ చెయ్యి అందుకుని కళ్ళుమూసుకుని ఆయన ఒడిలో తలపెట్టుకుని ఏడవటం మొదలుపెట్టింది. అతని శరీరమంతా ఏదో నిస్సత్తువ కమ్మినట్టయింది. ఆమె తలమీదా వీపుమీదా అనునయంగా బుజ్జగింపుగా కదులుతోంది చెయ్యి. పిల్లలని ముట్టుకుని ఎన్నాళ్లయిందా అన్న ఆలోచన కలిగింది. చిన్నప్పుడు కూడా తను వాళ్ళని ఎత్తుకోలేదు. ఎప్పుడూ కొట్టలేదు. శారద కొట్టిందని తెలిసినపుడు తను ఆమెని మందలించాడు. ఏడుస్తూ తమ కోరికలను ఎప్పుడూ పిల్లలు తన ముందు చెప్పిన గుర్తులేదు. తను యింతకాలమూ వాళ్లతో దూరంగా వున్నాడా?

సీతారాం బిగుసుకుపోయిన హృదయం అలా ఆలోచన ప్రారంభించింది. చివరికి రాధ ఏడుపు దేనికోసమన్న ప్రశ్నకి వేణూ అన్న జవాబు వచ్చింది. వేణూ గురించి అతను సమగ్రంగా ఆలోచించలేకపోయాడు. వేణూలో అతనికి నచ్చనివి చాలా నచ్చాయి. అవే గుణాలు వాసులో ఉంటే తను భరించగలనా అనికూడా ప్రశ్నించుకున్నాడు. దానికి అతను సమాధానమిచ్చుకోలేకపోయాడు. వేణూ తనకొడుకయితే- అన్న ఆలోచనయినా అనుమతించాడు గాని- అల్లుడయితే- అన్న ఊహను అనుమతించలేకపోయాడు. వేణుపట్ల ప్రస్తుతం ఆరాధన కలిగిస్తున్న ఆ గుణాలే తర్వాత అతని జీవిత భద్రతకూ, తద్వారా రాధ జీవిత భద్రతకూ ఆటంకంగా స్ఫురించటం అతనికి దుఃఖం కలిగిస్తోంది. ఆ ద్వంద్వ స్థితిలో అతను తనని జయించుకునే ప్రయత్నంగా అన్నాడు-

"నువ్వు నీకేంకావాలన్నా నాతో చెబుతావు కదూ!"

ఏడుస్తూనే ఆమె తల ఊపింది.

"ఎందుకమ్మా ఏడుపూ? వేణు ఏమయినా అన్నాడా?"

ఆ ప్రశ్న చాలా బరువుగా చీదరగా అనిపించింది. ఆ బరువును ఎత్తగలగటం ఆ చీదరను సహించగలగటం... ఆ మానవుడికి

## ఉమ్మడి శక్తి ప్రభావమే అమోఘం
## 5 వేళ్లనూ కలిపి పిడికిలి బిగిస్తే వాటి శక్తి అపారం.

# జండూ పంచారిష్ట

### మీ జీర్ణాశయాన్ని సవ్యంగా ఉంచి
### మీకు మంచి ఆరోగ్యం చేకూర్చుతుంది

జబ్బుల లక్షణాలు వేరు-వేరయినా, వాటికి మూల కారణం సాధారణంగా ఒక్కటే. జీర్ణశక్తి లోపించడం. ఫలితమే అనారోగ్యం.ఇప్పుడు జీర్ణశక్తి కోసం వాడండి జండూ పంచారిష్ట.

గొప్ప 5-ఇన్-1 జీర్ణకారి టానిక్.మీ చేతి ఐదు వేళ్లలాగే జండూ పంచారిష్ట జీర్ణసంబంధమైన సమస్యలను సమర్థవంతంగా, సురక్షితంగా పరిష్కరిస్తుంది. అజీర్తి,అధిక భోజనం, కడుపులో వాయువు, తేపులు - ఈ బాధల నుంచి ఉపశమనానికీ, సున్నితంగా పనిచేసే విరేచనకారిగానూ, ఆకలిని వృద్ధి పరచడానికి కూడా ఇది ప్రభావవంతంగా పనిచేస్తుంది. 5 వేళ్లనూ కలిపితే ఆ పిడికిలిలోని శక్తి ఎంత అపారంగా వుంటుందో, అలాగే, జండూ పంచారిష్టలోని ఆయుర్వేద ఔషధ గుణాలు ఉమ్మడిగా కూడి మీ జీర్ణకోశాన్ని చక్కబర్చి, బలం చేకూర్చుతాయి.

క్రమం తప్పక జండూ పంచారిష్ట సేవించండి. మీ సామాన్య ఆరోగ్యం ఎలా వృద్ధి చెందుతుందో మీరే చూడండి.

మరి ఆరోగ్యమే కదా మహాభాగ్యం!




# జండూ పంచారిష్ట

*ఐదు ఔషధములతో కూడిన జీర్ణకారి టానిక్*

450 మి. లీ. మరియు 200 మి. లీ. సైజులలో లభిస్తుంది.

CLARION/B/ZP/20/173 TEL

లోలోపల కించిద్గర్వం కలిగించింది. భగవంతుని ఉనికి పట్ల విశ్వాసమున్నా- భవిష్యత్తు మరేదో శక్తి నిర్దేశం ప్రకారం జరుగుతోందన్న ఊహ ఉన్నా ఆ బరువునెత్తటమయినా దానిని వదులుకోటమయినా సులభంగా జరిగేదని అతనికి అనిపించింది.

"ఊహు(!"

"మరి?"

"అన్నయ్య గుర్తొస్తున్నాడు డాడీ?"

షాక్ తగిలినట్లుగా ఉండిపోయాడు సీతారాం. మెల్లగా తేరుకుని అన్నాడు-

-"మీరిద్దరూ ఎక్కువ మాట్లాడుకునేవారా?" రాధ వాసు గురించి ఎప్పుడూ ఏడవలేదనే అతనికి గుర్తు.

"ఎందుకు మాట్లాడుకోం?" అందిలేచి కళ్లు ఒత్తుకుంటూ.

"అదికాదు. అన్ని విషయాలూ నీతో చెప్పేవాడా?"

"అన్నయ్యవన్నీ మీ గుణాలే డాడీ!"

"అంటే-"

"అస్తమానం ఆలోచిస్తాడు. మాటలురానివాడిలా ఉంటాడు-"

"అమ్మ?"

"మీకులా కాదు. బాబా భజనచేయమని కూడా వాడితో పోట్లాడేది-"

"ఏమనేవాడు-?"

"ఏమీ అనేవాడు కాదు. నేనయితే నా తరఫునా వాడి తరఫునా పోట్లాడేదాన్ని-"

"అమ్మ పెద్దదిగదా-?"

"అయితే మాత్రం- పిచ్చిపిచ్చిగా మాట్లాడొచ్చా?"

"ఏముంటుంది?"

"ఇంకేముంటుంది- దేవుళ్ళూ, దెయ్యాలూ-"

"అవన్నీ లేవని నీకెలా అనిపించింది?"

ఆ ప్రశ్న తన అనుభవం దృష్ట్యా సీతారాం వేశాడు. నలభైనిమిదవ ఏట అతనికి పెద్ద అనుమానం వచ్చింది. జీవితంలో ప్రతిదీ విధిలిఖితంగా పుట్టుక సమయంలోని గ్రహస్థితిని బట్టీనూ జరుగుతాయని చెపుతూనే గ్రహశాంతుల వల్ల విధి లిఖితాన్ని మార్చవచ్చనటం అతనికి పరస్పరవిరుద్ధంగా కనిపించింది. కొన్నేళ్ళ తర్వాత విధిలిఖితానికీ కర్మ ఫలానుభవానికీ మధ్యకూడా వైరుధ్యం కనిపించింది. పుట్టిపోయినవాళ్ళే మళ్ళా మళ్ళాపుడుతూంటే జనాభా ఎలా పెరుగుతోందనిపించింది. చివరికి ఓ సైన్స్ వ్యాసంలో ప్రాణాన్ని తయారుచేయవచ్చని చదవటంతో అతను దేవుడనే శక్తిని నమ్మలేకపోయాడు. తనలో పరిణామాలను ఆ విధంగా గుర్తుంచుకోటానికి యిష్టపడే సీతారాం రాధకూడా అలాంటిదేదో చెపుతుందని ఆశించి ఆ ప్రశ్నవేశాడు.

"అయితే ఉన్నాడంటారా?"

రాధ గొంతుమార్పుతో సీతారాం ఉలిక్కిపడ్డాడు. ఈతరం తనకి అందనట్లనిపించింది. తర్కరహితంగా ఉండే పిల్లలు తమ ఉద్రేకాలలోపడి ఏమయిపోతారూ- అన్నపాతభయం! వేణూతో ఆమె పరిస్థితి ఏమిటి? ఎలా తెలుసుకోవాలి? తెలుసుకున్నా ఎలా పరిష్కరించటం? అయినా రాధా వాసులాగే చేస్తుందా? ఏమో?

శారద రావటంతో సీతారాంకి తాత్కాలికంగా తన ఆలోచనలనుంచి విముక్తి దొరికినట్లయింది.

తొమ్మిది గంటల ప్రాంతంలో వచ్చాడు వేణు. సర్వేపని అయ్యాక సీతారాం అక్కడికి వెళ్లటంలేదు. యూనివర్శిటీ విశేషాలుచెప్పాడు. ఓ ముఖ్యమైన విషయంమీద పేరెంట్స్ సమావేశం ఏర్పాటుచేయబోతున్నామన్నాడు. తప్పక వస్తానన్నాడు సీతారాం.

అతనికి వేణూ పూర్వాపరాలు తెలుసుకోవాలనుంది. తెలుసుకున్నాక? నచ్చుబాటయితే రాధ గురించి ఏదయినా మాట్లాడాలనుంది. నచ్చకపోతే? రాధకి నచ్చజెప్పాలి. వినకపోతే పదిహేడేళ్ళ పిల్లకి ఏ మాత్రం యుక్తత ఉంటుంది? ఉండకపోగా ఆవేశం ఉంటుంది. ఆ వయసులో తనకీ ఉండేది- ప్రేమలాంటి భావాన్ని పట్టుకుని పెనుగులాడాడు. బహుశా ఆ రోజుల్లో ప్రాచుర్యంలో ఉండే ప్రేమ భావనలతో విఫల ప్రేమను స్వీకరించటమనేది ఉండేదేమో! ఈనాడు విఫల ప్రేమను అంగీకరించకుండా మరణాన్నయినా... ఎంటి ఆలోచనలు! వదిలించుకోవాలనే ఉంది. సీతారాం

వాటిని నడుపుతున్న భయాన్ని గుర్తుపడుతూనే ఉన్నాడు. ఏంచేస్తాడు భయపడక? ఓ అనుభవం ఉండనే ఉంది.

"కాలేజీలకు అప్లయి చేస్తున్నావా వేణూ?

"చేస్తున్నానంకుల్!"

"ఏంచదువుదామనుకుంటున్నావ్?"

"బియే హిస్టరీ, పొలిటిక్సూ-"

"అదేంటీ... ఫస్టక్లాస్ వచ్చింది గదా-" ఆశ్చర్యపోయాడు సీతారాం.

"అయితే-? ఆర్ట్సులోకి పోరాదంటారా అంకుల్?" నవ్వుతూ అన్నాడు.

"అదేంకాదుగానీ- ఉద్యోగావకాశాలు తక్కువగదా అనీ-"

"అందరూ ఉద్యోగాలను దృష్టిలో పెట్టుకున్నారు. అది నేను తప్పుబట్టనుగానీ అందులో మన ఆలోచన కండిషన్ అవటం లేదూ-! ఆ స్థితిపట్ల కోపం వస్తుందంకుల్!"

"నువ్వీ స్థితిని మార్చలేవుగదా!"

"మారుతుందనే నమ్మకం, మారాలనే ఆశ... మార్చాలనే ప్రయత్నం!"

వేణూలో ఆవేశం కనబడదు. కనిపిస్తే కుఱ్ఱతనమనో ఈ తరం యింతే అనో అనేసుకోవచ్చు. తాను అతనిని సరిచేయలేడు. అతని వాదాన్ని అంగీకరించనూగలడు! నమ్మకాలూ ఆశలూ వరకూ ఫరవాలేదుగాని ప్రయత్నాలు కొంత ప్రమాదకారకాలే! కానీ లోకంలో ప్రయత్నాలు జరగకుండా ఎలా వుంటాయి? అవి ఎవరు చేసినా బాధలేదుగానీ- తనవాళ్ళు చేస్తే?"

"ఏంటంకుల్! మరీ తీవ్రంగా ఆలోచిస్తున్నారు?"

సీతారాంకి అతనొక అద్దంలాగానూ, తనని అందులో చూసుకోలేకపోతున్నట్లూ అనిపించింది. నిదానంగా అన్నాడు-

"రాధ కలివిడిగా ఉండటం లేదు వేణూ! వాసూ గురించి బెంగపెట్టుకుందంటావా?"

విస్మయంతో చూశాడు వేణు. తమ మధ్య చనువును గ్రహించానని సూచనా? తన అంచనాలకు పరీక్ష పెడుతున్నట్లా-? -వేణూ ఆలోచనలో ఉండగానే-

"నువ్వేమారు మాట్లాడి చూడు వేణూ! నీమాట వింటుందని నాకు నమ్మకముంది-"

సీతారాంకి లోలోపల ఎంతో తృప్తిగా అనిపించింది.

వేణూ ఎవరవనీ- అతనొక మంచి వ్యక్తి. అతని ప్రయత్నాలు భద్రజీవితాన్ని యివ్వక పోనీ- అతని ఆలోచనలు తన కూతురికి వ్యక్తిత్వాన్నిస్తాయి. ఆ వ్యక్తిత్వమెటువంటిద వనీ- అది వాసూ చేసిన పనిని చేయనీయదు. అది నిలబడి పోరాడేలా చేస్తుందిగాని విడిచి పెట్టి పారిపోయేలా చేయదు.

అలా తనని తాను సమర్థించే ఆలోచనలలో ఉన్న సీతారాంతో "అలాగే మాట్లాడతా"నని చెప్పి సెలవు తీసుకున్నాడు వేణూ.

★ ★ ★

అకాడమీ కౌన్సిల్ మీటింగ్‌లో భరద్వాజ వీసీని ప్రశ్నించాడనీ, "టాబులేషన్ విషయం గురించి నేనూ చెప్పాలి. అందుకు యిది ఫోరంకాదు-" అని వీసీ అన్నాడనీ పేపర్లో వార్త వచ్చింది. భరద్వాజకు ఫోన్ చేసి కృతజ్ఞతలు చెప్పాడు సీతారాం.

"ఎందుకూ?"

"మీరు నామీద గౌరవముంచి అకాడమీ కౌన్సిల్‌లో ఈ విషయం ప్రస్తావించారు-"

"మీమీద గౌరవమా! నాకేం బాధ్యత లేదంటారా?"

"ఛఛ... అలా ఎందుకంటాను సార్!"

"సర్వే చేసిన వ్యక్తులతో నేను స్వయంగా మాట్లాడాను సీతారాం! భారీయెత్తున అవకతవకలు జరిగాయి. స్టాటిస్టిక్స్ రూఢిగా చెపుతున్నాయి. ఉత్తీర్ణతాశాతం కొంత తగ్గటమూ నిజమే! అయితే విద్యార్థులకు దానివల్ల అన్యాయం జరిగిందా- అన్నది చర్చనీయాంశం-"

సీతారాం వెంటనే అన్నాడు-

"మా వాసూలాంటివాళ్ళ మాటేమిటి సార్?"

"- మిస్టర్ సీతారాం... వాసూ ఫెయిలవటం వల్ల పారిపోయాడంటారా? మీరు కోప్పడటంవల్ల పారిపోయాడంటారా?"

సీతారాం గొంతు పెగలలేదు.



"హలో... హలో... హలో..."

"చెప్పండి-"

"మీరు గాయపడుంటారు. మిమ్మల్ని బాధించటం నా ఉద్దేశం కాదు. స్టాటిస్టిక్స్ జరిగినదానిని చెబుతాయి. వ్యాఖ్యానాన్ని బట్టి రూపం కనిపిస్తుంది. వింటున్నారా-?"

"చెప్పండి-"

"ఓవర్‌గా తీసుకోకండి! వీసీతో నేను స్వయంగా మాట్లాడాను. ఆయన ఆలోచనలు మీకు వివరిస్తాను. ఖాళీగా ఉంటే సాయంత్రం రండి-"

సీతారాం అలాగేనని ఫోన్ పెట్టేశాడు. ఆఫీసు నుంచి యింటికి చేరాక రాధ వచ్చి కొన్ని కరపత్రాలను యిచ్చి వేణూ వచ్చి యిచ్చినట్లు చెప్పింది.

అతని మనసంతా భరద్వాజ అన్న మాట మీదే ఉంది. అంతరాంతరాలలో అతనూ వాస్తవమే అని భావిస్తున్నదాన్నే అంత సూటిగా మొహంమీదే అనటం సీతారాంకి దుస్సహంగా ఉంది.

బిడ్డ మొహంలోకి చూశాడు. ఏదో దిగులుగా ఉన్నట్లే అనిపించింది.

అతని గుండెను ఎవరో పిడికిట్లో బంధించి బిగుస్తున్నట్లుంది. తనకి వాసూ మీద ప్రేమ ఉంటే అంతమాట ఎలా అంటాడు? ప్రేమ లేకపోతే తను ఎందుకింతగా బాధపడతాడూ? తనకీ ప్రేమ ఉన్నట్లు రుజువెలా చేయటం?

-కరపత్రాలను చదువుదామని చూశాడు. మామూలుగా ఉన్నాయి. దృష్టి నిలవలేదు. తయారయి బయల్దేరాడు.

భరద్వాజ అతన్ని చూస్తూనే- "రండి రండి... మీకోసమే కాఫీ తీసుకోకుండా చూస్తున్నాను" అన్నాడు.

సీతారాం బలహీనంగా నవ్వాడు. కాఫీలు అయ్యాయి. భరద్వాజ అవీయివీ మాట్లాడుతున్నాడు.

"మన్నించడాల మీదా- మన్నించమనడాల మీదా నాకు నమ్మకం లేదు గాని సీతారాం- వచ్చిన దగ్గర్నుంచి చూస్తున్నాను- మీరు సరిగాలేరు! నేను అపాలజీ చెపితే మీ బాధపోతుందీ అంటే-"

"అబ్బెబ్బే... మీలాంటివారు అలా అనకూడదు-" కంగారుపడ్డాడు సీతారాం.

"నాలో స్పెషాలిటీ ఏముందీ? మీ మామూలు ఫ్రెండు పొరపాటు చేస్తే సారీ చెప్పాలని ఆశించరా?"

భరద్వాజని ఆధోరణిలో గమనించని సీతారాం సంభ్రమంతో అన్నాడు- "అదేంగాదు సార్...!"

"సరే... ఆ విషయం మనం మరిచిపోదాం! మన మొదటి పరిచయం గుర్తుంది కదా! ఏదియేమయినా మీరు నాతో మాట్లాడితీరాలనుకుని యత్నించారు! మీరా ప్రాజెక్టులో లీనమై పనిచేశారు! అందువల్ల మీకు మీ ప్రాజెక్టు మీద ఓ రకమయిన మమకారమూ అధికారమూ కన్విక్షనూ ఏర్పడ్డాయి. నా ఉద్యోగజీవితంలో నేనూ అంతలా కృషిచేసిన సందర్భాలలో అలాంటి కన్విక్షన్స్ నాకూ అనుభవమయ్యాయి. మీటింగ్‌లో వీసీని నేను అడిగాక ఆయన నన్ను తన గదికి పిలిచాడు. ఆయనతో మాట్లాడాక తన పనిమీదా ఆయనకూ కన్విక్షన్ ఉన్నట్లు నేను గుర్తించాను. అంతమాత్రాన జరిగినది సరయినదనీ కాదనీ నేను వ్యాఖ్యానించలేను-"

భరద్వాజ తనపక్కన ఉన్న పేపరులో ఓ వార్తను చూపించి సీతారాంని చదవమన్నాడు.

-గవర్నమెంటు ఆర్థిక సహాయంతో నడుస్తున్న పాఠశాలల్లో చదువు స్థాయి సంతృప్తికరంగా లేదని నాలుగేళ్ళక్రితం ఓ కమిషన్ తేల్చింది. పరీక్షలలో ఉత్తీర్ణతా శాతాన్నిబట్టి ఆయా పాఠశాలల్లో విద్యాస్థాయిని నిర్ణయించవచ్చని ఆ కమిషన్ అభిప్రాయపడింది. ఇచ్చే సహాయంపై ఆంక్షలు విధించడం ద్వారా స్కూల్సు పనితీరును మెరుగుపరచవచ్చని సూచించింది. ఆ సూచనను ప్రభుత్వం అమలుచేసింది. స్కూల్సు అన్నిట్లోనూ విద్యార్థుల పాస్ పర్సంటేజ్ పెరిగింది. మాస్ కాపీలు స్కూలు టీచర్లే చేయిస్తున్నట్లుగా మరో కమిషన్ తేల్చిందని వార్త. సరైన సదుపాయాలు ఏర్పాటుచేయలేని ప్రభుత్వం- సకాలంలో పుస్తకాలు అచ్చువేసి అందజేయలేని ప్రభుత్వం- తన అసమర్థతనూ, దివాళాకోరుతనాన్ని కప్పిపుచ్చుకోడానికి ఈరకంగా కమిషన్లు నియమించు





తున్నదని ప్రభుత్వ సహాయక పాఠశాలల టీచర్ల యూనియన్లు సంయుక్తంగా ఓ ప్రకటనని చ్చాయి.

పేపరు చదవటం పూర్తిచేశాడు సీతారాం.

"ఈ రోజు ఈవార్త చదువుతుంటే వీసీ అన్నమాటలే గుర్తువచ్చాయి సీతారాం. ముందుగా లక్ష్యాలు నిర్ణయించేసి ఆ తర్వాత ఎదురయ్యే ఇబ్బందుల గురించి విడివిడిగా ఆలోచించటం మన అలవాటు. అది విద్యా వ్యవహారాలలో మరింత ఎక్కువ. ఎందుచేతా అంటే ప్రభుత్వంలో ఉన్నవాళ్ళకి తమ అధికార ప్రదర్శనకు నిరాటంకంగా ఉండే రంగం విద్యారంగమే. విద్యారంగంలో జరిగే మార్పులు వర్తమానాన్నే కాదు భావిని కూడా ప్రభావితం చేస్తాయన్న విషయాన్ని వాళ్ళు గుర్తించరు. దాదాపుగా వీసీ మాటలివి. ఆయనన్నదాన్ని మీలోనే ఉంచుకోండి" ఆగాడు భరద్వాజ.

అతనింకా ఏదో చెప్పబోతున్నట్లు గ్రహించి- "చెప్పండి" అన్నాడు ఆసక్తిగా.

"ఆయనంటాడూ... నేను ఛార్జి తీసుకునేసరికి ఇక్కడ పరిస్థితి చాలా అధ్వాన్నంగా ఉంది. ప్రైవేటు కాలేజీలకూ, ఇక్కడ స్టాఫ్‌కీ మధ్య అవగాహన ఉంది. టాబులేషన్‌లో చాలా గందరగోళం జరిగేది. రీవాల్యూయేషన్‌లో ఫెయిలయిన వాళ్ళు పాసయిపోయేవారు.

ఆయన మాటలకు అడ్డుపడి- "చదివే కుర్రాళ్ళను ఫెయిలు కూడా చేసేవారంటారా?" అని అడిగాను.

"ఆ అవకాశం లేదు భరద్వాజా! దీన్నంతటినీ సమగ్రంగా పరిశీలించాలంటే నేను స్టాఫ్ మీదే ఆధారపడాలి. కొత్తవాళ్ళు రారుగదా. ఉన్నవాళ్ళలోనే కాస్త నమ్మదగ్గవాళ్ళతో చాలా రకాల పద్ధతులు మార్చి రహస్యంగా జరిపించాను. కోడింగ్ పద్ధతి మార్పించాను. దీనివల్ల నష్టపోయినవాళ్ళు ఊరుకుంటారా?" ఇదీ వీసీ కథనం.

సీతారాం మాట్లాడలేదు.

"ఊరుకుండిపోయారేం... చెప్పండి?"

"వీసీ కథ నమ్మదగ్గదేనంటారా?" సీతారాం అడిగాడు.

"నమ్మకపోటానికి ఆధారం కనిపించేంతవరకూ నమ్మాలిగదా. పోనీ ఆయనే ఇదంతా చేశాడు అంటే కారణం ఉండాలికదా. నాకేమీ కనిపించటం లేదు. జరిగినదానికి ఆయన్ని బాధ్యుణ్ని చేయటం మీనింగ్‌లెస్"

సీతారాంకి ఏమనాలో తోచలేదు. భరద్వాజ మాటను ఒప్పుకోబుద్ధీ వేయలేదు. జేబులోంచి వేణు ఇచ్చిన కరపత్రాన్ని తీసి అందించాడు.

"ఇందులోవన్నీ పచ్చి అబద్ధాలు-"

అది చదువుతూనే ఆవేశంగా అన్నాడు భరద్వాజ.

సీతారాంకి భరద్వాజ ఆవేశం అర్థం కాలేదు. తెల్లబోయి మరో కరపత్రాన్ని తనూ చదవటం మొదలు పెట్టాడు.

"నేను వీసీని నిలదీసి అడిగానా? ఆయన టాబులేషన్‌లో పొరపాట్లు జరిగాయని అంగీకరించాడా? జరిగినదానిని పేపర్లే కొంతమార్చి రాశాయి. ఆయనను నేను జరుగుతున్న వివాదం గమనించారా అని అడిగాను. టాబులేషన్‌లో లోపాలమీద చర్చ జరిగినప్పుడు నేనూ చెప్పాల్సింది చాలా ఉంది- అని మాత్రం అన్నాడాయన. దానిని మీ వేణూ ఇంకా మార్చేశాడు.

ఇంతకీ మీవాడి కోరిక ఏమిటో చూశారా పేపర్లన్నీ తిరిగి దిద్దించాలిట. తప్పంతా టాబులేషన్‌లో ఉందని ఆపాదిస్తూ ఆందోళన మొదలెట్టి మీ వేణూ పేపర్లు తిరిగి దిద్దించమంటాడేంటీ?"

భరద్వాజ ఆవేశం క్రమంగా గొంతులోంచి పోయి ఆఖరు మాటలలో నవ్వూ చులకన భావమూ నిండాయి.

"భరద్వాజగారూ? జరిగినదానిలో దేనికీ వీసీని బాధ్యుణ్ని చేయగూడదంటున్నారు మీరు. ఓపక్క అలా అంటూనే- ఈ కరపత్రానికీ ఆందోళనకీ బాధ్యతంతా ఒక టీనేజ్ కుర్రాడు వేణూకి అంటగడుతున్నారు"

భరద్వాజ నవ్వు ఆగిపోయింది.

అతని మొహాన్ని చూసి అతనికి కోపం రాలేదని గ్రహించిన సీతారాంకి ఓ పాయింట్ చూపించగలిగానని తృప్తి కలిగింది.

"మిస్టర్ సీతారాం" ఏదో అనబోయాడు.

"వాదించవద్దుసార్... ఆలోచించండి"

భరద్వాజ నవ్వేసి- "అలాగే" అన్నాడు.

వేణులాంటి కుర్రాడు ఇంత సులువుగా దొరికిపోయే తప్పు ఎందుకు చేసినట్టూ?

సీతారాం ఇంటికి బయల్దేరినా ఆలోచనలు వెన్నాడుతూనే ఉన్నాయి.

★ ★ ★

"నువ్వీ మధ్య నన్ను కలవటమే లేదు"

"బానే గుర్తుందే"

"గుర్తుండకపోను. మీ నాన్నగారు గుర్తు చేశారు"

చురుగ్గా చూసింది రాధ.

వేణూ ఆరోజు ఆమెను కాలేజీ విడిచిపెట్టే సమయంలో కలిశాడు. మాట్లాడాలి పదమన్నా ...రం మధ్యలో విశాలమయిన స్థలంలో ఉంది ...స్కు. ఎత్తయిన చెట్లూ- తీర్చిదిద్దిన పొదలూ- బాటలూ- అక్కడక్కడ ఫౌంటెన్స్. విశాలమయిన వేదికమీద నిర్మించబడిన గడియారమూ- అద్దాల భవనమూ. యాత్రిక బృందాలూ, జనసమ్మర్ధంగా ఉండే ఆ తోటలో మానవుడు తనలోకి తను తెరుచుకుని గుంపు నుంచి తననుతాను దాచుకోటానికి అవకాశమిచ్చే ఓ వాతావరణం ఉంది. ఆ బహిరంగ స్థలంలో యవ్వన హృదయాల రహస్యాలను మూగవేదనలనూ మధుర భావణలనూ స్వకపోలకల్పిత దుఃఖ భారాలనూ అక్కడి చెట్లు ఆకులు గాలి పక్షులు పంచుకుంటాయి కాబోలు. కొంతసేపు తనలోకి తను జారిపోయిన వేణు రాధతో మాటలు ప్రారంభించాడు.

"ఆయన మా నాన్నగారు. నా బాధ ఆయనకి పడుతుంది" అంది వేణు ధోరణిని అనుకరిస్తూ.

"నాకు పట్టదంటావు" నవ్వుతూ అన్నాడు.

"ఒకప్పటి సంగతేమోగానీ ఇప్పుడు పట్టదు నాగొడవ"

"ఏమిటో ఆ ఒకప్పటికీ ఇప్పటికీ తేడా?"

"రమ"

ఆ గొంతులో భావానికి తేలికగానూ, బిగ్గరగానూ నవ్వాడు.

"అదన్నమాట కథ"

"నువ్వు నటించలేవు. నువ్వు రమ వలలోపడ్డావు"

"సరిగా ఆలోచించి చెప్పు. నేను ఆమె వలలోపడ్డానా? ఆమె నా వలలో పడిందా?"

రాధ చటుక్కున ఏడవటం మొదలుపెట్టింది.

చుట్టూఉన్న ప్రకృతిలోకి చూస్తూ నేలమీదవదుకున్నాడు వేణు?

"వాళ్ళ నాన్నగారు పెద్ద రచయిత. దానికీ ఆ లక్షణాలున్నాయి. తెలివిగా మాట్లాడుతుంది. ఎన్నో విషయాలు తెలును. నీకు అది నచ్చకపోతుందా- దానికి నీలాంటాడు నచ్చడా- తప్పకుండా ఒకరికొకరు నచ్చుతారు. ఒకరి వలలో ఒకరు పడతారు" ఈ ధోరణిలో రాధ కొంతసేపు మాట్లాడింది. తలవంచుకుని మధ్యమధ్యలో ఏడిచింది.

క్రమంగా ఏడుపు తగ్గిపోయింది. మాట్లాడాల్సినదంతా మాట్లాడేశాననిపించాక తల ఎత్తి వేణు మొహంలోకి చూసింది.

"మాట్లాడవేం?"

వేణూ నిట్టూర్పి లేచికూర్చున్నాడు. అతని ముఖం గంభీరంగా ఉంది.

"రాధా... నువ్వు చాలా దూరం వచ్చేశావు. నీతో వివరంగా మాట్లాడాల్సిందే"

"ఏం మాటాడతావూ- నేను ఎవరినీ ప్రేమించలేనూ, ప్రేమించనూ- అంతే గదా"

చకితుడయినట్లు చూశాడు వేణు.

"ఇంచుమించుగా నువ్వు రైటే రాధా. ప్రేమ అన్నది కల్పితభావనా వాస్తవమా- నువ్వు నన్ను ప్రేమిస్తున్నాననుకుంటున్నావా ప్రేమిస్తున్నావా- ఇవన్నీ చర్చనీయాంశాలు"

"నన్ను వదిలించుకోటానికి చర్చలకన్న మంచి సాధనాలు నీకు లేవు"

అసహనంగా చూశాడు వేణు.

"సరే... అయితే రమను నేను ప్రేమిస్తున్నాను. వీలయితే పెళ్ళాడతాను. పిల్లల్ని కంటాను. పెంచుతాను. ముసలివాణ్ణి అవుతాను. మరణిస్తాను- యిదేగదా నీ ఊహ. నేను ఒప్పేసుకుంటున్నాను. నన్నొదిలెయ్"

"నేనేం పట్టుకోలేదు. నువ్వేనన్ను తీసుకొచ్చావు- పిలిచిమరీ"

"నిజమే! నేనే పిలిచాను- ఎందుకంటే- మీ డాడీ..."





ప్రేమో మరేదో ఆ భావన ఆమెలో బలంగా ఉంది. అది సహజమయిన తెలివితేటలనూ, మానసిక శక్తులనూ కూడా దారి మళ్ళించగలిగేటంత తీవ్రంగా ఉంది. ఆ భావననూ, ఆ ఆవేశాన్నీ తర్కంతో మరల్చటం అసాధ్యం. నేరుగా ముఖం మీదే- ఎందుకంటే మీ నాన్నగారిపట్ల నాకు బాధ్యత ఉంది- అని చెప్పెయ్యాలి. ఏమిటా బాధ్యత అని నీలదీసి అడిగితే నిజం చెప్పకతప్పదు. అలా అడగకుండా ఆమె ఆవేశం బద్దలయితే? ఆమె భావనాప్రపంచాన్ని చిన్నాభిన్నం చేస్తే తట్టుకోగలదా రాధ? రాధ ఏమయితే తనకేం? రాధ ఏమైతే తనకేం??

వేణూ గాంభీర్యత నడలుతున్నట్లయింది.

కూడదీసుకుంటూ మెల్లగా అన్నాడు-

"రాధా... స్త్రీ పురుషుల మధ్య ఒకరి స్వాతంత్ర్యాన్ని మరొకరు గౌరవించగలిగే విజ్ఞత ఉండాలి- ఒప్పుకుంటావా?"

"మనసు మనం చెప్పినట్లుగా వింటుందా- సరే! ఒప్పుకుంటాను చెప్పు" అంది.

"స్త్రీ పురుషుల మధ్య దైహికమయినవీ, మానసికమయినవీ ఇష్టాలూ అయిష్టాలూ ఉంటాయి. అవి జీవితంలో కొన్ని ఘటనలే గాని జీవితానికి పరమ ప్రయోజనాలు కావు. ప్లీజ్, అర్థం చేసుకో"

"సరే... అర్థం చేసుకుంటాను- చెప్పు"

"నువ్వు తెలివితక్కువ ఆవేశాలకు లోనవకు రాధా!"

"అలాగే లోనవను- చెప్పు"

ఆమె జవాబుల ధోరణి మారకపోవటంతో తన మాటలు వ్యర్థమనుకున్నాడు వేణు. అతను మౌనం వహించటంతో అంది.

"నీ గోలయిందిగదా! నేనోమాట అడుగుతాను. నిజం చెపుతావా?"

ఏమిటన్నట్టు చూశాడు.

"నువ్వు రమను ప్రేమించటం లేదని చెప్పు చూద్దాం"

నవ్వబోయాడు.

"నవ్వకు! ఆలోచించి చెప్పు"

"లేదు"

విస్తుపోయినట్టు చూసింది.

"నేను నాకళ్ళతో చూశాను. రమతో మాట్లాడాను. కనీసం నువ్వు ప్రేమనయినా నటిస్తున్నావు"

"అర్థంలేకుండా మాట్లాడకు"

"సరే... ఆ విషయం వదిలేద్దాం! నువ్వు నిజంగా నన్ను ప్రేమించటం లేదూ?"

వేణూ కొంతసేపు మాట్లాడలేదు.

"నిజం చెప్పినా నువ్వు నమ్మేలా లేవు రాధా"

"ఫరవాలేదు- చెప్పు"

"అయితే- నిన్ను ప్రేమిస్తున్నానో లేదో నాకు తెలీదు. నాకీలోకం అంతటిమీదా ప్రేమగానే అనిపిస్తుంది. అందువల్లనే ఈలోకంలోని చెడు అంతటిమీదా కోపం అనిపిస్తుంది. ఇంత సుందరమైన ఈలోకం అస్తవ్యస్తమవటాన్కి కారణమయిన ప్రతిదానిమీదా నాకింతద్వేషం ఈ ప్రేమనించే వచ్చింది. అనంతమయిన ప్రేమ మానవుడిని కార్యోన్ముఖుడిని చేస్తుంది. కార్యోన్ముఖునికి ప్రేమా, ద్వేషమూ రెండూ రెండు పనిముట్లవుతాయి- ఆయుధాలవుతాయి".

వేణూ మాటలు అతనిలోనే ఆగిపోయాయి. ఎదుటివాళ్ళకు అందని భావాలకు ఏ మాటలు ప్రయోగించి ప్రయోజనమేమిటి?

"నాకు తెలుసు. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు. మా డాడీమీద నువ్వు చూపించే ప్రేమంతా నామీదే. మనిద్దరికీ పెళ్ళికి వీలవదని నీ భయం. చూడు వేణూ- నేను మా అన్నయ్య లాంటిదాన్ని కాదు. పారిపోను. అనుకున్నది సాధిస్తాను"

వేణూకి రాధ పెద్ద ఫూల్‌లా అనిపించింది. తనకీ ఆమెకీ మధ్య ఎంత అంతరం!! కానీ-

వేణూకి ఒక్క ప్రశ్న మిగిలిపోయింది.

తనకి ఆమెపట్ల ఏదో ఉన్నది. దానికి మూలం ఏమిటి?

ఆరాత్రి ఎంతోసేపు ఆలోచించాక అతనికి అనిపించింది.

రాధలో స్వచ్ఛత ఉంది. పారదర్శికత ఉంది. దానిపట్ల తనకు ఏదో గౌరవముంది. కావాలంటే ఆమె లభిస్తుంది. జీవితం ఆమెతో భద్రంగా ఉంటుంది. కానీ-

దానిని తను తిరస్కరిస్తున్నాడు.

రమతో జీవితం ముడివడాలన్న కోరిక తన కులేదు. అది జరిగితే కేవలమూ ఓ ఇన్సి డెంట్!

అయితే ఆమెవంటి దీక్షాపరురాలూ, శక్తి మంతురాలూ వేలాదిమంది రాధలను నడి పించగలదు. వాళ్ళ ఆవేశాలను అసహజ పద్ధతిలో రెచ్చగొడుతూ పాతపోస్తున్న సమాజచ క్రాన్ని భేదించగలదు.

ఆమెతో కలిసినడవటం కోసం అవసరమ యితే తను రాధ నమ్మకాలలోని కల్పననో వాస్తవాన్నో- వాడుకోవాల్సి వచ్చినా వెనుదీయ డు.

అలా తేల్చుకున్నాక వేణూకి గాఢంగా నిద్ర పట్టింది.

* * *

"ఎందుకలా చేశావు వేణూ?" అన్నాడు సీతారాం వేణూను కలుసుకొని

వేణూ నవ్వుగా నవ్వి- "అ కరపత్రం నేను రాయలేదంకుల్!"

"నువ్వురాయపోయినా వేశావుగదా. ముందూ వెనకా చూసుకోవద్దా?"

"ఈ కరపత్రం నేను వేయలేదంకుల్?"

"అంటే ఈ కరపత్రంలో విషయాలతో ను వ్వు ఏకీభవించటం లేదన్నమాట"

"నా అభిప్రాయం అటుంచండి! ఈ పాంప్లెట్ వేసిన వాళ్ళ దృష్టిలో- ఈనాటి ఉద్యమాలన్నీ ఓ పద్ధతిలో నడుస్తున్నాయిట. డిమాండ్స్ తయారుచేసేటప్పుడే కొంచెం పె ద్దవే చేయాలిట. ఒత్తిడి పెంచాలి. ఆ తర్వాత బేరాలకు దిగాలిట. బేరాలలో తగ్గింపులు ఎలా గూ ఉంటాయి. అప్పుడు అసలు కోరికలు తీరతాయట. మొత్తం పేపర్లన్నీ తిరిగి దిద్దించమని కోరతాంట.వీసీ సంప్రదింపులకు దిగినప్పుడు చర్చల్లో పేపర్లన్నీ టాబులేషన్ రిజిస్టర్‌తో సరిచూసి మార్కులిస్టులు సరిచే యించమనే ప్రతిపాదన వస్తుందిట. దానిని రాజీగా అంగీకరిస్తాంట."

"నిజంగా ఉద్యమాలన్నీ ఇలాగే సాగుతా యా వేణూ?"

"వాళ్ళనేది అదే!"

"వాళ్ళు వాళ్ళు అంటున్నావు. ఎవరు వాళ్ళు? వాళ్ళతో నువ్వు లేవా?"

వేణూ సీతారాం ముఖంలోకి పరిశీలనగా నూ ఆలోచనగానూ చూశాడు.

ఈ మధ్యతరగతి మామూలుమనిషికి ఏది ఎంతవరకూ వివరించాలి? ఈ తరగతి మనిషి త్యాగాలూ చేయవచ్చు. స్వార్థమూ చూసుకోవ చ్చు. అదంతా ఆ ప్రత్యేక పరిస్థితిని బట్టీ- ప్రత్యేక వ్యక్తిత్వాన్ని బట్టీ ఉంటుంది. అయితే ఓ తరగతిగా ఈ మనిషికి విషయ వివరణ అవసరమా అనవసరమా? ఆలోచనలో వీళ్ళ ప్రతిస్పందన, ఆచరణలో ప్రతిస్పందనా ఏద యినా వీళ్ళకి ఎపీల్ చేయటం అవసరమనీ అనవసరమనీ వాదనలు ఉన్నాయి-

వేణూకి ఆలోచన తెగలేదు.

"మన ఉద్యమం నడవాలి. నలుగురూ కలవాలికదా అంకుల్! అందరూ ఒక్కలా ఆలోచించరుగదా!"

"నిజమేగానీ చర్చల ద్వారా అంతా ఓ ఆలోచనకు వస్తారనుకుంటానూ"

"ఆలోచనలన్నీ విద్యార్థులవిలాగే కని పిస్తాయి. కానీ వాటివెనక అనేక రకాలవాళ్ళ అవసరాలుంటాయి. ఈ దశలో అవి బయటప డవు అంకుల్"

"నీమాటలు నాకు బోధపడటంలేద బ్బాయ్! కానీ ఇలా ఉద్యమాన్ని ఎవరిష్టంవ చ్చినట్లు వాళ్ళు నడిపితే- విలువలన్నీ వదు లుకుని నీలాంటి వాళ్ళూ నడవటమే ముఖ్య మనుకుంటే- అది అధర్మం వేణూ! వీసీ మాటల్లోనయినా అర్థవంతమయిన అంశము న్నప్పుడు వినటంలో, అంగీకరించటంలో ఓ విలువ ఉంది"

వేణూ సమాధానంగా నవ్వాడు.

"విలువలు వదులుకుని నేను నడుస్తానా అంకుల్! ఈ తరహా ఉద్యమాలను దారిత ప్పించే ప్రయత్నాలు జరుగుతాయి! దారిలో ఉంచటం కోసం మనమూ మెలకువగా వ్యవ హరించాలి"

"ఏం మెలకువో" అంటూ భరద్వాజ మాట లనూ తన సమాధానాన్ని చెప్పాడు. అంతా యథాతథంగా చెప్పాననుకోడం లో . వేణూ పట్ల తన ప్రత్యేకభావాన్ని వ్యక్తపరచేందుకు ఆ

విషయంలో ఎలాంటి మార్పులు చేసినదీ గమనానికి రాలేదు.

"అయితే తర్వాత ఏం చేస్తావు నువ్వు"

"నలహా సంఘాన్ని ఏర్పరచాలని గట్టిగా పట్టుపడుతున్నారు కొందరు. అంటే ఈ ఉద్యమానికి కొందరు రాజకీయవాదులు నేతలు కావటానికి చూస్తున్నారన్నమాట. వారు దీన్ని స్వాధీనం చేసుకోవాలనుకుంటున్నారు. దీన్ని తలిదండ్రులకూ, కాలేజి అధ్యాపకులకూ ఉమ్మడిగాచేసి అందరిలో మెజారిటీ ద్వారా దీనికి నలహా సంఘం అవనరం లేదని నేను అడ్డువేస్తాను. అదీ నా మూవ్!"

వేణూ ఊహలో సాధ్యాసాధ్యాలు లోపాలూ సీతారాంకి కనిపించలేదు. అతని తెలివి మాత్రం కనిపించింది. చదరంగాన్ని చూసే ప్రేక్షకుడికి ఆటగాడి ఎత్తు చూసేనరికి కలిగే మెచ్చుకోలు వంటిది సీతారాం చూపుల్లో కనిపించింది.

వాళ్ళిద్దరూ విడిపోతున్నప్పుడు వేణూ అన్నాడు.

"రాధతో మాట్లాడానంకుల్! వానూలా ప్రవర్తించదు. మీరు ఆందోళన పడకండి"

సీతారాం పెదవి బిగించి జవాబివ్వలేదు.




"మన నమస్యల్లా వీసీయే! ఆయన్ని దారిలోపెడితే నరిపోయేదానికి మనకెందుకొచ్చిన నలహాలూ సంఘాలూనూ" అన్నాడు భూషణం మొహం చిరాగ్గాపెట్టి.

"ఆ వీసీ అంత అల్లాటప్పాకాదు. విద్యార్థుల్ని నాలుగూ అరవనిచ్చి కూర్చోండ్రా కుంకల్లారా అనెయ్యగలడు! ప్రభుత్వం ద్వారా ఆయనమీద ఒత్తిడితేవాల్సిందే! అంటే ప్రభుత్వంమీద ఒత్తిడి తేవాల్సిందే! అందుకు పెద్ద తలకాయలు కూడాల్సిందే! వాళ్లు ఊరికినే వస్తారా- పెత్తనం వాళ్ళ చేతికి ఇవ్వకుండానూ? అయినా మధ్యలో నీకేం బాధ?" అన్నాడు రాజు.

భూషణం ఇంట్లో అతని కొడుకు అమెరికా ప్రయాణానికి పార్టీ ఏర్పాటు చేశాడు. భూషణం తండ్రి ఒకప్పుడు పెద్ద కాంట్రాక్టరు. పదిహేనేళ్ళుగా అతను కాంట్రాక్టులు చేయటంలేదు. ప్రైవేటు కాలేజీలవాళ్ళంతా ఓపక్కకు చేరారు. రాజు మాటలను వింటూనే మునలాయన అన్నాడు-

"నాయనా! ఈ రాజకీయాలకు తలాతోకా ఉండదు. చదువు చెప్పుకు బతికే వాళ్ళకెందుకొచ్చిన గొడవలివన్నీనూ"

"చదువు చెప్పుకుని బతుకుతున్నారా అంకుల్! వ్యాపారం చెయ్యటంలేదూ" రాజు.

"అర్థాలు తీస్తే అందరు చేసేదీ వ్యాపారమే రాజుగారూ" అన్నారొకరు.

మునలాయన అందుకున్నాడు.

"ఇది ఈ రోజులకు పట్టిన దౌర్భాగ్యం. మా రోజుల్లో మేమూ కాంట్రాక్టులు చేశాం. ఆ రోజుల్లోనూ పలుకుబడి ఉన్నవాళ్ళను ఆశ్రయించీ కాంట్రాక్టులు తెచ్చుకునేవాళ్ళం. మనకులపాడనో, బతికిచెడినవాడనో- అప్పుడూ కొంత ఆశ్రిత పక్షపాతమూ ఉండేది. ఇంజనీర్లూ ఆఫీనర్లూ ఏదో కొంత తిన్నా మేం కొంత తినబెట్టినా అటుపనిచేసేవారు; ఇటు మమ్మల్నీ చూసేవారు. అదంతా ఓ పద్ధతిగా ధర్మంగా సాగిపోయేది. ఈనాడు అంతా కొత్తరకం పుట్టుకొచ్చారు. కులం గిలం ఎవడికి కావాలి? ధర్మం అధర్మం ఎవడికి? చేతిలో పైసాలేకుండా పదేళ్ళ క్రితం టికాణాలేనివాళ్ళు- రాజకీయ నాయకులకూ కాంట్రాక్టర్లకీ మధ్యన ఈనాడు తయారయ్యారు. ఉద్యోగస్తులనూ ఓ కాంట్రాక్టు తీసేసుకున్నారు. ఇప్పుడు జరిగేది వ్యాపారం కాదు నాయనా- మానిపులేషన్! మానిపులేషన్ చేయగలిగేవాడే కాంట్రాక్టరు! పనీ సామ్మూ నబ్ కంట్రాక్టర్లవి! మిల్లులుపెట్టకుండా వస్తువులు తయారుచేసే తాబేదార్ల రాజ్యం వచ్చేసింది".

రాజు ఉడుక్కోలేదు. మునలాయన వినురంతా తనమీదే!

"చేసేదంతా మాయే అయినప్పుడు పాత మాయ ధర్మమై కొత్తమాయ అధర్మమా తుందంటారు అంకుల్. ఆ లెక్కన ఈనాడు మీరంటూన్న అధర్మం కూడా ఎప్పటికయినా ధర్మమవుతుంది గదా ?"

భూషణం వెంటనే అన్నాడు-

"మానాన్నగారి మాటల్ని పట్టించుకోకు రాజా! కాలేజీలు పెట్టుకుని చదువు చెపుతున్నామో, వ్యాపారం చేస్తున్నామో మా మానాన మేం బతుకుతున్నాం. గద్దెమీద ఎవడున్నా ఎక్కడానికి ఎవరు ముందుకొచ్చినా మా వంతు సమర్పణలు మేమెలాగూ చేసుకుంటున్నాం. ఈనాడు ఈ వీసీ మా ప్రాణాలకు ఎసరు పెడుతున్నాడు. విద్యార్థులు అల్లరి మొదలు పెట్టారు గదా- మేమూ వెనకనించి దన్నిస్తే వీసీ తగ్గుతాడని మా ఆశ. ఇందులోకి పెద్దలు ప్రవేశం చేస్తే మేం ఫలానా అని మార్కయిపోతాం. ఆ తర్వాత గద్దెమీదున్నన్నాళ్ళు మమ్మల్ని కాల్చుకుని తింటారు. మనకెందుకు వచ్చిన తిప్పలు ఇవన్నీనూ అన్నది మా నాన్నగారి ఆలోచన"

"పల్లెటూళ్ళో బస్తాడు పిండి కావాలంటే అరెకరం భూమి ఉన్నవాడి నడుగు- ఏం చేస్తాడో. నా వ్యవసాయం నేను చేసుకుంటానంటే అవదూ. ప్రతి పార్టీకీ మన అవసరం కలిగించాలని వాడికి తెల్సింది. మీ నాన్నకి తెలియకపోవచ్చు. నీకు తెలియాలి. మార్కయిపోడాలు ఇంకా ఎక్కడున్నాయి బ్రదర్! ఈనాడు నువ్వు నాకేమిటీ- అన్నది ప్రశ్న. పదవిలో ఉన్నవాళ్ళూ- దాన్ని సంపాదించుకోవాలనుకునేవాళ్ళూ అంత తెలివితక్కువవాళ్ళు కాదు. శాశ్వతంగా ఎవడినీ వదిలేనుకోరు. వెంటా బెట్టుకోరు. ఈ వీసీలాంటి హార్డ్‌నట్‌ని బద్దలుకొట్టాలంటే ఓ రాయిచాలదు. నీవంతు నువ్వూ ఆడాల్సిందే. ఆట మొదలెట్టాక కూత సరిపోయిందని వదిలేస్తే అవుటయిపోగలవు"

"మాబాగా చెప్పావు! మావాడు ఈ రొంపిలో పడడు" అన్నాడు మునలాయన కోపంగా.

'ఇప్పుడు కొత్తగా పడటమేంటీ? ఉన్నదే రొంపిలో అయితేనూ!" రాజు.

మునలాయన్ని మాట్లాడనీయకుండా భూషణం అన్నాడు-

"మీరూరుకోండి! నేను చూసుకుంటానూ"

ఆ మాటకి మునలాయన ఉగ్రుడయిపోయాడు. భూషణమూ అదే స్థాయిలో పోట్లాడాడు. చివరికి కొందరు పెద్దాయనని తీసుకుపోయారు.

అంతా నీ ఇష్టప్రకారమే జరుగుతుందనుకోకు భూషణం. మేనల్లుడుగదా అని మధూని తయారుచేసి వదిలావుగాని మధ్యలో వాడిని మరొకడు మరో దిక్కుకి మార్చేస్తాడు" అన్నాడు రాజు గ్లాసులో మిగిలినది గొంతులో ఒంపుకుంటూ.

భూషణం మాట్లాడలేదు. మరో చిన్న కాలేజీ ఆయన అన్నాడు-

"ఖర్చులు జాస్తీ అయిపోతాయిగదండీ"

"ఊరికనే అవుతాయా పనులు"

"ఖర్చులకేం లెండి. ఎలాగో సర్దుకుంటాం! ఓ పక్క గవర్నమెంటు అభ్యుదయమనీ పల్లకాదనీ అరుస్తోంది! ప్రైవేటు కాలేజీలు స్వాధీనం చేసుకోవాలనీ డొనేషన్లు రద్దు చెయ్యాలనీ గోలగోల. మనం అపోజిషన్ వెనకజేరామంటే ఇదేనందని ప్రభుత్వం ఆపనిచేసినా చేసేస్తుంది. ఇంకెలా బతుకుతాం!"

పకపకపకపకా నవ్వాడు రాజు. గ్లాను మొత్తాన్ని గడగడ తాగేశాడు.

"ట్యూషన్ ఫీజులమీద ప్రభుత్వం నిబంధనలు పెడితే ఏం చేయగలిగారు మీరు? రేపొద్దుటే నువ్వన్నట్టే ప్రభుత్వం డొనేషన్లు రద్దు చేసినా, నీ కాలేజీలను స్వాధీనం చేసుకున్నా చేసుకోవచ్చు. ఈరోజు మీరు అపోజిషన్‌వాళ్ళ వెనకాలనున్నా వాళ్ళ కొమ్ముగాసినా గద్దెకెక్కినవాడు వాడి వేషాలు వాడు వేస్తాడు. వాడి ఏడుపు వాడిది. పోతే నువ్వెలా బతుకుతానంటావు. బస్సులు జాతీయం చేస్తే వాటిని నడిపిబతికినవాళ్ళు రెసిడెన్షియల్ కాలేజీలు నడుపుతున్నారు ఈవాళ. భూ పరిమితులు విధిస్తే దానిమీదబతికినవాళ్ళుసినిమా హాళ్ళు నడుపుతున్నారు. పట్టణాలలో ఇళ్ళూ భూములూ మీద ఆంక్షలుపెడితే హౌసింగ్ సొసైటీలు పెట్టుకు బతుకుతున్నారు. నీదగ్గర తెలివో పెట్టుబడో ఉంటే బతకడానికి పనరులే దొరక్కపోవు. వెర్రిమొర్రి ఆలోచనలు విడిచిపెట్టి ఈ కాలేజీల వ్యాపారమే శాశ్వతమని గుండెలు





బద్దలుకొట్టేనుకోకు. నువ్వు ఒంగితే నీమీద ఎవడయినా ఎక్కేస్తాడు. నువు ఎక్కితే ఏనాకొడుకయినా ఒంగుతాడు- అదే చిదంబర రహస్యం''

రాజు ఎన్నిగ్లాసులు పూర్తిచేశాడా అని లెక్క వేసుకుంటున్న భూషణం- నాలుగు- అనుకున్నాడు.

''నర్లే! నారుపోసినాడు నీరెలాగా పోస్తాడు! ఆ వేదాంతం ఉండనే ఉంది. అయితే ఈనాడు ఇందులో ఉన్నాం- ఇప్పుడేం చెయాలీ అన్నది మాబాధ. తప్పించుకు పోవువాడు ధన్యుడు గదా- అదెలాగా అన్నది ప్రశ్న!''

రాజు మరింత గట్టిగా నవ్వాడు.

తప్పించుకుపోతావా? ఎక్కడికి బాబూ! ఎవరిని బాబూ నువ్వు కాలేజీలు పెట్టావు. పిల్లలపేర్లు చెప్పి పెద్దవాళ్ళ జేబులు కొట్టావు. యూనివర్శిటీలిచ్చే పరీక్షలు చాలక ఎంట్రెన్సులు పెట్టించి నువ్వు బలిశావు. ఆపిల్లలు పానవడానికి దొడ్డిదార్లు కనిపెట్టావు. దొడ్డిదోవల దగ్గర గడ్డివాముల దగ్గర కుక్కపిల్లలను కాపలాపెడితే ఆ కాపలాను బెదరగొట్టావు. ఇప్పుడా కాపలా ఏకు మేకయితే పిల్లల్ని చెలరేపావు. వాళ్ళ ఆట చాలకపోతే వెనక్కి తగ్గి పోతావాబ్రదర్! రేపు అపోజిషన్‌వాళ్ళు కలుగచేసుకుంటారు చూస్తూ వుండు. నేల ఈనినట్టు కుర్రవాళ్ళు తయారైపోతారు. పేపర్లన్ని అచ్చువేస్తాయి. ప్రభుత్వం ప్రజా వ్యతిరేకమైపోయిందంటారు వాళ్ళు. దెబ్బకి దయ్యం జడుస్తుంది. తప్పించుకు పోతావా బుల్లబ్బాయ్....''

మళ్ళీ ఎవరూ నోరు విప్పలేదు.

★ ★ ★

వెంకట్రామయ్య కొన్నేళ్ళు ఎదురులేకుండా పరిపాలన చేశాడు. చివరికి పార్టీ ఓడిపోయి మరో కొత్త ప్రభుత్వం వచ్చేసింది. అధినాయకత్వం తన కిందవాళ్ళను అలుగ్గుడ్డలు మార్చేసినట్టు మార్చేస్తోందని ముందే గ్రహించి, పార్టీ ఓటమికి నైతిక బాధ్యతవహించి, క్రియాశీల రాజకీయాలనుంచి సన్యసించాడు వెంకట్రామయ్య. అనుచరులు ఆత్మహత్యలు చేసుకుంటామని బెదిరించటంతో- కనీసం గెలిచిన శాసన సభ్యులకైనా మరో ఉమ్మడి నాయకుడు దొరకకపోవటంతో- వెంకట్రామయ్య తిరిగి నాయకత్వం వహించాడు.

''కొందరు కుర్రాళ్ళు చేసే అల్లరికి కొంపలేం మునగవు, ప్రభుత్వాలేం మారిపోవు'' అన్నాడు ఆయనకు దగ్గరగా మసిలే ఓ అనుచరుడు.

వెంకట్రామయ్య గొంతుసవరించుకున్నాక అన్నాడు.

''ఈ స్టూడెంట్స్‌ని ఏం చేద్దామంటావు?''

''మనం దీన్ని వట్టుకోవాలండీ'' అన్నాడు స్వరాజ్యవతి.

ప్రశ్నార్థక మొహంతో చూశాడు వెంకట్రామయ్య.

''విద్యామంత్రి ఈమధ్య మంత్రివర్గ పునర్వ్యవస్థీకరణలో ఇందులో పడ్డారు. బూరెల బుట్టలోంచి గడ్డి బుంగలోకి మారినట్లుంది పైకి. ఎంత నవ్వినా కడుపులో మంటగా ఉంటుంది. ఇప్పుడు మనం విద్యామంత్రిని వేడెక్కించితే ఆ వేడి ముఖ్యమంత్రికి తగులుతుంది''

వెంకట్రామయ్య ఇబ్బందిగా కదిలాడు.

''విద్యామంత్రిని మనం మాటల్లో పెట్టి కాస్తంత ఇబ్బందికరమైన స్టేట్‌మెంట్ రాబడదాం! పీక్కోలేక సీయం చస్తాడు. అసెంబ్లీలో ఓట్లంతా ఒకడికే ఏస్తారుగానీ స్టేజీల మీద, ఛాంబర్సులోనూ వాళ్ళు వేరు!''

వెంకట్రామయ్య ప్రోత్సాహంగా నవ్వాడు.

''మనం పార్టీ పేరుమీద దిగం! మనలో ఎవరో ఒకరు వాళ్ళ సలహా సంఘానికి అధ్యక్షుడిగా ఉండి ఉద్యమం మధ్యలో రాలిపోకుండా చూస్తారు! మనకేమయినా ఇందులో రాలిక కనిపించితే పార్టీపేరుమీద ఓపెన్‌గా స్టేట్‌మెంటిచ్చి క్లయించేసుకొంటాం''

వెంకట్రామయ్య తలాడించాడు.

''వేరే ఎవరో ఎందుకు! నువ్వే అధ్యక్షుడిగా ఉండు'' అన్నారొకరు.

ఓ క్షణం ఆలోచించి సరేనన్న నవ్వునవ్వాడు వెంకట్రామయ్య.

★ ★ ★

ఉద్రేకంతో ఊగిపోయాడు వేణూ!

''ఓ పక్క తల్లిదండ్రులూ లెక్చరర్లూ మన



మూ అంతాకలిసి ప్రజాస్వామికంగా చర్చించి నిర్ణయించుకుందామనుకుంటే- ఈ పెద్ద లంతా సలహా సంఘానికి అంగీకరించారని స్వరాజ్యవతి అధ్యక్షుడని ఈ పత్రికా ప్రకటన ఏంటీ?''

తన కాలర్‌మీద బిగుసుకున్న వేణూ చేతి మీద చూపునిలిపి-

"ముందు చెయ్యి తియ్యి-" అన్నాడు మధు.

నెమ్మదిగా సడలింది వేణూ పట్టు. అతనితో బాటు రవి, రమ, మరికొందరు విద్యార్థులూ ఉన్నారు. మధూ కాలేజీ పరిసరాలలో ఉన్నాడు. చుట్టూ మూగిన వాళ్ళలో చాలామంది మధూ ఆజ్ఞకోసం చూస్తున్నారు.

వేణూ తమాయించుకున్నాడు.

" పేపరులో న్యూసంతా చదివావా? " అన్నాడు మధు.

" చదివాను''

"ఈ ఉద్యమానికి సారథివి నువ్వే! దీనికి అధ్యక్షుడివి నువ్వేనని వచ్చింది.'' పరిశీలనగా చూసాడు వేణు.

"నువ్వన్నట్టు అందరితో మీటింగూ అదీ అంటే తేలదు. మన డిమాండ్స్‌కి ఆ బ్రహ్మరాక్షసి... రుగుడు వీసీ ఒప్పుకోవాలంటే గట్టిగా పట్టాల్సిందే! అందుకే యీ సలహాసంఘం! నా కోరిక మీదే వాళ్లు నాయకత్వం నీ మీదుంచారు. అయినా నీక్కావాల్సిన నాయకత్వం నీదే అయినపుడింక గొడవెందుకూ? ''

" వాళ్లెవరూ నువ్వెవరూ యిదంతా తేల్చడానికి? '' అంది రమ.

"నువ్వెవత్తివి? ఈ ఉద్యమం నీ అబ్బగాడి సొత్తా?'' మధు అనుచరుడన్నాడు.

" షటప్! '' కోపోద్రేకంతో ఊగిపోతూ అంది రమ.

"ఆడపిల్లవని ఊరుకున్నాను- '' అన్నాడతను ఉగ్రంగా.

మధు అతన్ని వారించాడు. కొందరతన్ని లాక్కుపోయారు.

" డీసెంట్‌గా పోయేదానికి గొడవ లెందుకూ? '' అన్నాడు రవి గాభరాగా. వేణు మాట్లాడలేదు.

" బానూ! ఈ ఉద్యమాన్ని మొదటినుంచి నువ్వు నడుపుతున్నావని చెప్పాక వాళ్లంతా నిన్ను చూడాలన్నారు. నా మాటమీద నిన్ను ఒప్పుకున్నారు. ఈ రమ లాగ నువ్వు నోరు పారేసుకోక కొంచెం ఆలోచించు! అంతా నీ ప్లాన్ ప్రకారమే సాగుతోంది. రేపొద్దుట విద్యా మంత్రి ముందు మనం పెద్ద ప్రదర్శన యివ్వాలి- ఇలాంటి సమయంలో మనం మాటలు అనుకుని విడిపోకూడదు. నీ యిష్టం-''

అప్పజెప్పినట్లుగా అనేసి మధు వెళ్లిపోయాడు.

రమ మహోద్రేకంతో వేణూని చూసింది. అతని ముఖంతీరు గమనించాక తనకోపం ఏంచేసుకోవాలో ఆమెకు అర్థం కాలేదు.

" నేను పోతున్నాను- '' వెనుదిరిగింది రమ. వేణూ ఆమె చెయ్యి పట్టుకుని-" ప్లీజ్ వెయిట్! '' అన్నాడు.

విడిపించుకోబోయి ఆగింది. రవి వేణు భుజంమీద చెయ్యివేసి- " ఏంచేద్దాం '' అన్నాడు.

" ఆలోచిద్దాం- '' అన్నాడు వేణూ.

సరిగా అదే సమయానికి మధూతో కార్లోపోతున్న అనుచరుడడిగాడు-

" ఆ వేణూగాడితో ఎందుకు వేళ్ళాడ్డం- ''

" నాయకుడు అలాంటాడే ఉండాలట! స్వరాజ్యవతిగారన్నారు- ''

" నువ్వు పనికిరావా? ''

మధు మాట్లాడకుండానే ఒకడు గంభీరంగా అన్నాడు.

" ఉపన్యాసాలివ్వటానికీ- అవసరమైతే బొక్కలోకెళ్లటానికీ- యింకా అవసరమైతే సావటానికీ- అలాంటాడే కావాలి! అలాంటాడి సావే ఉద్యమాలకి అసలు ఊపు- ''

★ ★ ★

" మీతో మాట్లాడాలి నాన్నగారూ! ''

చదువుతున్న పుస్తకం మూసి నిరంజన్‌శర్మ కూతురి వైపు పరిశీలనగా చూసాడు.

" వేణూ గురించి నాన్నగారూ... ''

" ఏమిటీ-?





దీర్ఘంగా నిట్టూర్చింది రమ. - " నాకెందుకో భయంగా ఉంది- "

" - నువ్వు భయపడుతున్నట్టు లేవు. గందరగోళపడుతున్నట్లున్నావు - "

" లేదండీ! నేను వేణుని పూర్తిగా అర్థంచేసుకున్నాను. నిర్వహణా దక్షతవుంది. ఆలోచనా శక్తి ఉంది. తను దేనిని నమ్ముతున్నాడో ఏంచేస్తున్నాడో తెలును. ఆ మనిషి ఈరోజు పూర్తిగా దిగజారిపోయాడు. అతను ఒక్కరోజులో మారలేదు. అతని నీచత్వం బయటపడిందంతే! "

ఆఖరు వాక్యంలో ఆవేశం ప్రస్ఫుటమయింది.

" - పొరబాటుపడ్డానా అనీ ఆలోచించాను. "మీ యూనియన్‌వాళ్లు సహకరించటంలేదు. మీ కాలేజి తరఫున మీరు ప్రతినిధిగా పాల్గొనాలి; అంటూ నా వెంటబడ్డాడు. నేను ఏకీభవించాను. నేనూ రవీ అతనూ కలిసికట్టుగా పనిచేశాం! రవిది కొంచెం విపరీతధోరణి. నలుగురినీ కూడగట్టలేడు. నమ్మినదాన్ని చెప్పాలనీ చెప్పినదాన్ని చెయ్యాలనీ అంటాడు. సత్యం ధర్మం వ్యక్తికి ప్రధానమంటాడు. న్యాయానికి గెలుపు తప్పదంటాడు. రవిపట్ల జాలి కలుగుతుంది. వేణుపట్ల- అడ్మిరేషన్- కలుగుతుంది. అతని అంచనా ప్రకారమే అన్నీ నడిచాయి. లక్ష్యంకోసం పోరాడవలసిన విధంగా పోరాడతాడనిపిస్తుంది అలాంటి మనిషి..."

రమ ముఖమంతా జుగుప్సతో నిండిపోయింది.

"- రాజకీయ నాయకులకు ఉద్యమంలో సూదిమొనంత జాగా కూడా యివ్వనని ప్రగల్భాలు పలికినమనిషి వాళ్ళతని నాయకత్వాన్ని అంగీకరించేసరికి వాళ్ల వెనక అమిరిపోయాడు. భరించరాని అసహ్యంగా ఉంది--"

" - రాజకీయ నాయకులతో సాంగత్యాన్ని నువ్వెందుకు వ్యతిరేకిస్తున్నావు? "

చకితురాలయినట్లు చూసింది రమ. ఆమెకు తండ్రి ఎప్పుడూ అర్థమయినట్లే ఉండి అర్థంకాకుండా పోతుంటాడు.

- వాళ్లిద్దరికీ మధ్య ఏభైరెండేళ్ల వ్యత్యాసముంది.

రమ ఆలోచనలోపడటాన్ని గమనించి శర్మ అన్నాడు.

"- రాజకీయనాయకులను నీలాంటివాళ్లు ఈ సమాజంలో మీకు కనిపించేప్రతి కుళ్ళుకీ కారణంగా భావించేస్తుంటారమ్మా! అది తప్పు. కుళ్ళిన సమాజంలో వాళ్లూ ఓ భాగమేగాని వాళ్లే దీనికంతటికీ కారణం కారు. అనేకానేక విషయాలను తెలిసుండీ తెలివుండే నిర్లక్ష్యంచేసే మేధావుల పాత్రను మీరు గుర్తించరు. ఇవ్వాల్సినదానికన్నా రాజకీయ నాయకులకు ఎక్కువ ప్రాధాన్యత యివ్వకు; ఇవ్వవలసిన ప్రాధాన్యతను యివ్వు; నీకు కావలసింది వాళ్లని మంచీ చెడుగా విడదీసి యోచించటమేగాని పూర్తిగా నిరాకరింటంకాదు- "

రమ ఆ మాటలను గురించి వాదిద్దామనుకున్నా ఆమె మనసు సహకరించలేదు.

"మీరన్నట్లు నాది పొరపాటయితే గావచ్చు! వేణు వాళ్ళతో చేరటాన్ని నేను తీవ్రంగా అసహ్యించుకుంటున్నాను. కానీ ఓ ప్రత్యేకమయిన ఇష్టం- ఇష్టం అనొచ్చా- ఫీలింగ్ అనొచ్చు- అదేదో చెదిరినట్లేలేదు. ఎందువల్ల? వేణు పట్ల గుడ్డివిశ్వాసమా అది? కనిపించని ఈ తరహా ఇష్టానికి కారణం ఏమిటి? నాకు తెలీనిది నన్ను బంధిస్తుంటే నేనెలా విడిపించుకోవాలి? నా మీద నాకున్నది భయమే నాన్నగారూ- గందరగోళంకాదు-"

రమవంక విచిత్రంగా చూసాడు శర్మ.

కల్పనా సాహిత్యాన్ని ఆస్వాదించే శక్తి తగ్గుతున్న వయసులో ఉన్నాడు అతను. తెలిసినదాన్ని ఇంకా ఇంకా చెప్పెయ్యాలన్న ఆబ పెరుగుతోంది.

"నీ ప్రశ్నకు జవాబివ్వగలనో లేదో తల్లీ! ఓ మనిషి ఏదో జబ్బుతో ఓ డాక్టరు దగ్గరకు వస్తాడు. పరీక్షలన్నీ చేసి పెదవి విరిచేస్తాడు డాక్టరు. రెండునెలల్లో చచ్చిపోతావంటాడు. ఆరేళ్ళ తర్వాత ఆ రోగి తిరిగివస్తాడు. డాక్టరు ఆశ్చర్యపోయి ఆ రోగిని లోపలికి తీసుకుపోయి చంపేసి పరిశోధన ప్రారంభిస్తాడు. ఆ జబ్బుకు నిరోధం శరీరంలో ఎక్కడుందన్నది తెలుసుకోటమే అతని లక్ష్యం. ఈ కథలో డాక్టరులాంటివాడినేమో నేను! నా కన్నకూతురివి నీవు. నీ బాధ నాకు అనుభూతమవు

తోంది. కానీ నీ సమస్యను పరిశీలిస్తుంటే...''

శర్మ ఆగి అన్నాడు-

''సృష్టిలో ఓ తమాషా ఉంది. అణువునుంచి బ్రహ్మాండందాకా బలమయిన వస్తువు కేంద్రంగా బలహీన వస్తువులు తిరుగుతాయి. సమాజంలోనూ అంతే! మానసికంగాగానీ దైహికంగాగానీ బలవంతులని బలహీనులు అంటిపెట్టుకుంటారు. తిట్టనీ కొట్టనీ అది అంతే! ఇదంతా భయమూ కాదు, భద్రత కోసం ఆరాటమూ కాదు బలంపట్ల ఉండే ఓ ఆకర్షణ, ఆరాధన-''

''నేను వేణుకన్న వీక్ అంటారు-'' ఆలోచనగా ఉంది రమగొంతు.

''తల్లిదండ్రుల చుట్టూ పిల్లలు తిరుగుతారు. వాళ్ళే ఎదిగాక పరిస్థితి మారుతుంది. వయసుతో యుక్తత మారుతున్నప్పుడు ఒకప్పుడు వీక్‌గా ఉండే వారు తర్వాత మారతారు. నువ్వు ప్రస్తుతం వేణుని నీకన్న బలవంతుడిగా తీసుకొనే అవకాశం ఉంది-''

''నాన్నగారూ! దంపతులలో ఎవరో ఒకరు బలవంతులయితేనే ఆ కాపురం సఫలమవుతుందని మీరో కథలో వాదించారు. దాన్ని నేను అంగీకరించను. ఏమైనా మీరు- నా మనస్థితివట్ల సానుభూతితో ఆలోచించి స్వాంతన కలిగే జవాబు ఇవ్వాలని ఆశించానేమో! అది పొరబాటే-''

శర్మలేచి ఆమె తలమీద ఆప్యాయంగా చెయ్యి వేశాడు.

''సానుభూతి మీద నాకు నమ్మకంలేదమ్మా! నేను కొత్తగా మాట్లాడలేదు. నువ్వు కొత్త పరిస్థితిలో ఉన్నట్టున్నావు! ఏమయినా తండ్రిగా నువ్వు భద్రంగా ఉండేలా అన్నీ ఆలోచించి మాట్లాడటం మానవత్వం అనిపించుకుంటుందేమో! నాలో అదిలేదని...''

''ఛ ఛ... నా ఉద్దేశం మిమ్మల్ని బాధించటం కాదండి!'' కంగారుగా అంది రమ.

''వెర్రితల్లీ! నీ మాటలకు నేను బాధపడను. ఒక్క విషయం చెపుతాను విను! బౌద్ధికంగా అంచనా వేయగల స్వేచ్ఛకీ- మానసికంగా అనుభవించే స్వేచ్ఛకీ మధ్య ఆధునిక జీవితం స్త్రీకి చాలా అంతరం కల్పించింది. ఆ రెంటిలో దేనిని పొందటానికయినా కొన్ని ఇబ్బందులు తప్పవు. ఇబ్బందులను కష్టాలుగా- కష్టాలను జీవన్మరణ సమస్యలుగా తబ్బిబ్బయి మానసికంగా శారీరకంగా రకరకాల అనారోగ్యాలపాలవుతోంది నేటి స్త్రీ. నా అబ్జర్వేషన్ తప్పుకావచ్చు. నువ్వలా కాకూడదనే ఈ తండ్రి ప్రగాఢ వాంఛ. ఈ ముసలివాడికి నీ జీవితాన్ని మానేజ్ చేసే శక్తి లేదు. విషయాలను తరచి తరచి ఆలోచించగలిగితే ఎవరికి వాళ్ళకి కనిపిస్తుందనే నా నమ్మకం! సుఖంగా నువ్వు బతకాలన్న కోరికతోనే నీకు ఆలోచనని వ్వాలని నా యత్నం!''

రమకి తండ్రి మాటలు తృప్తికలిగించాయి.

ఆ రాత్రి ఆమె గదిలో తన మంచం మీద పడుకుంది. రాత్రి చేసే ధ్వనులనేపథ్యంలో ఆలోచనలలో మునిగిపోయింది. నిద్రకు ముందు ఆమెకు వచ్చిన ఆలోచన ఇది-

తండ్రిలో ఆమెకు అర్థంకానివున్నాయి. అయినా తండ్రి గొప్పవాడు. మంచివాడు. అతని భావాలనేకంతో తను విభేదిస్తుంది. అతని కార్యకలాపాలపట్ల తనకు నమ్మకం లేదు. కానీ చిత్తశుద్ధి మీద ఎలాంటి శంకాలేదు. వేణు కూడా అంతే! అతని ప్రయత్నాలు తప్పయినా చిత్తశుద్ధి మీద శంకలేదేమో! అతని మీద వైముఖ్యం అతని భావాలనుంచే పుట్టింది. ఆ ఇద్దరిలోనూ తనకు పోలికలు కనిపిస్తాయి.

కానీ ఓ తేడావుంది.

ఇద్దరూ తెలియజెప్పజూడటంలో ఒక్కటే!

అయితే ఒకరు నాకు తెలిసినదిదే అని చెపుతారు!

మరొకరు మనకు తెలియవలసినదింతే అని చెపుతారు!

''మీరో మారురాటానికి వీలవుతుందేమో కనుక్కోమన్నారు సి.యం.'' ముఖ్యమంత్రి కార్యదర్శి విద్యామంత్రి లక్ష్మీనారాయణను ఫోనులో అడిగాడు.

ఇబ్బందిగా కదిలాడు లక్ష్మీనారాయణ. ఎనభై ఏళ్ల ఆ మనిషిలో కళ్ళూ గొంతూ మాత్రం మార్పులేకుండా ఉంటాయి. స్వయంగా వచ్చి ముఖ్యమంత్రి అతనిని సంప్రదిస్తుంటాడు.




"సరే" అన్నాడు ఆగి.

"మీ కోసం మిగిలిన ఎంగేజ్‌మెంట్స్ రద్దు చేసుకుంటామన్నారు-"

వెంటనే రమ్మనమని ఆదేశమన్నమాట!

"ఫోనులో మాట్లాడవచ్చుగదా?" చికాకుగా అన్నాడు.

"కనుక్కొని చెప్పమంటారా సార్?"

"వద్దులే... నేను వస్తున్నాను-"

విద్యామంత్రి వెళ్ళేసరికి కార్యదర్శి ఎదురు వచ్చి ఆహ్వానించాడు. గదిలోకి అడుగుపెట్టగానే ముఖ్యమంత్రి కుర్చీలోంచి లేచి నిలబడి "రండి రండి" అన్నాడు. విద్యామంత్రి కొంచెం సర్దుకుని నవ్వాడు. ఇద్దరూ కూర్చున్నాక కార్యదర్శిని పంపేశాడు ముఖ్యమంత్రి. అతనికి ఏభై తొమ్మిదేళ్ళ వయసు. సన్నగా మధ్యరకంగా ఎత్తుగా ఉంటాడు. ముక్కుసూటిగా ఉంటుంది. ట్రిమ్ చేసిన గడ్డం. చిన్నికళ్ళు, చూడగానే అంచనా వేయటానికి కుదరని ముఖం.

"మీకు ఇబ్బంది కలిగించానండీ లక్ష్మీగారూ-" అన్నాడు అపాలజిటిక్‌గా.

"సర్లెండి! ఏమిటి విశేషం?"

లక్ష్మీనారాయణ మాటలు మింగడు. అతని రాజకీయ జీవితమంతా ప్రతిపక్షంలోనే దాదాపుగా గడిచింది. రాష్ట్రంలో ఏర్పడిన రెండు మిశ్రమ ప్రభుత్వాలలో స్వాతంత్ర్యానికి ముందు ఓ మారు, తర్వాత ఓమారూ అతను కొద్దికాలం మంత్రిగా ఉన్నాడు.

ముఖ్యమంత్రికి అతని నిర్మొహమాటం అనుభవమే!

"మీ విద్యార్థుల అల్లరి ముదురుతున్నట్టుంది. తరగతులను బహిష్కరించారట"

"వాళ్ళని తప్పుపట్టను! మనకీ సమస్య కావాలనే వీసీ సృష్టిస్తున్నాడు"

"అలాగంటారా? స్వరాజ్యపతి తెలుసుగదా "

"ప్రస్తుతం వెంకట్రామయ్య చుట్టూ తిరుగుతున్నాట్ట-"

"అతను విద్యార్థి ఉద్యమానికి సలహా సంఘం అధ్యక్షుడు"

"అదే అర్థంకాదు వీసీ వాళ్ళమనిషి"

"వాళ్ల మనిషేనంటారా?"

"అతని నియామకంలో గవర్నరు చర్యని మనం విమర్శిస్తే వాళ్ళెంత సపోర్టు చేశారూ!"

"చేశారులెండి! మీరప్పుడు విద్యాశాఖలో లేరు! మనమిచ్చిన లిస్టులో ఆఖరుపేరని గవర్నరు నియమించాడు. మనం ఆయన మీద ఒత్తిడి తెస్తే ఆయన చర్య సక్రమమేనని వాళ్ళు పట్టుబట్టారు. అంతమాత్రాన వీసీ-"

'మీరప్పుడులేరు' అనటంలో 'మీకేమీ తెలీదు' అన్నధ్వని విద్యామంత్రికి వినిపించింది.

"వీసీ సమర్థుడు. నిక్కచ్చి మనిషి. మనమతన్ని సమర్థించాలి. అదీ మీ కోరిక"

"సరిగ్గా మన ప్రత్యర్థికి కావల్సిందదే- మనం వీసీకి దన్నియ్యాలి"

"మరేం చెయ్యాలయితే?" ప్రశ్నలాకాకుండా ఆలోచనగా అన్నాడు.

"విద్యార్థుల్లో రైతుల్లో ఉద్యోగస్తుల్లో మనం సంపాదించుకున్న స్థానం పోవాలంటే మార్గమేమిటి? మనం వాళ్ళకి వ్యతిరేకులుగా రుజావు చెయ్యాలి. ముందుగా మనం బిగుసుకుపోయేట్టు చెయ్యటమే ప్రత్యర్థి ప్రయత్నం-"

"విద్యార్థుల కోర్కెలను అంగీకరించితే సరిపోతుందనే ముందునుంచి అంటున్నాను" ముఖ్యమంత్రి నిస్సహాయంగా చూశాడు.

"అంటే వాళ్ల ఉద్యమం సఫలమవుతుంది. ఉద్యమ నాయకత్వానికి ప్రాబల్యం పెరుగుతుంది. అలాకూడా వాళ్ళే లాభపడతారు-"

"మనం వీసీ కొమ్ముకాయక తప్పదంటారులాగుంది-"

"ఆ పని మనం చెయ్యకపోతే వాళ్ళు చేస్తారు. మన స్టాండ్‌ని బయటపడనిచ్చాక వాళ్ళు రంగంలోకొస్తారు. మనమంతా కలిసి-" అని ఆగి- "మనం కాస్తంత సంయుక్తంగా ఆలోచించి అడుగెయ్యాలి-" జాగ్రత్తగా అన్నాడు.

మీరెప్పుడూ ఒంటెత్తుగా పోతారు- అన్న ధ్వనిని గమనించాడు విద్యామంత్రి.

"న్యాయం ధర్మం ఎటుంటే అటే వుంటాను నేను. అటే ఉండాలి మనం!"

ముఖ్యమంత్రి కుర్చీలో వెనక్కి జారబడి నవ్వాడు. "న్యాయం ధర్మం అనేవి ఏమి

టంటారూ?''

విద్యామంత్రి జవాబుకోసం ఆగకుండా నవ్వును ఆపేసి- గొంతుపెంచాడు.

"మనం ఎటుంటే అదీ న్యాయం- అపోజిషన్‌లో అదీ మన కొలబద్ధ. న్యాయాన్యాయాలను తూచి నిర్ణయాలు తీసుకునే వీలు అప్పుడూ మనకు అంతంత మాత్రమే! అయితే కొన్ని విషయాలలో కలగజేసుకోకుండా అభిప్రాయం చెప్పకుండా ఉండే స్వేచ్ఛ ఉండేది. అధికారంలోకి వచ్చాక న్యాయాన్యాయాలు తూచి అమలుచెయ్యవచ్చనే మీకులాగే నాకూ అనిపించేది కానీ-''

ఆగి నిట్టూర్చాడు ముఖ్యమంత్రి.

"మనం న్యాయాన్ని నిర్ణయించలేమంటారు-''

"విద్యార్థుల కోర్కెలా? వీసీ క్రమశిక్షణా? ఏది సమర్థనీయం! ఏది న్యాయం?''

ఆ ప్రశ్నవేసి ముఖ్యమంత్రి కార్యదర్శిని రప్పించాడు. అతను తెచ్చిన ఫైలును చూసి సంతకం చేసాడు. తర్వాత అతన్ని పంపేశాడు. అంతవరకూ విద్యామంత్రికి ఆలోచించుకునే అవకాశం ఇచ్చాడు.

"విషయమంతా సాకల్యంగా తెలునుకొని నిర్ణయం తీసుకుంటాను దానివల్ల ఎదురయ్యే పరిణామాలకు పూర్తి బాధ్యత నాదే! అవసరమైతే రాజీనామా చేయటానికీ నేను సిద్ధమే''

"ఒప్పుకుంటాను. మనపార్టీ బలం ఏ మాత్రం? మూడు శాతం ఓట్లు యిటువి అటైతే మనం అపోజిషన్‌లో ఉంటాం! పదహారుగురు ఎమ్మెల్యేలు అటయితే మనం దిగిపోతాం! మనమేదో సాధిస్తామనుకున్న ప్రజానీకం ఏమవుతుంది? మన ఆశయాలు ఏమౌతాయి? మీ రాజీనామా వల్ల మన పార్టీలో అనైక్యత బయటపడుతుంది. పార్టీ మనుగడ న్యాయమా? మీ ఒక్కరికి తోచింది న్యాయమా?''

సందిగ్ధంగా చూసాడు విద్యామంత్రి. అతనికిస్తున్న ప్రాధాన్యత తృప్తి కల్గిస్తున్న ఛాయలు ముఖంలో కనిపిస్తున్నాయి.

"ఎక్సైజ్ నుంచి యిందులోకి మార్చాను. మీరేమని భావించారు?''

అసందర్భంగానూ ఆకస్మికంగానూ వచ్చిన ప్రశ్నకు చకితుడయ్యాడు విద్యామంత్రి.

"మిమ్మల్ని మార్చిన వెంటనే మీకేమీ అనిపించి ఉండదు. మంత్రివర్గంలో మార్పుల మీద ప్రెస్‌లో వచ్చిన వ్యాఖ్యానాలు చూసాకే మీ నిజాయితీ మీద నాకు నమ్మకంపోయినట్లు అనిపించి వుండాలి''

ఆ మాటకీ లక్ష్మీనారాయణ మాట్లాడలేదు.

"మిమ్మల్ని మార్చడానికి రెండు కారణాలున్నాయి. మీతో స్నేహమే, మీమీది గౌరవమే మొదటి కారణం. ఎక్సైజ్ మీవంటి నిజాయితీ వరుడిచేతిలో ఉండాలనే నా ఆశ. మీమీద వచ్చిన ఆరోపణలు గమనించారా? వాటిల్లో వాస్తవంలేదని చేసిన వాళ్ళతోసహా అందరికి తెలును. రెండేళ్ళుగా బురదజల్లుతున్నారు. ఈ బురద నుంచి తప్పించటం తప్ప మిమ్మల్ని రక్షించటానికి మార్గం నాకు తోచలేదు. నా ఆలోచన తప్పంటారా?''

"కృతజ్ఞుడిని''

"సరే... రేపు వాళ్ళు మిమల్న కలుస్తారు. మీరు శ్రద్ధగా వింటారు. సానుభూతిగా మాట్లాడతారు. వాళ్ళ కోర్కెలను పరిశీలిస్తామని వాగ్దానం చేస్తారు''

"తర్వాత?''

"ఇది విద్యార్థుల గొడవే అయితే మన మూవ్ వేరు. వెంకట్రామయ్య మూవ్‌ని బట్టి మనం అడుగువెయ్యాలి. అకడమిక్ యియర్‌ని వ్యర్థంచేసుకుని విద్యార్థులు ఎన్నాళ్ళు కూర్చుంటారు?''

"విద్యార్థుల కోర్కెలు న్యాయమైనవైతే ఈ విధానం నాకు సమ్మతం కాదు''

పెదవి బిగించి ముఖ్యమంత్రి అతని వైపు చూసాడు.

మర్యాద చేశాడు. వేడెక్కించాడు. చల్లబరిచాడు. సాగదీసాడు. చివరకు చెప్పింది చచ్చినట్టు వినేలా చేసాడు. విన్నాక- విద్యామంత్రి రియాక్షన్ ఊహించిన దానికి భిన్నంగా లేదు.

"సరే... మీకా కోర్కెలు న్యాయంగా తోచితే సానుభూతిగా మాట్లాడండి. ఈ ఒక్కసారికీ వాయిదా వేయండి. ఈలోగా మన పార్టీనుంచి కొందరు ఉద్యమానికి మద్దతునిస్తారు. స్వల్పమైన మార్పులతో మనవాళ్ళు వేరేగా డిమాండ్లు చేస్తారు. ఉద్యమం నడుపుతారు.





చివరికి ఉద్యమం సఫలమవుతుంది - ఈ ఏర్పాటుకు మీకు అభ్యంతరం ఉండకూడదు''

ముఖ్యమంత్రి తగ్గినట్లు అనిపించటంతో లక్ష్మీనారాయణకు కొంత తృప్తి కలిగింది.

''ఈ రాజకీయాలు ఏ గంగలోనయినా కలవనీయండి! విద్యార్థుల న్యాయమైన కోర్కెలు నెరవేరవలసిందే!'' అన్నాడు.

అతను వెళ్ళిపోయాక గొణుక్కున్నాడు ముఖ్యమంత్రి 'ఫూల్స్'.

★ ★ ★

సెప్టెంబర్-1

రాజధానిలో ఈనాటి విద్యార్థులు ఊరేగింపులో పదివేలమంది పాల్గొన్నారని అంచనా. నగరం బయట కళాశాలలనుంచి పెద్ద సంఖ్యలో విద్యార్థులు హాజరయినట్లు వారి ప్రతినిధి తెలియజేశారు. ఊరేగింపు నగరవీధుల గుండా సాగి విద్యామంత్రి కార్యాలయానికి చేరుకుంది. విద్యార్థి ప్రతినిధులను కలుసుకొన్న మంత్రి వారి వాదనను సావధానంగా విన్నారు. వారి న్యాయమైన కోర్కెలను తప్పక పరిశీలిస్తామని మాట యిచ్చినట్లు తెలుస్తోంది. విద్యార్థినాయకుడు వేణూ ఉత్తీర్ణతాశాతం గణనీయంగా పడిపోయినట్లూ భారీగా అవకతవకలు జరిగినట్లూ చేస్తున్న వాదనతో మంత్రి ఏకీభవించినట్లు ప్రెస్‌కి తెలియజేస్తున్నారు. మంత్రి విలేకర్లతో మాట్లాడుతూ అవసరమయితే వీసీతో ఈ విషయమై చర్చించగలమని అన్నారు.

ఆ వార్తతోపాటు ప్రచురించబడిన ఫొటోలో విద్యామంత్రి, వేణు, మధూ రవి తదితరులున్నారు.

పేపరును మడిచి పక్కనుంచింది రమ.

ఆ ఫొటోలో వేణు ఆమెకు బొత్తిగా నచ్చలేదు.

ఉద్యమం చీలిపోకుండా ఉండాలనే వేణు స్వరాజ్యపతిని, వాళ్ళ మనుమల్ని అంగీకరించినట్లు రవి ఓ రోజు వచ్చి ఆమెకు నచ్చజెప్పబోయాడు. అలా చేస్తున్నకొద్దీ వేణు తప్పుచేసాడన్న భావన స్థిరపడసాగింది. రవి మంచితనం మీద ఉన్న నమ్మకం అతని తెలివితేటల మీద లేకపోవడంవలన వేణు సులువుగా అతన్ని బుట్టలో వేసినట్లు ఆమెకు తోచింది. వేణు తప్పుచేసాడు. అయితే నువ్వు ఆ మనిషిని వదిలేస్తావా? సరయిన దోవలో పెట్టే ప్రయత్నం నీకర్తవ్యం కదా? స్నేహమంటే యింతేనా?- ఈవిధంగా హృదయం పోరసాగింది.

ఆసాయంత్రం బజారులో రాధ తారసపడింది.

''మరీ నల్లపూసవయిపోతున్నావు?'' అంది రమ.

''కాలేజీలు లేవుగదా!'' బలవంతంగా నవ్వుతూ అంది రాధ.

''మంత్రివర్యుడు మాట యిచ్చాడుగా! ఉద్యమం ఆగిపోతుంది. కాలేజీలు తెరిచేస్తారు''

''ఆహా... అలాగా! ఏమో అన్నీ నీకేముందు తెలుస్తాయిలే''

రాధ గొంతులో ధ్వనిని అర్థంచేసుకునే వాతావరణంలో రమ పెరగలేదు. ఆ గొంతును లోగడ గుర్తుపట్టినపుడు అదో స్టైల్ కాబోలు అనుకుంది.

''పేపర్లో చూశాను, నాకూ తెలీదు''

''ఏం? వేణుతో నువ్వు వెళ్ళడం లేదా!''

''లేదు'' ముక్తసరిగా అంది.

''ఎందుకూ?'' విస్తుపోతూ అడిగింది.

''వేణు పద్ధతి నాకు నచ్చడంలేదు''

రాధ ఆలోచనలు పరిపరివిధాల పోయాయి.

''ఏంచేసాడు?'' కుతూహలంగా అడిగింది.

''ఏంచేస్తాడూ-చిచ్చీ!'' అంది రమ.

ఏంచెప్పాలో తెలియకే అలా అంది. రాజకీయనాయకులకు తొత్తుగా మారాడని చెప్పాలి. తండ్రి రాజకీయనాయకుల గురించి మాట్లాడినది ఆమె ఆలోచనా విధానాన్ని మార్చలేదు గానీ కొన్ని ఆలోచనలను చెల్లాచెదురు చేసింది.

''మా యింటికి రాకూడదూ?'' అంది రాధ- ఆమె భుజంమీద చెయ్యివేసి.

''యిప్పుడా?'' టైము చూసుకుంది.

''మా అన్నయ్య వెళ్ళిన దగ్గర్నుంచీ అమ్మ

ఏదోపని అంటగడుతోంది. షాపింగ్ చేసుకుని పోదాం!రా'' అంటూ బలవంతపెట్టింది. రమ ఏదో దాటవేస్తున్నట్లు రాధకి అనిపిస్తోంది. అదేదో తెలుసుకోవాలన్న కుతూహలం పెరుగుతోంది.

షాపింగ్ అయ్యాక ఆటోలో యింటిముందు దిగారు.

లోపల వరండాలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు వేణూ, సీతారాం. వాళ్ళని చూస్తూనే సీతారాం ఉత్సాహంగా అన్నాడు-

''చూసావా రమా! మన వేణూ మంత్రిగారితో వాదించి తన దోవకు లాక్కొచ్చాడు. మొత్తంమీద ఉద్యమాన్ని సఫలం చేశాడు''

రమ వేణువయిపు చూసింది. పలకరింపుగా నవ్వాడు. రాధ విసవిసానడుచుకుంటూ లోపలికి వెళ్ళింది. రమ తాపీగా వెళ్ళి ఓ కుర్చీ ఆక్రమించింది.

''ఇందులో పొంగిపోటానికేముందంకుల్?'' ప్రశ్నించింది.

వేణు అదే అన్నాడు. అయితే అది మోడెస్టీగా కన్పించి అతనివల్ల గౌరవాన్ని అభిమానాన్నీ పెంచాయి. కాని, రమా అదే అనటంతో కొద్దిగా షాకయాడు సీతారాం.

''అదేంటమ్మా! అంత తేలిగ్గా తీసేసావ్? చిన్నిపాయింట్ ఒప్పుకోటాన్కి మా ఆఫీసర్లకి ఎంతగా ఎగో అడ్డుపడుతుందో తెలుసా? డబ్భైయ్యేళ్ళ మొండిఘటం ఆయన. అందులోనూ మంత్రి. అలాంటి పెద్దమనిషితో ఇంత చిన్నవయసులో వాదించి నెగ్గుకురావటం అల్లాటప్పావనేమీకాదు''

తిక్కసమాధానంతో ఆయనని గాయపరుస్తుందేమోని వేణు అందుకున్నాడు.

''ఉద్యమం సఫలమవాలని రమా కోరుకుంటుందంకుల్! అది ఒక్కళ్ళవల్ల కాదూ అందరి సమిష్టి కృషీ అని మా అభిప్రాయం''

''సరైన నాయకుడు లేని ఉద్యమం పుబ్బలోపుట్టి మఖలో మాసిపోతుంది. దీనికి నువ్వే కారణం వేణు''

రమ చిన్నగా నిట్టూర్పి – ''రాధతో మాట్లాడంకుల్–!'' అంది.

లోపల శారద ఎదురయింది. సీతారాంలో మునుపటి గాంభీర్యమూ, ముభావమూ, గుంభనా తగ్గటం శారద గమనించింది. వాసూ గురించి బెంగతో ఏమయిపోతాడోనని తల్లడిల్లిన ఆమెకు ఆ మార్పు కొంత తృప్తిగానే ఉంది. వాసూని వేణూలో చూసుకోడం ఆమెకు కడుపులో తిరుగుతున్నట్లనిపించినా తననితాను సంబాళించుకోడం ఆమెకు వాంఛనీయమయిన మార్పుగా అనిపిస్తోంది. ఆ మార్పుకి కారణం వేణూ అనిపించే కొద్దీ అతని వల్ల దగ్గరతనాన్ని ఫీలవసాగింది.

''– ఏమ్మా! బాగున్నావా!'' పలకరించింది.

డాబామీద చల్లగా ఉంది.

నగరం చెట్లను తొడుక్కుని దీపాలమాలలు చుట్టుకుని నవ్వుతూతుళ్ళుతూన్నట్లుంది. రాధ మల్లెపూలనుమాలగా గుచ్చుతోంది. రమ ఆమె పక్కనే కూర్చుంది. మల్లెపూలను చేత్తో పట్టుకొని వాసన చూసింది.

''నీకూ ఇష్టమా?'' అడిగింది రాధ.

''పూలంటే ఎవరికిష్టముండదూ''

''మరి ఎప్పుడూ పెట్టుకోవేం?''

''మగాళ్ళకీ ఇష్టమే! పెట్టుకోరుగదా! చూసి ఆనందిస్తారు- నేనూ అంతే!'' అంది ఓ మొగ్గను పరిశీలనగా చూస్తూ.

''చిత్రమయిన దానివేనువ్వా! అవునూ వేణూకీ మల్లెపూలు ఇష్టమా?''

''ఏమో మరి! ఓమారు అతని గదిలో మల్లెపూలు చూశాను. కొన్నావా అంటే అవునన్నాడు. ఎందుకూ అంటే ఓ మిత్రుడికోసం అన్నాడు. ఈ నగరంలో దాదాపు ఏడాదంతా మల్లెపూలు దొరుకుతాయిట. ఆ మిత్రుడు తన బండిమీద వేసుకుని అమ్ముతాడట! అతనికి ఇతని బోణీ యిష్టంట!''

మధ్యలో అంది రాధ—''ఇంతకీ వేణూ ఏంచేసాడే! కోతివేషాలేస్తే చెప్పు—పళ్ళు పీకి చేతిలో పెడదాం''

''ఛా... వేణూ అంత మీన్‌ఫెలో కాదు''

''ఓహో... అయితే ప్రేమలో అలక అన్నమాట'' డిజప్పాయింట్‌మెంట్‌ను కప్పిపుచ్చుకుంటూ అంది.

''ఛత్! నోర్మూయ్'' అంది రమ అప్రయత్నంగా. తండ్రితో ఈ ప్రేమ అన్నదాని గురించి దీర్ఘంగా చర్చించింది. అప్పుడు కలగని పులక




రింత ఏదో యీ స్నేహితురాలి మాటతో కలిగింది. ఎందుకనీ రమ ఆలోచనలో పడింది.

గొప్ప నిరాశగా కసిగా ఉంది రాధకు.

"వేణూ నిన్ను ప్రేమించనన్నాడా?"

అంతవరకూ రమ ఓ స్థితిలో ఉంది. వేణూ చర్యలు నచ్చక అతన్ని కలియటంలేదు. తన నితాను విశ్లేషించుకునేందుకు తండ్రితో మాట్లాడబోయింది. మాట్లాడాక చేసిన ఆలోచనలతో వేణూలో ఎంచటాన్కి లోపమూ కన్పించలేదు. మెచ్చటానికి గుణమూ కన్పించలేదు. హృదయం క్రమంగా అతనిలో లోపం ఉందని నమ్మించజూసింది.

రమ రాధలోని మార్పులు గమనించలేకపోయినది. రాధ సూటిగా వేసిన ప్రశ్న ఆమెకి మోటుగా అయిష్టంగా తాకింది.

"నేను అతన్నేం ప్రేమించటంలెదుగానీ ఆడదానికీ మగాడికీ మధ్య యిష్టాయిష్టాలకు ప్రేమ తప్ప మరే కారణమూ ఉండటానికి వీల్లేదా?"

రాధకి జవాబు తోచలేదు.

"నీ వాలకం , ఏదో దాచుతూన్నట్లు ఉంటే యిందులో ఏదో ఉందనుకున్నాను. కోపం వచ్చిందా?"

"నాకూ అర్థంకావటంలేదు రాధా. స్త్రీ పురుషుల మధ్య ప్రేమో సెక్సో అనేకానేక విషయాలను నిర్ణయిస్తుంది కాబోలు. పైవాళ్ళని అనడమెందుకుగానీ. మన లోలోపల మనమీద మనకే ఒక్కోమారు సందేహం కలుగుతుంది. ఇంకా లోతుకి వెళ్ళి ఆలోచిస్తే యీ సమస్య తూర్పుదేశాల స్త్రీ పురుషుల మధ్య ఉన్నంతగా పశ్చిమదేశాలలోఉండే అవకాశం లేదేమో. ప్రేమ, సెక్స్ దేన్నయినా వాళ్లు విడివిడిగా తీసుకునే వ్యక్తిత్వం లేదా ప్రవృత్తి అదీ కాకుంటే సంప్రదాయం ఉందేమో?"

రమకి తండ్రిలాగే మాట్లాడే అలవాటు రాధ ప్రపంచం వేరు. రమ మాటలు ఆమెకి అర్థమయీ అవనట్లున్నాయి. అర్థమయినట్లుండటాన్కి కారణం అది రమ వేణూల సంగతి కావడం. కాకపోడానికి కారణం రమ మాటలు ఎప్పుడు అర్థం కాకపోటమే.

"ఏంటో నీగోల నాకు తెలీదుగానీ వేణూ నాకు తెలుసు గనక నీకెలాంటి మాటసాయంగావాలన్నా నాతో చెప్పు"

ఆ మాటలు రమకి చాలా స్నేహంగా అన్పించాయి.

టైము చూసుకుని "తప్పకుండానూ" అంది.

సీతారాం దగ్గర సెలవు తీసుకొని వెళ్లబోతూ ఉంటే వేణు కూడా బయలుదేరాడు.

సీతారాంకి ఆరోజు పేపర్లో ఫొటో చూసినదగ్గర్నుంచీ బెంగ తీరినట్లుంది.

ఆ వేణూని గుడిసెలలో తోపుడుబళ్ళవాళ్ళతో కలిసిమెలసి చూసినప్పుడు పుట్టిన భయం. రాధకీ వేణుకీ మధ్య సాన్నిహిత్యం కన్పించినప్పుడు పెరిగిన భయం. మంత్రిగారితో ఫొటోలో చూసినప్పుడు ఎందుకు తగ్గుముఖం పట్టిందో. సీతారాంకి తెలియదు. దాన్ని గుర్తుపట్టే శక్తి అతనికిలేదు.

* * *

"మధూ అరెస్టయ్యాడు రాజా"

ఆందోళనగా ఉంది భూషణంగొంతు. అవతలినుంచి రాజు గొంతు వినపడటంతో ఫోను మీదున్న చేతులు బిగుసుకున్నాయి.

మధా? వాడెవడూ?

నా చెల్లెలి కొడుకు. మా కాలేజీల్లో ఒకదాని స్టూడెంట్ యూనియన్‌కి ప్రెసిడెంట్.

అదీ కథ! చెల్లెలి కొడుకుగదా! మునగచెట్టెక్కించేశావు.

నేనేం చేశాను.

నీ చెప్పుచేతల్లో ఉన్నవాడని నీ కాలేజీ యూనియన్‌కి ప్రెసిడెంట్ చేశావు.

స్టూడెంట్స్ గొర్రెలు కాదు నేను చెప్పినాడికి ఓటు వెయ్యడాన్కి. వాడికి సరదా ఉంది. వద్దంటే మానతాడా? అయినా యూనియన్లోకెళ్తే చెడిపోయినట్టేనా?

కథలు చెప్పకగానీ యింతకీ అతగాడు అరెస్టయిన కతంబేమీ?

తెలీదు. మూడుగంటల రాత్రివేళ ఎవడో ఫోన్‌చేశాడు. మా మిసెస్ రిసీవ్ చేసుకుంది. ఆ రాత్రివేళ లేచి నేనేం చేస్తానని లేపలేదుట. లేచాక చెప్పింది. అప్పట్నుంచి నీకోసం ఫోన్ మీద ట్రయ్ చేస్తున్నాను.



"నేనేం వకీలునా పోలీస్ కమీషనర్‌నా నాకోసం ట్రైచెయ్యటానికి? ఉత్తి కాంట్రాక్టులు కాదు కాదు తాబేదారు పనులు చేసుకునేవాడిని"

"రాజూ! అంత సర్కాస్టిగ్గా మాట్లాడక! మా ఫాదర్ ముసలితనం కొద్దీ నోరుజారాడు. సారీ చెప్పుకున్నానుగదా! ఈ వూళ్ళో కాలేజీ పెట్టిన ప్పటినుంచీ మనమధ్య స్నేహం! యిలాంటి ప్రాబ్లం నీవు కాపోతే ఎవరు సెటిల్ చేస్తారో చెప్పు! - ఎప్పుడు వస్తావ్?"

"భూషణం! నీ కొడుకయితే వెంటనే పరిగె ట్టుకువద్దువు! సర్లే - నేను వస్తాను" అంటూ ఫోన్ పెట్టేసాడు.

వెంటనే రమ్మందామనుకున్నాడు భూ షణం. వీలవలేదు.

ఒంటిగంటయిపోయింది. రాలేదు రాజు. అనవసరంగా అతనితో పెట్టుకున్నానన్న విచారం పెరిగిపోతోంది. తను ఏ వకీలునో తీసుకువెళ్తే రాజు ఎలా తీసుకుంటాడోనని సంశయం.

రాత్రి భోజనాల దగ్గర ఉదయం ఫలహా రాల దగ్గర కూడా కనపడకపోవడంతో మధూ ఏడని ప్రశ్నల వర్షం కురిపించేస్తున్నాడు ము సలాయన.

ఒంటిగంటన్నరకు రాజు ఫోన్ చేసాడు.

"- వెంటనే వస్తావనుకున్నాను - మా నాన్న ప్రాణాలు తోడేస్తున్నాడు"-

"నీ కంగారు నాకు అర్థమవుతోందిగానీ మధూ కథ విను. మన హీరో మందు కొట్టేసి తిన్నగా ఉండక ఆచేత్తో ఓ కుర్రాడిని - చూస్కోనా తడాఖా - అని కొట్టేసాడట. వాడు కళ్ళు తేలేసి కిందపడిపోతే హాస్పటల్‌కి, వీడిని స్టేషన్‌కి మోసుకుపోయారట! ఆ సబ్ మహామొండిఘటం! ఏకంగా ముగ్గురు కూతు ళ్ళుట. మరీ బరితెగించి యస్సయ్‌గారి అమ్మాయ్ అని చూడకుండా అల్లరి చేస్తున్నా రుట. దాంతో కాస్త జుత్తు పెంచుకుని పదులు బట్టలేసుకుని స్టూడెంట్‌లా అనినవాడినల్లా ఓ రేవు పెట్టేస్తున్నాడట! మనాడు వెళ్ళి వెళ్ళి ఆ పెద్దమనిషికి దొరికిపోయాడు. రెండేమూడో వదిలేసి మిగిలిన ఎముకలన్నీ విరిచేసి-"

"రాజూ!" కంగారుగా అన్నాడు భూషణం.

"కొంపలు మునిగినట్టరవక! కనెక్షన్లు ఊడి పోగలవు ! విశ్రాంతి తరవాత కథ రక్తి కడు తుంది. మనాడు దెబ్బకీ తప్పులన్నీ ఒప్పేసు కుంటూ స్టేషన్లో ఆ సబ్ చెప్పినచోటల్లా సంతకా లు గుద్దేసాడు—"

"అయితే యిప్పుడేం చెయ్యాలి?"

"నువ్వు చేసేదేంలేదు. మధూ కాస్సేపట్లో నీ యింట్లో ఉంటాడు"

"థాంక్యూ... థాంక్యూ వెరీమచ్ రాజూ!"

"నాక్కాదు చెప్పాల్సింది. కథ పూర్తిగా విను! లాకప్‌లో మధుని మర్దించారన్న వార్తతో రెండు మూడు వందలమంది కుర్రాళ్ళు పోగ యిపోయారు. నానారభస అయిపోయింది. ఇలా కింద నుంచి పొగపెట్టేస్తూనే పైనుంచి డి.జి.పికి హోంమంత్రికీ పెద్దలెవరో ఫోను చేసి చెమటలెక్కించేసారు. చావుదెబ్బల్తో మూ లుగుతున్న మధుకి— తమ ప్రియతమ నాయకుడికి— దండవేసి భుజాలమీద వేసు కుని కుర్రాళ్ళు రోడ్లమీద ఊరేగుతున్నారు"

"వాడింకా రాలేదేం మరీ?"

"వస్తాడులే! విజయోత్సవంలో ఉన్నాడు గదా"

"ఇంతకీ ఎవరాపెద్దలూ?"

"మనకా సమాచారం యిచ్చేటంత తెలివి తక్కువ్వాళ్ళు నా ఎరికలో పోలీసుల్లో ఎవరూ లేరులే—"

మధూ యిలాంటి గొడవల్లో ఉన్నాడని తెలి స్తే ముసలాయన తనయినా మంచమెక్కేస్తా డు, నన్నయినా ఎక్కించేస్తాడు—అను కుంటూ ఫోను దించాడు భూషణం.

సరిగ్గా అనుకున్నట్టే అయింది.

"నువ్వేదో దాస్తున్నావు—" సాయంత్రం గట్టిగా పట్టుకున్నాడు తండ్రి. ప్రాణం విసుగె త్తిన భూషణం జవాబివ్వలేదు. ఇంతలో ఫోను మోగింది.

ఫోను వింటున్న భూషణం 'హలో... హలో అంటూ అరిచాడు. ఆ మీదట కోపంగా తండ్రి వయిపు వచ్చాడు.

"చూసావా... నీ ముద్దులమనవడు— నేను వెళ్ళి ఆయనగారిని పోలీసుల్నించి విడిపించి భుజానికెత్తుకుని యింటికి తెచ్చుకోలేదుట. చూడు... నిన్నేం చేస్తానో అంటూ వాగుతున్నా




డు. రానీ, తన్నితగలేస్తాను''

భూషణం ఈ ధోరణిలోనూ—

''నువ్వు కాదా వాడినిలా తగలేసావూ. నీ కొడుకయితే యిలా చేస్తావా? చచ్చి స్వర్గానున్న నీ చెల్లెలి ఆత్మ ఎంత క్షోభిస్తుందో'' అంటూ తండ్రి అరిచాడు.

వాళ్ళకన్నా రెండు మూడు తరాల ముందే నాలుగయిదురాళ్ళు వెనకేసి విశాలమయిన భవంతులు కట్టుకొని మృదువుగా మాట్లాడు కోటం, మెత్తగా హింసించుకోటం, పరిష్కారాలకు కోర్టులను ఆశ్రయించటం వగైరా విధానాలను సంస్కారంగా అలవర్చుకున్న కుటుంబంలోంచి వచ్చింది భూషణం భార్య. ఆవిడకు భర్తా తండ్రీ వాళ్ళ పెద్ద గొంతుకలూ మాటలతీరూ దిగువ సంస్కారంగా అనిపించి కాపురాన్ని వదిలేసుకుందామనుకుంది. అయితే ఆ దిగువ సంస్కారులకు వివాహవ్యవస్థ మీద ఆమెకు అర్థంకాని పట్టేదో ఉండటం ఆమెకు కొంత కన్వీనియెంట్‌గా అన్పించి క్షమించెయ్యడం అలవరుచుకొంది.

ఆవిడ భర్తను శాంతపరచి లోపలికి తీసుకు వెళ్తుంటే—

''నాకొడుకుతో నాకు మాట్లాడుకునే వీలు కూడా లేదు—''అరిచాడు తండ్రి.

విషయమంతా విన్న భార్య—''అసలే బీపీ మనిషివి. నువ్వెందుకలా ఆవేశపడటం? యింట్లోంచి పంపేస్తే సరిపోతుంది—''అని సలహా యిచ్చింది.

''ఎక్కడికి పోతాడూ? బెదిరిస్తానంతే—''

''పంపెయ్యటమూ బెదిరించడమే!—''అంది.

ఆరాత్రి రాలేదు మధు. మర్నాడు ఉదయం వచ్చాడు. ఎవరినీ పలకరించకుండా పోయి తన గదిలో తలుపులు బిగించుకున్నాడు. మూడుగంటల సేపు నిరీక్షించాడు భూషణం. తర్వాత తన గదిలోకి రమ్మని కబురుపెట్టాడు. గంటపోయాక శుభ్రంగా తయారయి వచ్చాడు మధు.

''నీ పద్ధతి నాకు నచ్చలేదు. నా కాలేజి డిసిప్లిన్‌కి మారుపేరు. నీ వ్యవహారం మార్చుకోకపోతే'' శాంతంగా మొదలుపెట్టాడు.

''నేను యూనియన్ ప్రెసిడెంట్‌ని. మీరు నన్ను కాలేజీ నుంచి బయటకు పంపలేరు'' పొగరుగా అన్నాడు మధు.

ఇంట్లోంచి పొమ్మన్నాడు భూషణం. వాడు పోడు- అన్నాడు తండ్రి. అయితే నచ్చచెప్పు- అన్నాడు భూషణం. ''నాకెవరూ నచ్చచెప్పక్కర్లేదు. నన్నెలా పంపుతారో చూస్తాను'' అన్నాడు మధు.

పెద్దపెద్ద కేకలు వేశాడు భూషణం.

అన్ని కేకలూ వేసి ఆ మనిషి తననేమీ చేయలేకపోవడం అర్థమయ్యాక మధూ గర్వంగా కాలరెగరేసాడు. బయటకి పోయాడు.

తన ముందు పిల్లిలా ఉండే మధు ఒక్కమారుగా ఇంత బరితెగించాడూ—? భూషణం విస్తుపోయాడు..

నువ్విచ్చిన కొమ్ములే నిన్ను పొడిచేయన్నాడు తండ్రి. అదీ ఒప్పుకోబుద్ధవలేదు.

ఆ రాత్రి ఎనిమిది గంటలకు ప్రసిద్ధి చెందిన రెస్టారెంట్‌లో ఫ్లోర్ షోస్‌లో కాబరే ఊపును చూస్తూ మధు తన కొత్తస్నేహితుడితో అన్నాడు-

''—నువ్వన్నది నిజమే బ్రదర్! ఈ లోకంలో నువ్వు తోకజాడిస్తేనే ప్రతివెధవా తోక ముడిచేస్తాడు—''

ఆ పార్క్‌లో ఒత్తుగానున్న గడ్డి మీద పడుకుని ఆకాశంలోకి చూస్తున్నాడు వేణు. రమ వస్తుందా...? అన్న ప్రశ్న చుట్టూ ఆలోచనలు తిరుగుతున్నాయి. ఆరోజు సీతారాం ఇంట్లోంచి వస్తున్నపుడు ఆమెను ఒక్కమారు రమ్మని కోరాడు. జవాబీయలేదు రమ. ''ప్రిన్సిపుల్స్ నుంచి దిగజారావు నువ్వు'' అంది నొక్కినొక్కి అడిగితే!

దూరం నుంచి వస్తున్న ఆకారాన్ని చూసి లేచి కూర్చున్నాడు. రమ సింప్లిసిటీకి మారుపేరులా ఉంటుంది. సింప్లిసిటీ ఆమె ఆవేశాలకు అద్దంలా ఉంటుంది.

రమ వచ్చి కూర్చుంది. వేణూ ఆమెనే చూస్తున్నాడు. క్షణాలు గడుస్తున్నాయి.

''ఎందుకు రమ్మన్నావ్?'' అడిగింది సూటిగా.

''-నేను ప్రిన్సిపుల్స్ నుంచి దిగజారాను. సరే... కనీసం కొన్నింటిలోనయినా నాకు ప్రిన్సిపుల్స్ ఉన్నాయో లేవో పరిశీలించుకుందుకు





రమ్మన్నాను-"

"డొంకతిరుగుడు నీకునచ్చదు వేణూ! నువ్వు తిన్నగానే చెప్పాలి-"

"నువ్వు రావటం నామీద నాకు చాలా నమ్మకం కలిగించింది- థాంక్స్!"

రమ జవాబీయలేదు.

"నీతో నేను చర్చించాలనీ నా ఆలోచనలు సరిచూసుకోవాలనీ అనుకోటానికి ఓ కారణం ఉంది రమా!"

ఏమిటది అన్నట్లు చూసింది.

"సాధారణంగా మన అభిప్రాయాలని అంగీకరించేవాళ్లనే మనం సమీపంగా రానిస్తాం! నేనెరిగిన ప్రపంచం గురించి నా ఆలోచనలను ఓ వ్యక్తితో పంచుకునేవాడిని. అతను నా కార్యక్రమాలలో ఎప్పుడూ ప్రత్యక్షంగా భాగం తీసుకునేవాడుకాదు. తన అభిప్రాయాన్ని చెప్పేవాడు. వాటిల్లో కొన్ని నాకు మింగుడు పడేవికావు. వాటిని నేను అంగీకరించలేకపోయేవాడిని. కానీ అతను వెళ్లిపోయాక అతను లేనిలోటు నీవల్లతీరేది-"

"ఎవరతను?"

"వాసూ. రాధ అన్నయ్య. ఇంట్లోంచి వెళ్ళిపోయాడు"

"అవునవును... విన్నాను"

"నేనిప్పుడు చెప్పేవిషయాలను నువ్వు రాధకిగాని అంకుల్‌కిగాని చెప్పకూడదు"

"చెప్పను-"

"వాడు ఇంట్లోంచి వెళ్ళిపోదామన్న నిర్ణయంతో నన్ను కలిసాడు రమా! వాడి మాటలు విని "నువ్వుచాలా ఆవేశంలో ఉన్నావు వాసూ! కాస్త నిదానంగా ఆలోచించు-" అన్నాను.

"నిజమే... నేను ఆవేశంలోనే ఉన్నాను. కాని ఆలోచనారహితంగా మాత్రంలేను. వివేకానందుని పుస్తకాలనూ, గీతనూ పారాయణం చేస్తాను నేను. నువ్వు వివరించే మార్క్సిస్టు ఆలోచనలను అర్థంచేసుకునేందుకు ప్రయత్నిస్తాను నేను. ఈ రోజు మానాన్నగారి ఆవేశాన్ని రుచిచూసివున్నాను నేను. ఆయన ఎందుకు ఆవేశపడ్డారు? భయంతో! నావరీక్ష ఆయనవంటి నిదానపరుడుకి జీవన్మరణ సమస్య అయినా కాకపోయినా ఆయన బాలన్స్‌ని తప్పించింది. నా ఆలోచనలన్నీ నీకు వివరించలేను వేణూ! ఇక్కడ చదువులు వ్యక్తులను తయారుచేయవు. బానిసలను చేస్తాయి. ఈ వ్యవస్థవల్ల లాభపడేవర్గాలకు తెలివిగా కాపలాకాసే కుక్కలుగా బరువులుమోసే ఎనుబోతులుగా అమరుస్తాయి ఈ చదువులు. అదే సమస్తమనుకునే భ్రాంతిని కలిగిస్తాయి- ఇలాంటివెన్నో నువ్వు చెబుతుంటావు. నిజంగా వాటిని నువ్వు నమ్ముతావా? నాకు తెలీదు. కాని నేనీరోజు వరకూ నమ్మలేదు. మానాన్నగారి స్వరూపాన్నీ అలజడినీ చూసాక నేను వాటిని నిజమేనని నమ్మాను. నమ్మని చదువులను చదవటం- వ్యవస్థలో కలిగే లాభాలను వాడుకుంటూ దానిని నిందించటమూ నీవు చేయగలవు! నీది హిపోక్రసీ! నా బుద్ధిమేరకు హిపోక్రసీని నిరాకరించే గ్రంథంగీత. అది మత గ్రంథం కాదు. ఓ ఆలోచనా ప్రేరకమయిన పుస్తకం. దురదృష్టవశాత్తూ కొన్ని అద్భుత గ్రంథాలు మతాలకు చిహ్నాలుగా గౌరవమందుకోవటంవల్ల- అవి సాధించగలిగిన ఫలితాలను సాధించలేకపోయాయి. సిద్ధాంతాన్ని నమ్మినవాడు దానిని ఆచరించవలసిందే! యుద్ధంచేయవలసిన అగత్యం ఎదురయినపుడు చేయవలసిందే! ఇందులో మినహాయింపులు లేవు. నీలో ఏదో ప్రలోభముంది. ఇక్కడ నలుగురిని పోగుచేసి వాళ్ళకేవో కొన్ని సదుపాయాలు కలిగించటంలో నీకీ సమాజంలో పైకిపోయే వీలేదోఉంది. అందుకే నువ్వు ఇక్కడ ఉన్నావు. నేను ఉండను! నీ సిద్ధాంతంతో నేను కన్విన్స్ అయాను. నా ఈశ్వరభావనతో నా విశ్వాసంతో నువ్వు కన్విన్స్ కాకపోవచ్చు. నీ సిద్ధాంతం నాదయింది. దాని కోసం నిలబడేశక్తి నా విశ్వాసం నుంచి నేను పొందటం విడ్డూరంగా ఉన్నా అభ్యంతరకరంగా ఉన్నా నాకు అభ్యంతరమూలేదు- నీతో నేను వాదనకూ దిగను-

-వాసూ అలా చెప్పాడు రమా!"

వేణూ ఆగాడు. తన ఆలోచనలు వివరించకుండా ఓ రిపోర్టులా చెప్పాడు. రమకి వేణూ మాటలు వింటున్నంతసేపూ తండ్రే గుర్తువచ్చాడు.

"అయితే వాసూ ఎక్కడున్నాడూ?" కుతూహలంగా అడిగింది.

"తెలీదు-"



"ఎక్కడికెళ్ళాడూ?"

"అవసరమయినపుడు చెబుతాను"

"వాసూ మాటలతో నువ్వు ఏకీభవించావా?"

"లేదురమా"

"అయితే అతని గురించి ఎందుకు చెప్పావూ?"

"నువ్వు అతనిలా ప్రవర్తించటం లేదని గుర్తుచేయటానికి! అభిప్రాయాలు నచ్చకపోయినా మేం ఒకరితో ఒకరు చర్చించుకునేవాళ్ళం"

"నేనలా చేయటం లేదంటావు"

"అనేకదా నేననేది"

"ఎందుకు చేయటంలేదో అదీ నువ్వేచెప్పు"

"చెప్పాలనే ఉంది కానీ.." సంశయంగా ఆగాడు.

"నేను ఆవేశపడనులే చెప్పు"

"వాసూ నన్ను వదిలెయ్యకపోటానికి, నువ్వు నన్ను వదలగొట్టుకోవాలనుకోటానికి కారణం- నువ్వు స్త్రీవీ అతను పురుషుడూ కావటమేనని నా అనుమానం"

"పురుషులకున్నంత సహనం స్త్రీలకుండదని నీ అభిప్రాయం. పోనీ అనుమానం"

తెల్లబోయాడు వేణు. మెల్లగా తేరుకుని-

"నామాటలకు అలాంటి అర్థంకూడా వస్తుందన్నమాట-! సర్లే... స్త్రీలకి క్షమయా ధరిత్రి అన్నపేరుండగా నేనలా అన్నా నిలబడదులే!"

"సరే... నీమాటకు అర్థం అదికాదు. నాలో నీక్కనిపించే అసహనం. మొత్తం స్త్రీలకందరికీ అంటగట్టడం బావుందా?"

"సారీ రమా! యిందులో సహనాసహనాల ప్రసక్తిలేదు. నువ్వునన్ను సరిగ్గా వింటానంటే చెబుతాను-"

"మానాన్నగారి దగ్గర అలవాటే! చెప్పు-"

వేణు కొంతసేపటిదాకా మాట్లాడలేదు. తర్వాత మెల్లగా అన్నాడు-

"ఏదయినా విషయాన్ని అర్థంచేసుకొనేశక్తిలోనూ, దానిని వివరించే సామర్థ్యంలోనూ స్త్రీపురుషులమధ్య చెప్పుకోదగ్గంత తేడాఉండదు రమా! అయితే ఏదయినా విషయం చర్చకువచ్చినపుడు ఒకరితోఒకరు అంగీకరించటానికైనా విభేదించటానికయినా వారివారి అభిప్రాయాలే కారణమవకుండా వారు స్త్రీపురుషులు కావటంకూడా కారణమవుతూంటుంది! ఎందుకిలా అవుతుంది?-"

రమ ఆలోచనగా చూసింది. వేణు కొంచెం ఆగి మళ్ళా ప్రారంభించాడు-

"సంచార జీవితం నుంచి మనిషి స్థిరనివాసమేర్పర్చుకుంటున్న దశలో గృహనిర్వహణ కోసం స్త్రీపురుషులమధ్య పని విభజన జరిగిందని ఓ వాదన ఉంది. అప్పటినుంచి ఆధునికకాలంవరకూ వాళ్ళువాళ్ళుచేస్తున్నపనుల తేడావల్ల వారివారి ఆలోచనాజీవితం రూపుదిద్దుకుంది. చివరికి ఒకరు పూర్తి యజమానిగానూ, ఒకరు పూర్తి బానిసగానూ మారారు. యజమానికి తన ఆధిపత్యాన్ని వదులుకోవాలన్నా- బానిసకి తన బానిసత్వం నుంచి బయటపడాలన్నా ఎలాగో గట్టిగా అర్థంకాని అయోమయస్థితి. ప్రేమకూ బానిసత్వానికీ- బాధ్యతకీ ఆధిపత్యానికీ మధ్యనున్నరేఖలు అర్థంకాని స్థితి. రమా... ఇప్పుడు స్త్రీ బానిసత్వంలో ఉన్నానని గుర్తుపట్టింది. దానినుంచి బయటపడాలని ప్రయత్నం చేస్తోంది. పురుషుడి ఆధిపత్యానికి ప్రత్యామ్నాయం స్త్రీ ఆధిపత్యమే- అన్నధోరణి పెరుగుతోంది. ఓ విధంగా చూస్తే పాతభావాల బానిసత్వం నుంచి బయటపడటానికి కొత్తభావాల బానిసత్వాన్ని స్వీకరించటం జరుగుతోంది. ముఖ్యంగా విద్యావంతులవుతున్న స్త్రీలు తమ సమస్యలనే స్త్రీలందరి సమస్యలుగా, తమకు కావాల్సిన ఆధిపత్యమే స్త్రీలందరికీ స్వేచ్ఛగా భావిస్తున్నారు. శ్రామికవర్గాల స్త్రీలూ గ్రామీణసమాజంలో అట్టడుగువర్గాల స్త్రీలూ వారిసమస్యలూ వారికి విముక్తి- కొందరు విద్యావతులు గమనించరు. విముక్తి అన్నది కొందరికి ప్రత్యేకంగా లభించే హక్కుకాదనీ, అది మొత్తం సమూహానికి లభించేదేనని వారు గ్రహించలేకపోతున్నారు. ఫలితంగా పురుషుడిని ప్రత్యర్థిగా ఓ విధమయిన ఇన్‌టాలరెన్స్‌తో చూడటమన్నది చదువుకుంటున్న స్త్రీలలో వ్యాపించింది. రమా... వాసూలా నువ్వు ప్రవర్తించకపోవటానికి నేననుకునే కారణం నీకు అర్థమ





అయిష్టం. అందుకే చర్చలు మెలికతిప్పుతూ అడ్డుపడుతున్నావు-" అన్నాడు మధు.

"నువ్వా? వేణా ఆ పనిచేస్తున్నది? ఆ రోజు నువ్వు తాగేసి మంత్రిగారిముందుకి రావటం-చిచ్చీ!" అన్నాడు రవి.

అతనిమాట పూర్తవకుండా మధూలేచి రవి మెడపట్టుకున్నాడు-

"పుచ్చెపగుల్తుంది! నువ్వెవడివిరా నాకు చెప్పటానికి? నేను తాగివస్తాను, తూలుతూవస్తాను. మా తాతా మామే నాకు లెక్కలేదు. ఈ ముసలి మంత్రిగాడు నాకేం చుట్టమా?"

మధు నుంచి రవిని విడిపించటానికి పెద్ద యజ్ఞమయింది.

వేణూ అన్నాడు-

"మధూ! నిన్ను తాగొద్దని ఎవడూ అనలేదు. కొన్నివేలమంది విద్యార్థుల భవిష్యత్తుకు మనం..."

"షటప్! నాకు నీతులు చెప్పాల్సిన పనిలేదు-"

వేణూ మిత్రుడు మధు భుజంమీద చెయ్యివేసి వెనక్కి లాగాడు. అతను ఇంటర్‌కాలేజీ పోటీల్లో బాక్సింగ్ ఛాంపియన్.

"నీకు నీతులు నేను చెప్తాను. ముందలా కూర్చో!"

ఆ బృందంలో దేనికీ సంబంధంలేనట్టు ఉంటాడతను. చాలా దృఢంగా ఉందతని గొంతు. మధు మిత్రుని చెయ్యి మధుని తగ్గమన్నట్టు భుజంమీద చరిచింది. మధు వెళ్ళి తనస్థానంలో కూర్చున్నాడు.

"ఇప్పుడు జరిగింది మనం ఇంతటితో మరచిపోదాం-" అన్నాడు వేణు రవిని తనకుర్చీలో కూర్చోమన్నట్లు చూస్తూ.

"-మనం ఎనమండుగురం ఏదయినా మాట్లాడుకోవచ్చు. ఓ నిర్ణయానికి వచ్చాక మాత్రం అందరం దానిమీదే ఉంటాం! విద్యామంత్రితో నాలుగోసారి కూర్చునేముందు"

"అనవసరం... మనం ముఖ్యమంత్రినే కలుద్దాం-" అన్నాడు మధు మిత్రుడు.

"ఆయనా రీజనబుల్ మనిషే. మనకి వెంటనే పరిష్కారం దొరుకుతుంది" రవి.

వేణు ఆలోచించి అన్నాడు-

"నాకు అభ్యంతరం లేదు. కాని ఫలితం యిలాగే వుంటుంది. స్వరాజ్యపతిగారి అధ్యక్షత కిందనున్న నలహాసంఘంతో తెగతెంపులు చేసుకున్నామని ముందుగా స్పష్టంచేసి చూడాలి-"

"ఈనిర్ణయం నువ్వొక్కడివే ఎలా చేస్తావ్?" అన్నాడు మధు.

నవ్వాడు వేణు- "అదే నేనన్నదీనూ!"

అతనంటూన్నదేమిటో మధుకి అర్థంకాలేదు.

"మనం తెగతెంపులు చేసుకున్నట్లు ప్రకటన ఇస్తాం! విద్యామంత్రి ధోరణిలో మార్పు కనిపించితే దానిమీద నిలబడిపోతాం! లేకపోతే-"

"ఇదంత తొందరగా తేల్చుకునేది కాదు. ఆలోచించి చెప్తాను-" మధు.

"ఇంతకన్న తొందరగా తేల్చేసావు ఒకప్పుడు-" అన్నాడు వేణు.

మధు సమాధానమిచ్చేలోగా రవి అన్నాడు-

"జరిగిందేదో జరిగిపోయింది వేణూ! పోస్టర్లకీ కరపత్రాలకీ మైకుసెట్లకీ స్టూడెంట్స్‌ని రప్పించటానికీ చాలా ఖర్చు చేసారు స్వరాజ్యపతిగారు. మన మేలుకోసం ఇప్పటిదాకా యింతపని చేసినవాళ్ళను యిలా వదిలేసుకోవటం న్యాయంకాదు. ఆయనతో ఆలోచించే ఆ పనిచేద్దాం-"

అనుకోకుండా లభించిన ఆ సపోర్టుతో మధు బృందానికి పట్టు దొరికింది. మరో యిద్దరు తటస్థులు రవి మాట బాగుందన్నారు.

వేణూ రవిని పట్టిపట్టి చూసాడు.

"సరే!" అన్నాడు.

* * *

"పొడిచెయ్యాల్సిందా రవిగాడిని-" అన్నాడు స్వరాజ్యపతి అనుచరుడు.

"బొక్కలోకెళ్ళిపోతాడు-" అన్నారొకరు.

"మనం యిక్కడ గాజులు తొడిగించుకున్నామా బొక్కలోకెళితే చూస్తూకూర్చోటానికి-! కోపం వచ్చిందని వాగి లాభమేమిటి? ఒక్కపోటుతో విషయం సెటిలయిపోయేది. తనని అక్కడ కూర్చోబెట్టింది మాట్లాడే గుమ





స్థాపనికేనని అర్థమయిపోయేది-"

"మనమాట వినవాడిని బయటికి నెట్టేస్తే సరిపోయేదానికి ఎందుకొచ్చిన తలగొక్కుడం-?" అన్నారొకరు.

"మనం గెంటేస్తే వాడు హీరో అయిపోతాడు. కుర్రనాకొడుకులంతా వాడిని భుజాలకెక్కించేసుకుంటారు! పెద్దవాళ్ళే చేస్తున్నారీపని దేశంలో యీనాడు!" అన్నాడు స్వరాజ్యపతి.

మధూ అతని మిత్రుడూ ఉలిక్కిపడలేదు.

మధు మొహంలో పౌరుషం- ఈసారి అలాంటి అవకాశంరానీ- చూపిస్తానాతడాఖా- అనుకున్నాడు. అయితే అసలాడు వేణుని వదిలేసి ఆ రవిగాడిని పొడవమంటాడెందుకూ-?

"ఇంతకీ యిప్పుడేంచెయ్యాలంటారూ-?"

అందరూ స్వరాజ్యపతివేపు చూసారు.

"ఎవరికీ తెలియనీకండి! సరిగ్గా పదిహేను రోజుల్లో వీసీ అమెరికాలో మీటింగ్‌కి వెళ్తున్నాడు. ఈ విషయం వీసీకే కన్ఫర్మ్‌గా తెలీదు. అప్పటివరకూ మనం దీన్ని యిలాగే కొనసాగించాలి. ఈమధ్యలో సీయమ్‌తో సిటింగ్ పెట్టుకోండి. సలహాసంఘం ఉండాలా వద్దా అన్నది ఆ సిటింగ్ తర్వాత చూద్దామందాం. మనం వెనకనున్నామని తెలిస్తే సీయమ్ అంత సులువుగా దేనికీ ఒప్పుకోడు. వీసీ దేశం విడిచిపెట్టిపోతున్నాడని- విద్యార్థుల భవిష్యత్తుని ఖాతరుచేయని ప్రభుత్వం వీసీని బయటకు పంపేస్తోందనీ- ఒక్కరోజులో నిప్పులా అంటుకుంటుంది. ఆ ఉడుకులో పోలీసు కాల్పుల్లో కొందరు పోతారు. దీంతో సీయమ్ మనకి దొరుకుతాడు. లా అండ్ ఆర్డర్‌ని ప్రభుత్వం కాపాడలేకపోయిందంటాం మనం."

"సీయమ్ మన కోర్కెలు ఒప్పుకుంటే-?" అన్నాడు మధు.

"నువ్వెందుకుందక్కడా... చంక నాకటానికా?" అన్నాడొకడు

"ఇష్టంవచ్చినట్లు మాట్లాడితే-" అంటూ కత్తి తీసాడు మధు.

"ఏం- ఏం చేస్తావూ? నీకు మందుపోసి పెల్లరిచ్చి జల్సాలకిచ్చి యింట్లోవాళ్ళు తగిలేస్తే కాచుకొస్తున్నాంగదా- పాడుప్ నన్నూ!"

మధుని బలవంతంగా బయటికి పంపేసారు. అతనితోబాటు అతని మిత్రుడు కొంత భయ్యాలకి తీసుకుని బయలుదేరాడు.

"ఈ గుంట వెధవకి ఎందుకిలా ఎక్కించేయటం-?" అన్నాడు జనాంతికంగా.

"ఇలాంటాడిని తయారుచెయ్యకపోతే మట్టిగొట్టుకుపోతాం! ఆ వేణుగాడేమయితే మనకేం? ఉద్యమం ఏమయితే మనకేం? సీయమ్‌ని బిజీగా ఉంచటమూ అన్‌పాపులర్ చెయ్యటమే మనపని! ఉద్యమం నడవటమే వేణుగాడి కర్తవ్యం! వాడు అదుపుతప్పితే టెర్రరైజ్ చెయ్యటానికే ఇలాంటి మధూగాడు! ఈ గుంటనాకొడుకుల్లో 'ఊఁ-' అంటే కలబడిపోయేవాళ్ళు పదిమందుంటేచాలు ఉద్యమాలు మన గుప్పెట్లో ఉంటాయి-" స్వరాజ్యపతి బోధపరిచాడు.

"తీరా వీడికి కొమ్ములు పెంచాక మనం హేండిల్ చెయ్యగలమా?" అన్నాడో సందేహాలరాయుడు.

"వెర్రోడా... లక్షలాదిమంది సైనికులని వాళ్ళ ఆకలి తీరుస్తామని వెర్రెత్తించటంలేదూ? బోలెడంత తెలివయినవాళ్ళని ప్రమోషన్లిస్తామనీ అవార్డులిస్తామనీ కొత్తకొత్త బాంబులు చెయ్యటానికి వాడుకోటంలేదూ- పదవులు ఎన్ని ఉద్యమాలూ పోరాటాలూ పుట్టించటంలేదూ గిట్టించటంలేదూ- ఇదొకటేనా? మన పెద్దలు ఈ టెక్నిక్‌ని స్టడీజేసేసి ఎప్పుడో ప్రాక్టీస్ చేసేసారు-"

"అందుకు బలయిపోయారుగూడా!"-

సందేహాలరాయుడు లోలోపల గొణుక్కున్నాడు-

* * *

"సీయమ్‌తో సిటింగా... అదెప్పుడూ?" అన్నాడు సీతారాం. అతని గొంతులో వెనకటి థ్రిల్‌లేదు. విద్యామంత్రితో మూడుసార్లు చర్చలు జరిగాయి. పరిస్థితిలో మార్పు లేదు. అలాంటప్పుడు సీయమ్‌తో అయితేనేం- పీయమ్‌తో అయితేనేం?

"నీలాంటివాడిక్కూడా డెమొక్రటిక్ నామ్స్ మీద నమ్మకం పోతున్నట్టుందేంటి?" అన్నాడు రాజు. సీతారాం అర్థంకానట్టు చూసాడు. వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటుంటే శారద కాఫీలు

తెచ్చింది. అన్నాచెల్లెళ్ళు పిచ్చాపాటిలోపడ్డారు. సీతారాం రాజు అన్నమాటను గురించే ఆలోచిస్తున్నాడు.

రాధ వచ్చి ఓమారు ముగ్గుర్నీ చూసి బయటకు నడిచింది.

"రాధా..." కోపంగా పిలిచింది శారద. రాధ వినపడనట్టు వెళ్ళిపోయింది.

"చూశావా అన్నయ్యా... నానాటికీ తీసికట్టు నాగంభొట్లూ అన్నట్టు యిదెలా తయారయిందో! కనీసం ఇంటికి వచ్చినమనిషిని పలకరించేపాటి టైంలేదా దానికి. దానితీరు చూస్తే అదీ ఈయన తీరవ చూస్తే ఇదీ- వాడు పోయాడూ- ఇంటికేదో శని పట్టింది"

శారదకు బీపీ పెరిగి మాట్లాట్టం ఎక్కువయింది. ఆమెను ఇరిటేట్ చెయ్యొద్దని మరీ మరీ చెప్పాడు డాక్టర్ సీతారాంతో. ఏం మాట్లాడినా ఇరిటేట్ అవుతోందని మౌనమే శరణ్యమనుకున్నాడు. దానినీ ఆమె మరోవిధంగా భావిస్తోంది. సీతారాంకి తనకింత సహనం వేణు నుంచి వచ్చిందా అనిపిస్తుంటుంది.

"రాధ ఎందుకలా ఉంటోంది బావా?"

"ఏమో!"

"నా మొహం! ఆయనకివన్నీ పడతాయా? నేను చెప్తాను విను. ఆ పిల్లయినా మనకి దక్కాలంటే పెళ్ళి చేసెయ్యాల్సిందే"

సీతారాం నోరు విప్పలేదు.

శారద గొంతు కొంచెం పెరిగింది. "ఈ కాలప్పిల్లలదంతా కళాకళలూనూ వెళావెళలూనూ. ఈయన ఈరోజున ఏకళనున్నారో నేనీ మాటంటే నోరు మెదపలేదు. ఆడదానికి తెలుస్తుంది బిడ్డ సంగతీ గొడ్డు సంగతీనూ! దానికి చదువు లక్షణం లేదు. అయినా ఆదేం చదివి మనకి ఒరగబెట్టాలనీ, ఒరగబెట్టాల్సిన కొడుకు అంత పని చేసాడు" అంటూ కాసేపు ఏడిచింది.

"ఊరుకోవే ఊరుకో... వాడేం అవలేదు. వస్తాడని బాబాగారు చెప్పలేదూ"

"నువ్వూ బాబాగార్లూ బీబాగార్లూ పేరు ఎత్తకు. ఆయన పెట్టిన గడువు ఏనాడనగా పోయింది. నాకెవరిమీదా నమ్మకం లేదు. కనీసం ఈ పిల్లకైనా నా కళ్ళఎదురుగా పెళ్ళయిపోతే చాలు- కళ్ళు మూసేస్తాను"

"నీకేం మతిపోయిందా- ఏం మాటలవీ?" కేకలేశాడు రాజు.

"ఇంకా ఎక్కడ మతిరా నాయనా. అంత ఎదిగిన కుర్రాడు అడుగు బయట పెట్టేసినప్పుడే పోయింది" అంటూ మళ్ళీ ఏడిచింది. "పెడితే పెద్దన్నా పెట్టకపోతే ఎద్దన్నా అన్నట్లు బాబాగార్ని అంతంతమాటలన్నాను. పోతానురా పోతాను" అంది మధ్యలో. ఆమె కొంత సంభాళించుకున్నాక రాజు సీతారాంతో అన్నాడు-

"శారద అలా బాధపడుతోంది గదా. రాధకి చదువుమీద దృష్టిపోతే పోనీ పెళ్ళి చేసెయ్యగూడదా? అల్లుడి రాకతో కుటుంబంలోనూ, శారదలోనూ మార్పు రావచ్చేమో?"

సీతారాం మాట్లాడలేదు.

"మాట్లాడు బావా!"

"ఇంక నేను మాట్లాట్టానికేముందిగాని రాజూ..." సీతారాం ఏదో చెప్పబోయాడు.

"ఇంతకుముందే ఇదంతా చెప్పాను ఈయనతో. ఈయననుమానమేమిటంటే ఆ వేణు మీద దీనికేదో మనసుందిట. ఊరూ పేరూ కులం గోత్రం ఏముందని ఈయనకలాంటి ఊహ పుట్టింది?"

"నాలుగు తగిలిస్తే సరి అన్నీ వదిలిపోతాయి"

"ఎవర్ని?" అన్నాడు సీతారాం.

"ఇంకెవర్నీ- ఆ రాస్కెల్ని. చిన్నపిల్లని చేసి మాయమాటలాడాడన్నమాట. తలుచుకుంటే చిటికెలో మనిషి మాయమైపోతాడు"

సీతారాం ఆవేశంగా అన్నాడు-

"ఇప్పటికే మీ చెల్లెలు శృతిమించింది. జబ్బుమనిషిని నేను మాట్లాడలేదు. నువ్వు మొదలెట్టకు"

ఒక్కసారిగా అక్కడ నిశ్శబ్దం ఆవరించింది.

"శారదా... మనం మాట్లాడుకున్న విషయానికి అర్థంలేని వ్యాఖ్యానాలు చేయకు. నువ్వు వాదిస్తున్నట్లు దానికి పెళ్ళికావాలంటే అలాగే చేద్దాం. దానికి వేణూ ఇష్టమయితే మనం చెప్పాల్సినవిధంగా చెబుదాం! వారించాల్సిన విధంగా వారించుదాం. కాదూ అంటే దాని



ఇష్టప్రకారమే జరుగుతుంది''

''ఇష్టాయిష్టాలు దానికేం తెలుస్తాయి బావా?'' మెల్లిగా అన్నాడు రాజు.

శారద మాట్లాడలేదు.

''ఇంక ఆ విషయం మనం చర్చించకపోతే మంచిది. నిన్ను కష్టపెడితే సారీ- రాజా''

''కష్టపెట్టినా ఫరవాలేదు సీతా! మనమధ్య ఆ బంధుత్వమూ ఉంది, స్నేహమూ ఉంది. ఒక ప్రశ్న అడిగి ఊరుకుంటాను... అడగనా?''

''అడుగు!''

''మన రాధకి ఆ వేణుగాడు అర్హుడేనని నువ్వనుకుంటున్నావా?''

సీతారాం చాలాసేపటిదాకా జవాబివ్వలేదు.

రేడియోలోంచి ప్రాంతీయ వార్తలు వస్తున్నాయి.

''కొన్నాళ్లుగా విద్యార్థులు సాగిస్తున్న ఆందోళన విషయమై ఈనాడు ముఖ్యమంత్రి విద్యార్థి నాయకులతో చర్చలు జరిపారు. సమావేశానికి విద్యామంత్రి కూడా హాజరయ్యారు. విద్యార్థి నాయకుల కోర్కెలమీద వారితో సమగ్రంగా చర్చలు జరిపి ఓ నిర్ణయానికి రావలసిందిగా ముఖ్యమంత్రి విద్యామంత్రికి సూచించినట్లు తెలుస్తోంది - నగరానికి చేరువలో ఒక బస్సు లారీతో ఢీకొనగా-''

రేడియో కట్టేశాడు సీతారాం.

అతని మొహంమీద సన్నగా నవ్వు విచ్చుకుంది.

''వేణులో ప్రాగ్మాటిక్ అప్రోచ్ వుంది రాజా! అతను మన రాధకి అర్హుడే!''

రాజు మాట్లాడలేదు.

* * *

''రవిని ఎవరో నిన్నరాత్రి కత్తితో పొడిచారు. నువ్వూ చూడటానికి వస్తావేమోనని వచ్చాను రమా!''

వేణు గొంతులోనూ, మొహంలోనూ ఆందోళన తొంగిచూస్తోంది. రమ నిర్ఘాంతపోయినట్లుగా నిలుచుండిపోయింది. అక్కడే ఉన్న నిరంజనశర్మ అడిగాడు-

''ఎవరు బాబు ఆ రవీ?''

''మా విద్యార్థి ఉద్యమంలో పనిచేస్తున్నాడు నాన్నగారూ! ఓ చెంపమీద కొడితే మరో చెంప చూపించే వాళ్లింకా ఉన్నారా అని అడిగితే తెలిసిన వాళ్లు రవినే చూపిస్తారు. అలాంటివాడిమీద హత్యాప్రయత్నాన్ని ఎలా అర్థం చేసు

కోవాలి?''

శర్మ గట్టిగా నిట్టూర్చాడు.

"మహాత్ముడంతటి మహనీయుడినే హత్య చేసారు''

"ఆయన నాయకుడు గనక ఆయన భావాలు నచ్చనివాళ్లంటూ కొందరున్నారు- రవి అలాకాదే!''

"నేను పోల్చింది మంచితనం గురించి. మంచివాడిమీద దౌర్జన్యం జరగదా అంటే జరుగుతుంది. ఈనాడు నువ్వు ఎవరిని ఎందుకు చంపావూ అన్నది ప్రశ్నేకాదు. ఎందరిని చంపావూ - ఏ కల్లోలం రేపటానికి చంపావూ అన్నదే ముఖ్యమట. టెర్రరిస్టు సైకాలజీలో''

వేణూ మధ్యలో అన్నాడు.

"రమా! నేను వెళ్తున్నాను''

"అదేం? నేనూ వస్తాను''

వేణూ, రమా ఆటో ఎక్కారు. కొంతసేపు నడిచాక అడిగింది రమ.

"కోపం వచ్చిందా''

"కోపం తప్పించి ఇంకేం రాగూడదా?''

"రావొచ్చుగానీ - ఎందుకంత కోపం?''

"అవును రమా అవతల మన మిత్రుడు చావుబతుకుల్లో ఉన్నాడు. నువ్వూ మీ నాన్నగారూ తాపీగా చర్చలోకి దిగుతున్నారు''

"నువ్వు బాగా పానిక్ అయినట్టున్నావు!''

"లేదు''

"లేకపోతే - ఎందుకంత -'' మాటలు దొరకనట్టు అతని మొహంలోకి చూస్తూ ఆగిపోయింది. ఈమధ్య వాళ్లు తరచుగా కలుస్తున్నారు. ఇద్దరిమధ్యా చనువు పెరుగుతోంది. వేణూలో మార్పు ఆమెకి కనిపిస్తోంది. ఆలోచనగా అడిగింది.

"ఈ ఉద్యమానికీ రవి మీద హత్యాప్రయత్నానికీ సంబంధం ఉందా?''

"ఉందనే అనుమానం''

"ఎవరనీ?''

"మధు అయుండొచ్చు''

"ఛ!'' అంది.

"అంత సులువుగా తీసిపారేసావూ-''

"ఆవేశపరుడేగాని. మనిషిని చంపేంత క్రూరుడనిపించదు వేణూ!''

"వాడి సంగతి నీకింకా తెలవనట్టుంది. ఈమధ్యన తాగిన మత్తులో ఎవరిమీదో చెయ్యి జేసుకున్నాడు. పోలీసులు అరెస్టు చేశారు. ఆ తర్వాత చాలా గొడవయింది. వాడి విడుదల స్టూడెంట్స్ వాడిని ఊరేగించడం... ఎవరో కావాలని చేసారనుకుంటాను''

"నీకనుమానాలు ఎక్కువ''

"అదొదిలెయ్! ముఖ్యమంత్రిని కలుసుకొనే ముందు మా ప్రతినిధుల బృందంలో గలాటా అయింది. మధు చాలా దూకుడుగా మీదకు వచ్చాడు. రవిని కొట్టబోయాడు. సర్ది చెప్పబోతే నామీదకు వచ్చాడు. సిద్ధంగా ఉన్నానని అర్థమయేసరికి ఊహించినట్టే తగ్గిపోయాడు. కానీ - నామీద దెబ్బతీస్తాడనుకుంటే రవిమీద దెబ్బ తీశాడు- అదే అంతుపట్టడంలేదు''

"చివరికి యీ ఉద్యమం'' అంటూ ఆగింది.

"చెప్పు-''

"కొన్ని మార్కులకోసం మొదలైన ఉద్యమం కొందరి ప్రాణాలు పుచ్చుకునే ఎత్తుకి పెరుగుతోందన్నమాట''

"అలా జరగదు'' నిశ్చయంతో ఉంది వేణూ గొంతు.

"ఎందుకనీ?''

"__''

"ఉద్యమం ఆగిపోతుందన్నమాట...''

దానికీ వేణూ మాట్లాడలేదు.

"అంటే నీ ప్రాణాలమీద నీకు తీపి ఎక్కువన్నమాట''

నిర్ఘాంతపోయాడు వేణు. రమవైపు అతను చూసిన చూపులో భావాలు ఆమెకు అర్థంకాలేదు.

"నిన్ను హర్ట్ చేసానా-?''

"ఫరవాలేదు... ఈ కోణంనుంచి కూడా ఆలోచించే అవకాశమిచ్చావు''

"భయపడటం తప్పుకాదుగదా వేణూ!''

"నన్ను మరింత అవమానిస్తున్నావు-''

అతని గొంతు దృఢంగా ఉంది. రమ పట్టిపట్టి చూసింది. ఆమెకు క్షమార్పణ కోరాల




నిపించలేదు.

"ఈ ఉద్యమంద్వారా ప్రాణాలు పోవటం వాంఛనీయమంటావా?"

"ప్రాణనష్టం ఎప్పుడూ వాంఛనీయంకాదు వేణూ! కాని ఉద్యమాలలో ప్రాణనష్టానికుండే సంభవాసంభవాల గురించే ఆలోచించాలి - "ఉద్యమాలు లేకుండా సమాజంలో మౌలికమయిన మార్పులు రావని అంగీకరించాలి"

వేణూకి రమగురించి పునరాలోచించుకోవాలనిపించింది. ఈమె ఆవేశం సభలూ సమావేశాలకూ ఈమె ఉద్రేకం తానాశించే కొన్ని పనులకే సరిపోతుందని అంచనా వేసుకున్నాడు. ఏకపక్షమైన ఆలోచన, ప్రణాళిక సామూహికంగా జరిపే ఆలోచనకన్నా సత్ఫలితమిస్తుందని తన నమ్మకం. ఆవేశం, ఉద్రేకంతోబాటు ఆమె మాటలతో ఓ విధమైన కర్కశత్వమూ, నిశితత్వంతో కూడిన ఆలోచన అతనికి కనిపించాక అనేక సందేహాలు కలిగాయి. ఉద్దేశాలు ఖచ్చితంగా తెలియనపుడు ఆలోచన పేరుతో ఎదుటివాళ్లు తప్పుడు దోవపట్టిస్తారేమోనన్న భయంలో ఆలోచన పరిమితమయిపోయింది. అందుకే వైవిధ్యంతో కూడిన ఆలోచనను ఆహ్వానించాల్సిన అవసరముందనిపించింది.

"ఏమిటంత తీవ్రంగా ఆలోచిస్తున్నావ్?"

"స్త్రీ పాయింట్‌ని పురుషుడు పూర్తిగా అంగీకరించగలడా ఎప్పటికయినా?"

"మా నాన్నగారేమంటారో తెలుసా? ఆధిక్యాన్ననుభవించిన జాతి, కులం, మతం, వర్గం ఏదవనీ వాటి ఆధిక్యాన్ని సులువుగా వదులుకోవుట! నువ్వేం పురుషజాతికి ప్రతినిధివికాదూ నేను స్త్రీల ప్రతినిధినికానుగానీ నన్ను స్త్రీ అన్న ఊహనుంచి కాసేపు తప్పించి నా మాటల్లో ఒప్పుకోవాల్సిందివుంటే ఒప్పుకో! తప్పుంటే ఖండించు"

చటుక్కున ఆమె చేతిని తీసుకుని చుంబించాడు.

"ఈరోజు నా మనసెందుకో చాలా విచలితంగా ఉంది"

అటువంటి సమయంలో ఎలా ప్రవర్తించాలో స్త్రీకి ఎవరూ బోధించనవసరంలేదు. ఆందోళనపడుతున్న ప్రాణిచూపుల్లో అనరా

కోసం ఆరాటాన్ని గుర్తుపట్టిన క్షణంలో ఆమె తల్లిగా మారిపోతుంది.

కొంతసేపయ్యాక వేణు ఆమె చేతిని వదిలేశాడు.

"ప్రాణాలమీది తీపికొద్దీ నేను ఉద్యమాన్ని ఆపేస్తానన్నావు. అంటే ఉద్యమం మధ్యలో ఆగిపోతే నేను భయపడి వెనక్కి తగ్గానని అర్థం- అదీ నీవన్నది"

"అంతేగదా!" అంది రమ ఆలోచనగా.

"నాకెలాంటి భయమూ లేదని రుజువుచెయ్యాలంటే ఉద్యమం ఎట్టి పరిస్థితుల్లోనూ కొనసాగాలి. నా ప్రాణాలకోసం కొందరి ప్రాణాలు తియ్యటానికే నాకు భయం లేదన్న రుజువు కోసం అవని చెయ్యటానికే తేడాలేదు- నేను భయస్తుడిననుకున్నా నాకు అభ్యంతరం లేదు"

"నువ్వు మాటకారివి"

"నీయిష్టమన్నాడు గదేయ్! నా అసలు లక్ష్యం నెరవేరాక దీనిని కొనసాగించ వలసిన పనిలేదు"

రమ చిరాకుగా అంది.

"ఇదంతా నీ గుప్పిట్లోనే ఉందనీ, నీయిష్టం వచ్చినట్లే నడుస్తోందనీ నీకు అహంకారం జాస్తి- వేణూ!"

ఆటో ఆస్పత్రి ముందు ఆగింది.

చాలామంది విద్యార్థులు పోగయిపోయారు. వేణూని చూడగానే వాళ్లు చుట్టుముట్టారు. అందులో మధు లేడని గమనించింది. రమను గమనించగానే రాధ వచ్చి చనువుగా భుజం పట్టుకుంది. వేణూ కొంతసేపు విద్యార్థులతో మాట్లాడి మరో ఇద్దరితో డాక్టరు దగ్గరికి నడిచాడు. డాక్టర్ల అసోసియేషన్ మద్దతుకోసం వెళ్లినపుడు కలిసిన ఓ డాక్టరు అతన్ని పలకరించాడు.

ప్రాణాలకు ప్రమాదం లేదన్నాడు డాక్టర్. పోలీసులు స్టేట్‌మెంట్ తీసుకుంటున్నారనీ అది అయాక లోపలకు వెళ్లవచ్చనీ అన్నాడు. రవి తలిదండ్రులు బయట కూర్చుని ఉన్నారు. రవి తల్లిదండ్రులకు కాఫీలు తెచ్చి బలవంతంగా తాగించారు రాధా, రమా.

వేణూ తననుతాను పరిచయంచేసుకున్నాడు. రవి తండ్రిపేరు సచ్చిదానందమూర్తి. వేణూ పేరు వింటూనే చెయ్యి పట్టుకొని గట్టిగా ఊపుతూ అన్నాడు.

"అబ్బాయ్... నీగురించి మావాడు తరచూ చెబుతుంటాడులే. నాగురించి నీతో చెప్పాడో లేదో నాకు తెలీదు. నేను మహామొండివాడిని. ఓమారు మునిసిపాలిటీవాళ్ల రోడ్డుమీద గోతిలో పడి నా సైకిలు విరిగి నాకు దెబ్బలు తగిలితే మునిసిపాలిటీవాళ్ల ముక్కు పట్టుకుని కోర్టు కీడ్చి నష్టపరిహారం వసూలు చేసిన ఘటాన్ని. నీకు తెలుసా? పౌరజీవితం దెబ్బ తింటోంది గనక సంజీవనీ అపార్ట్‌మెంట్స్ వాళ్లు కొత్తగా కట్టిన అంతస్తులను పగలగొట్టించాలని హైకోర్టు తీర్పు ఇచ్చింది చూశావు అందులో ఓ పిటీషనర్ని నేను. నా కొడుకుని చీకట్లో రహస్యంగా పొడిచి పారిపోదామనుకున్న వెధవని నేను వదులుతానను కుంటున్నావేమో! పోలీసుల్ని కోర్టుల్ని ఓ పట్టు పట్టేస్తాను. నిందితుడిని పట్టించి శిక్ష పడేవరకూ నిద్రపోనబ్బాయ్. నువ్వేదో మహాగొప్పవాడివని మావాడు అంటుంటాడులే. ఈ ఉద్యమాలూ, అవీ ఎందుకురా అబ్బాయ్. మన దగ్గర సాలిడ్‌గా కేసు ఉంటే కోర్టులేదూ. కేసు లేనివాళ్లే ప్రజా ఉద్యమాలూ వల్లకాడూ అంటూ మొదలెడతారూ. అసలు ఈ ఉద్యమాలు జస్ట్ నథింగ్ బట్ బ్లాక్ మెయిలింగ్- అంటూ లక్ష విధాల చెప్పాను. వాడు నా కొడుకు. వాడికి తోచినదే సత్యమూ, ధర్మమూనూ. నామాట వినలేదని నేనేమీ వాడిని నిర్బంధించను సుమా. ఆమాత్రం తండ్రి మాటనే ఎదిరించలేని వెధవ దేనికీ పనికిరాడు. శంకరుడు వచ్చేదాకా జాతిలో క్వశ్చనింగ్ ఉండేది. తండ్రి ధర్మాన్ని కొడుకు ప్రశ్నించేవాడు. నువ్వు ఎదురుగా కనిపించావ్. చెప్పటం నా ధర్మం గనక చెబుతున్నాను విను. ఈ దేశాన్ని ఏనాటికయినా శుభ్రం చేసేది కోర్టులే. ఎగ్జిక్యూటివ్ ముందు లెజిస్లేచర్ ఆటలు చెల్లిపోతున్నాయి గానీ జుడీషియరీ ముందు పప్పులుడకటం లేదు. నామాటమీద నమ్మకం లేకపోతే ఈ దేశంలో ఈనాడు కోర్టులు ఎంత విప్లవాత్మకమయిన తీర్పులు ఇస్తున్నాయో చూడు. నోరూ వాపీలేనాళ్లు ఓట్లేస్తే





గద్దెకెక్కేసి- గద్దె కెక్కేశాను గనక నేను దాని మీద దాడికెళతానూ అంటే కుదరదూ అది పబ్లిక్ న్యూసెన్సూ అంటూ కోర్టులు కొరడాపు చ్చుకొని కొట్టి మరీ తీర్పు ఇచ్చేస్తున్నాయి. భవిష్యత్తు చెబుతున్నాను వినూ- చేతగానివాళ్లే ఉద్యమాలు చేస్తారు. చేతనయినవాళ్లూ చేవగ లవాళ్లూ కోర్టుకెక్కుతారు."

ఈ ధోరణిలో అతను ఇంకా ఎంతసేపు మాట్లాడేవాడోగాని పోలీసులు పని ముగించు కున్నారని కొంతమంది లోపలికి వెళ్లి చూడవ చ్చనీ కబురు వచ్చింది. మూర్తి పోలీసుల వెనక వెళ్లాడు.

రవి పూర్తి స్పృహలో ఉన్నాడు.

"ఎలా జరిగిందీ?" అడిగాడు వేణు.

"తెలీదు... చీకట్లో వెనకనుంచి పొడిచారు"

"పోలీసులకేం చెప్పావూ"

"అదే చెప్పాను"

"ఎవరిమీదయినా అనుమానమున్నదా?"

బలహీనంగా నవ్వాడు రవి. "ఎవరిమీదన నూ?"

రవి తల్లీ, రాధా మరికొందరూ చూసి వెళ్లా రు. సచ్చిదానందమూర్తి లోపలికి వచ్చాడు. వేణూ ఆయన మొహంలోకి చూశాడు.

"చూడబ్బాయ్! కత్తి పుచ్చుకు పొడవట మూ పొడిచినవాడిని దాచటమూ నేరాలే. అధ ర్మమే"

అనుమానంగా రవి ముహంలోకి చూశాడు.

"నేనెందుకు దాచుతానూ?" అన్నాడు రవి.

"తల్లి పుట్టిల్లు మేనమామకు తెలీదా రవీ. నువ్వూ, నీ భావాలూ కన్నతండ్రికి తెలి యవా?"

"చెప్పు రవీ... నీకేం తెలిసినా చెప్పు" అన్నాడు వేణు.

"నిజంగానే నాకు తెలవదు"

"మధూ కావొచ్చంటావా?"

"ఎవరయినా కావొచ్చు. కానీ మధుకి అంత అవసరం ఏముందీ?"

"ఎవరా మధు?" అడిగాడు తండ్రి.

"మాతోపాటే ఉద్యమంలో ఉన్నాడు లెండి" అంటూ ఆగి- "వాడొకవేళ ఏం చేసినా నన్ను చేయాలిగాని నిన్ను చేసే అవకాశం లేదు"

"మధూ మాత్రం కాదు వేణూ! ఆ అవసర మూ లేదు. ఆ ధైర్యమూలేదు వాడికి"

"వ్యక్తిగతంగా ఎవరితోనయినా గొడవలు న్నాయా?"

లేదన్నట్టు తలూపాడు రవి.

"అబ్బాయ్ నువ్వేదో దాస్తున్నావు! పోలీసు లకి ఆ మధూ పేరు అందించితే వాళ్లే కూపీ లాగుతారు"

నర్సు వచ్చి రోగిని విశ్రాంతిగా ఉంచాలని బయటకు పంపేసింది. వేణూ బయటకు వచ్చాడు. రవిని చూసి రాధ గాబరా పడిందనీ, ఆమెను ఇంటికి పంపించాలనీ చెప్పింది రమ. రవి తల్లిదండ్రులతో ఆరోజుకి తాను తోడుగా వాళ్లింటికి వెళతానంది.

రాధను ఆటో ఎక్కించి- "వెళ్లగలవా?" అన్నాడు వేణు.

జవాబివ్వలేదు రాధ.

వేణు కూడా ఆటో ఎక్కాడు. రాధ అతనికి దూరంగా జరిగి కూర్చొంది. కొంతసేపటిదాకా ఎవరూ మాట్లాడలేదు. ఒక్కమారుగా రాధ కళ్లు ఎత్తి అతన్ని చూసి దగ్గరగా జరిగింది. ఆమె విశాలమయిన కళ్లనిండా నీళ్లు!

"రవికి జరిగినట్టు నీకు జరగకూడదు వేణూ"

అంటూ అతని చేతిని తీసుకొని గట్టిగా పట్టుకుంది.

అలాంటి సందర్భంలో ఎలా ప్రవర్తించాల న్న సందిగ్ధావస్థనుంచి వేణూ తప్పించుకోలేక పోయాడు.

గొంతు సవరించుకున్నాడు వేణు-

"ముఖ్యమంత్రి సలహా ప్రకారం మనం కోర్కెలను పునరాలోచనచేసి తుదిరూపం ఇవ్వాలి. ఎన్నాళ్ళిలా తరగతులను బహిష్కరి స్తాం? పోయినవాళ్లతో పానయినవాళ్ళూ ఎన్నా ళ్ళు కూర్చోడం? అకడమిక్ ఇయర్‌పోతే అస లు నష్టం మాకేగాని ప్రభుత్వానికి కాదూ- అన్న మాటలు వినిపిస్తున్నాయి. ఇదంతా దృష్టిలో ఉంచుకుని తర్వాత కార్యక్రమాన్ని నిశ్చ యించుకోవాలి"

అందరి ముఖాల్లోకి కలయజూసాడు వేణు.

"మనం ఈనాటివరకూ కోరుతున్న కోర్కెలు

మూడు. 1. మొత్తం పేపర్లన్నీ తిరిగి దిద్దించాలి. 2. కాంపెన్సేటరీ మార్కులు ఇవ్వాలి. 3. పేపర్లు దిద్దించటంలో సాధారణంగా అమలు చేయవలసినపద్ధతులను యూనివర్సిటీవారు అమలు చేసేటట్టు చూడాలి.

"ఈ మూడింటినీ మనం మరికొంత వకఠ్రందీగా మార్చితే-"

"నువ్వలా ఎందుకు కాంప్రమైజ్ అవుతున్నావు?" గట్టిగా అరిచాడు మధు. అతని మాట ముద్దగా వస్తోంది.

వేణు జవాబిచ్చేలోగా మరొకరు అన్నారు-

"మధు అన్నది నిజం! మనం ముఖ్యమంత్రిని కదిపాం! ఆయన చెప్పినంతమాత్రాన డిమాండ్లు మార్చవలసిన పనిలేదు-"

"స్టూడెంట్స్ ఆందోళన విరమించాలనుకుంటున్నారన్నది నీ అభిప్రాయం. మనం ఇంతదాకా వచ్చాక చెయ్యాల్సింది ఒత్తిడి పెంచటమే!"

"గుర్తించబడిన యూనియన్లలో కొందరు ఓ బృందంగా వేరేగా వీసీని కలుసుకున్నారని మీకు తెలును-" అన్నాడు వేణు.

"ఈ వీసీ దగ్గర ఆ పప్పులేం ఉడకవు. వాళ్ల వెనకనున్న బలమేంటో మన బలమేంటో ఆడికి తెలును. మనకి లొంగనాడు వాళ్ళకి లొంగుతాడనుకోకు-"

ఆ మాట్లాడుతున్న వ్యక్తిని నిశితంగా చూశాడు వేణు.

"నా అభిప్రాయమూ అదే! బలం మనదే! ఒత్తిడి చేసేదీ మనమే. ఎలాగోలా ఆందోళన విరమింపజెయ్యాలన్న లొంగుబాటుకు ప్రభుత్వం వస్తోంది. దీనిని ప్రారంభించిన మనని ఒప్పుకోడంకన్నా వాళ్ళని ఒప్పుకోడానికే ప్రభుత్వమూ యూనివర్సిటీ ప్రయత్నిస్తాయి. తద్వారా వాళ్ల ఎగో తృప్తిపడుతుంది. పైగా మనం చేస్తున్న డిమాండ్స్‌కి రంగుమార్చితే ఒప్పుకుంటామన్న మిషతో వాళ్ళు ఆ బృందాన్ని కండిషన్ చేయటానికి వీలు ఎక్కువుంటుంది. నామమాత్రంగా డిమాండ్స్‌ని ఒప్పుకుని మన అసలు డిమాండ్స్‌ని పూర్తిగా నీళ్ళు కార్పించెయ్యటమూ జరగవచ్చు. ఓమారు పట్టు సడలిపోయాక మనం ఎంతగింజుకున్నా మరోమారు విద్యార్థులనీ, తల్లిదండ్రులనీ, అధ్యాపకులనీ తిరిగి ఉద్యుక్తులను చెయ్యటం పూర్తిగా అసాధ్యమవుతుంది-"

ఎక్కడ ఆపాలో అక్కడ ఆపినట్టు ఓమారు చూసాడు వేణు. ఈసారి అతను ఎక్కువ గడువు ఇవ్వలేదు.

"కనక మనం మన అసలు కోర్కెలని వదులుకోం! రంగుమార్చే అవకాశం వేరే బృందానికి తద్వారా ప్రభుత్వానికి ఇవ్వం! ప్రభుత్వం లొంగలేదూ మనమే లొంగామన్న మిషతో ఒక్క అరంగుళం తగ్గినట్టు కనిపిస్తాం! మనం తగ్గినట్టు అనిపించటంవల్లనే వాళ్ల ఎగో మరింత తృప్తిపడుతుంది. అందువల్ల మన బేసిక్ డిమాండ్స్‌ని ప్రజాస్వామిక పద్ధతిలో అందరం చర్చించి కొద్దిగా మార్పులు చేద్దాం-"

"డిమాండ్స్ మార్చాలా వద్దా అన్నది సీక్రెట్ బాలట్ ద్వారా సర్వసభ్య సమావేశంలో ప్రజాస్వామికంగా నిర్ణయించుదాం-" మధు తరపు మనిషి.

వేణు నవ్వాడు.

"ఒకప్పుడు రాజకీయ నాయకుల ప్రవేశం సందర్భంలో- సీక్రెట్ బాలట్టూ సర్వసభ్య సమావేశమూ- అన్నాను నేను. అప్పుడు మన మిత్రుడు మధు ఏం చేసాడూ?

కొద్దిగా గాప్ ఇచ్చి-

"నేనా పాత విషయం ఎత్తదలుచుకోలేదు. ప్రజాస్వామికంగానే విషయాలు సెటిల్ చేయాలంటే నాకెలాంటి అభ్యంతరమూ లేదు. అయితే ముందుగా మనం మార్పుల్ని ఫైనలైజ్ చేద్దాం! కొత్తరూపమిచ్చిన డిమాండ్స్‌కి ఎంతమంది మద్దతునిస్తారన్నది సీక్రెట్ బాలట్ ద్వారా నిర్ణయించుకుందాం-"

దభ్‌మన్న చప్పుడయింది.

మధు కూర్చున్న స్థలం ఖాళీగా ఉంది. కిందపడిపోయిన మధుని బయటికి మోసుకుపోయారు. మధుని బయట కారులో పడుకోబెట్టారు. కారు స్టార్టు చేయబోతుండగా లోపలి నుంచి కొందరు పరుగెత్తుకు వచ్చారు-

"వేణు రమ్మంటున్నాడు. ఫైనలైజ్ చేసాక వెళ్ళిపోవచ్చంటున్నాడు-"

మధు మిత్రులు ఒకరి మొహాలొకరు చూసు




కున్నారు. ఇందాకటినుంచి వేణుకి ఎదురు మాట్లాడుతున్న విద్యార్థి తలపంకించి-

"వాడిష్టం వచ్చినట్లు మార్చుకోమను! ఇవ తల మధుకి ఒంట్లో బాగోకపోతే- సమావేశం కట్టెయ్యక కబుర్లు పంపుతాడా బాస్టర్డ్!"

కారు దూసుకుపోయింది.

"తాగేసి పడిపోయాడు. ఒంట్లోబాగులేదుట-" అన్నారు వేణు దగ్గరకి వచ్చి.

"మనం ఈ డిమాండ్స్ విషయం తేలుద్దాం-" అన్నాడు వేణు- వాళ్ళు చెప్పినదంతా విని.

రమ వేణుని మెచ్చుకోలుగా చూసింది.

వేణుకి అక్కడ మిగిలినవారికి మధ్య కొంత చర్చ జరిగాక ఓ పరిష్కారం కుదిరింది.

1. పేపర్లన్నీ తిరిగి దిద్దించాలన్నది అసాధ్యమయిన కోరిక. ముందుగా మొత్తం ఆన్సర్‌షీట్స్‌తో టాబులేషన్ రిజిస్టర్‌ని సరిజూడాలి. ఆపైన రిజిస్టర్‌తో మార్క్సు కార్డ్సుని సరిజూడాలి. సరయిన కార్డ్సు ఇవ్వాలి. ఈ ప్రోసెస్ అంతటికీ పర్యవేక్షకులుగా విద్యార్థి ప్రతినిధులు ఉండాలి. దానికి వీసీ, ప్రభుత్వమూ అంగీకరించకపోతే విద్యార్థి నాయకులు సూచించిన ప్రొఫెసర్ల పర్యవేక్షణలో జరగాలి. దీనిని కూడా ఒప్పుకోకపోతే పరిస్థితులనిబట్టి నిర్ణయం తీసుకునే అవకాశం నాయకులలో ఉండాలి.

2. అన్ని సబ్జెక్టులకీ కాంపన్సేటరీ మార్కులు ఇచ్చే బదులు విద్యార్థులు బాగా దెబ్బతిన్న సబ్జెక్టులకి ఇమ్మని కోరాలి. అయితే దెబ్బతిన్న సబ్జెక్టులకి కొలమానం ఏమిటి? కాంపన్సేటరీ మార్కులని నిర్ణయించటం ఎలా? గడచిన పది సంవత్సరాలుగా ఒక్కో సబ్జక్టు పాస్ పర్సంటేజ్‌ని తీసుకుని సగటు శాతం కట్టాలి. ఈ సంవత్సరం ఆ సబ్జక్టులో పాస్ పర్సంటేజ్‌తో దానిని పోల్చి హెచ్చుగా పడిపోయిన సబ్జక్టును గుర్తించాలి. ఆ శాతంవరకూ విద్యార్థుల పాస్‌ని పెంచేటందుకు వీలుగా కాంపన్సేటరీ మార్కులు నిర్ణయించాలి. ఇదంతా స్టాటిస్టిక్స్ నిపుణుల బృందం సూచనల మేరకు సాగాలి.

3. జరిగిన పొరపాట్ల మీద ఎంక్వయిరీ కమిషన్‌ని నియమించాలి. దోషులకి గట్టి శిక్షపడాలి.

4. ఇకపైన ఇలాంటివి జరగకుండా విద్యార్థి నాయకులకు పర్యవేక్షణాధికారంగాని, పద్ధతుల నిర్వహణ మీద ఆడిటింగ్‌లో భాగస్వామ్యంగాని ఉండాలి"

డిమాండ్లన్నీ ఓ కొలిక్కి తెచ్చేసరికి చాలా సమయం పట్టింది.

"వీటికి మధు బృందం ఒప్పుకోకపోతే-?" అన్నారు ఒకరు.

వేణు కాగితాలన్నింటినీ సర్దేసి చిన్నగా నవ్వాడు-

"వాళ్ళెలాగూ ఒప్పుకోరు. మనమేవో మార్పులు చేసామనీ వాటి గురించి ఆలోచించి ఒప్పుకోకపోడం కాదది. ఈనాడు ప్రభుత్వం చర్చలకు దిగి వచ్చింది. అది వాళ్ల లొంగుబాటనీ, మన విజయమనీ కూడా మధు బృందం అనుకోదు. వాళ్ళకి ఉద్యమం కావాలి-"

"ఫెయిలవటమనా నువ్వనేదీ?"

"కాదు... కొనసాగటం-"

"ఎంతకాలం?"

"ఇది విద్యార్థి ఉద్యమం నుంచి ఎదగాలి. రాస్తారోకో, రైల్‌రోకో, జైల్‌భరోల దాకా మారాలి. చేతనయితే ప్రభుత్వం దిగిపోయేటంతగా- ఇదంతా నా అంచనా మాత్రమే!"

"ప్రభుత్వం చూస్తూ ఊరుకుంటుందా?"

"ఎందుకూరుకుంటుందీ? వాళ్ళ తర్వాత ఎత్తు ఏమిటీ - వేచి చూడాలి-" వేణు.

"మన ఏడుపు మనని ఏడవనీరా? అందాక మన భవిష్యత్తు... మన అకడమిక్ ఇయర్... " అన్నాడొక విద్యార్థి బాధగా.

"అదే నా బాధానూ! అందుకే కనీసం మనం కలిసికట్టుగా ఉండాలి"

"మనమెలావున్నా - మధూ వాళ్ళు కలవరు. ఈ మార్చిన డిమాండ్లనయినా ఒప్పుకోరనే నువ్వూ అంటున్నావు"

"ఫరవాలేదు. సీక్రెట్ బాలట్ వాళ్ళే ప్రపోజ్ చేసారు. అయితే డిమాండ్లు మార్చాలా వద్దా అన్నదానిమీద బాలట్ అన్నారు. పాత డిమాండ్లకీ కొత్త డిమాండ్లకీ బాలట్ అంటున్నాం మనం. వాళ్ళ ప్రపోజల్‌కి మనం ఒప్పుకొంటాం గనక మనం బాలట్‌కి చేసిన అమెండ్‌మెంట్‌కి వాళ్ళు ఒప్పుకుని తీరతా




రు-''

''మన కొత్త డిమాండ్లకు మద్దతు లభిస్తుందని గారంటీ ఏమిటి?''

''గారంటీ ఉంది. మానవ మనస్తత్వం తాలూకు పాత్ర అక్కడే ఉంది. ప్రతి జీవికీ సర్వైవత కావాలి. అందువల్ల ఎప్పుడయినా పరిష్కారమార్గం వట్ల మొగ్గు చూపిస్తుంది. విసుగెత్తిపోయి వున్నారు మనవాళ్ళు. మన డిమాండ్లలో మార్పు - పరిష్కారంగా - దానికి ఓ ప్రయత్నంగా - వాళ్ళ కంటికి కనిపిస్తుంది. వీలయితే మనం విద్యార్థులతో బాటు తల్లిదండ్రులనూ లెక్చరర్లనూ బాలట్‌కి ఆహ్వానించాలందాం-''

వేణూతో అక్కడున్నవారంతా చాలావరకూ ఏకీభవించారు. అంతా యిళ్ళకు బయలుదేరారు. రమా వేణూ కలిసి బయలుదేరారు.

రమ సంశయంగా ప్రశ్నించింది-

''కథ అంతవరకూ వస్తుందా?''

''నీ అంచనా ఏమిటి?''

''రాదనే-''

''ఎందుకనీ?''

''చూస్తుంటే యిదంతా ఏ ఒక్కరి చేతిలోనూ లేదనే తోస్తుంది-''

వేణూ కొంతదూరం మాట్లాడలేదు.

''ఇంతకుముందు రవిని చూడటానికి వెళ్తున్నప్పుడూ యిలాగే అన్నావు రమా! నీ ఆలోచన తప్పు! ఇదంతా అందరి చేతుల్లోనూ వుంది. ఎవడు ఆట బాగా ఆడగలడో వాడు గెలుస్తాడన్నట్లు - పైకి కనిపిస్తుంది. కాని యిందులో ఓ మెలిక ఉంది. ప్రతి సమస్యలోనూ రెండు విరుద్ధ అంశాలుంటాయి. అందులో ఒకదానికి ఎదిగే లక్షణం ఉంటుంది. రెండోదాన్ని నశింపజేస్తూ ఎదుగుతుంది. ఆ లక్షణం గుర్తించగలిగితే ఏం జరిగేదీ అంచనాకు చిక్కుతుంది''

రమ నవ్వింది.

''నీవనేది ఆ లక్షణం గమనించినవాళ్ళు ఆట నేర్పుగా ఆడగలరూ అనీ-''

''ఇంచుమించుగా అంతే--!''

''తెలివితేటలు కట్టిపెట్టు! సూటిగా చెప్పు-''

''తెలివితేటలేముంది - యించుమించు అనటంలో-''

''సరిసరి! నువ్వెక్కడ లొంగుతావుగానీ... నీ మాటలను బట్టి నాకు అర్థమయిందేమిటంటే... జాతకం ద్వారా భవిష్యత్తును తెలుసుకొన్నవాడు మెలకువగా భవిష్యత్తుని నిర్ణయించుకోగలడని... అంటున్నావు. జాతకం తీసేసి శాస్త్రం అని పేరు బెడుతున్నావనుకో....! ఈ వాదన తేలేది కాదు గానీ.... నా అసలు ప్రశ్న నీకు అర్థమయ్యే ఉండాలి. అయినా స్పష్టంగా అడుగుతున్నాను. నడిపేది ఏది - సిస్టమా నువ్వా? నీ తెలివీ దీక్షానా - సిస్టమ్‌లో వైరుధ్యాల సంఘర్షణానా? ఆ వైరుధ్యాల సంఘర్షణను గుర్తించటమనే తెలివితో ఇదంతా నువ్వు నడుపుతున్నట్లు - అహానికి లోనవుతున్నావని నా ఊహ. నువ్వు గమనించాల్సిందేంటంటే అవతలివాడికీ నీ శాస్త్రం పూరాగా తెలుసు. వాడూ వైరుధ్యాలను గమనించుతాడు. ఆ మెలకువతోనే వాడూ ఇదంతా నడపగలనన్న అహానికి లోనయ్యే అవకాశముంది. అయితే చివరిగెలుపు నీదే అంటావు. వాడి మెలకువ నీ టాస్క్‌ని కష్టతరం చేస్తుందంటావు-'' అంటూ ఆగి-

''ఏంటలా చూస్తున్నావ్?''

''ఎలాగూ చూట్టంలేదు. చెప్పు-''

''నా ప్రశ్నేంటంటే నువ్వన్నట్లు నువ్వే గెలుస్తావనుకుందాం! అయితే 'నువ్వు'అనే ఎలిమెంట్ దానికి కారణమా? కాక నువ్వంటూ ఉండే 'సిస్టమ్' కారణమా? ఏదబ్బాయ్ కారణం?''

వేణూ నవ్వాడు.

''ఎందుకంత యింట్రస్టు నీకూ-?''

''అర్థమవలేదు-''

''నీ ప్రశ్నంతా సంశయమంతా సమస్యంతా దేనికీ అని-?''

''తెలుసుకోటానికే-''

''కరెక్టు - నీ బాధంతా తెలుసుకోటం కోసమే - అంటే నీ తృప్తి కోసమే నువ్వు తెలుసుకుంటావు-''

రమ ఆలోచిస్తూ తలూపింది.

''తెలుసుకోటం అంటే జ్ఞానం కోసమే నీవు

ఆచరణ సాగిస్తావు. నా అభిప్రాయమేంటంటే ఆచరణకోసమే జ్ఞానం ఉండాలి. జ్ఞానం చాలా పెద్ద అడిక్షన్. మనదేశంలో చాలా విస్తారమయిన జ్ఞానం ఉంది. నీవు వేసిన ప్రశ్నలకన్నా అద్భుతమయిన ప్రశ్నలను ఎంతో ప్రాచీన కాలం నుంచీ జ్ఞానులు వేసుకున్నారు. జవాబులు యిచ్చుకున్నారు. కానీ - ప్రపంచంలో సంపూర్ణ జ్ఞానం లేదు. శుద్ధ జ్ఞానమూ లేదు. అందువల్ల వ్యక్తుల చేతా సమూహాలచేతా పని చేయించగలిగేదే జ్ఞానం. అంటే ఆచరణే జ్ఞానం! ఆచరణ ద్వారా జ్ఞానం సరిదిద్దబడుతూ వుంటుంది. లభిస్తూ వుంటుంది. నువ్వు నేర్చుకుంటూ నడుస్తావు. నేర్చుకున్నాక నడుద్దామని ఆగిపోవు. దీనిని గూడా ఆ వాసూ గీతలోనో మరెందులోనో చూడగలడు. వాడెందులో చూసినా- వాడు నడపడం కోసం - ఆచరణ కోసం - దానిని వినియోగించుకుంటే అది చర్చించాల్సిన విషయం కాదు. నీనడక్కే ప్రథమ స్థానం. నీ బుద్ధికీ హృదయానికీ - రెండవ స్థానమే! అంటే ఆచరణకే ప్రథమ స్థానం! జ్ఞానానికి అనుభూతికి రెండవ స్థానమే! అవి రెండూ ఆచరణకు అవలంబనలే!''

రమ వేణూ మాటలను జాగ్రత్తగా వింది. వాటిని అంగీకరించటానికయినా నిరాకరించటానికయినా ముందు ఆలోచించాలనుకుంది.

''- తప్పు పట్టాననిపిస్తోందా రమా?''

''లేదు లేదు -''

''నువ్వు నమ్మినా నమ్మకపోయినా నన్ను నేను పరిపూర్ణుడనని అనుకోను. ఆచరణకి ఉండాల్సినంత అహమూ, వినయమూ కూడా నాలో ఉండాలని నేను అనుకుంటాను! అందుకే నీవంటి సహృదయురాలి విచికిత్సను నేను కోరతాను.

నా కంటికి కనిపించినది మరి నాలుగు కళ్ళకి చూపించగల్గితే అవి మరో పదికళ్ళకు అందివ్వగలిగితే - నడిచేవాళ్ళ సంఖ్యా పెరిగే అవకాశముందనే అనుకుంటాను-''

అంటూ ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. ఆ చిన్న చెయ్యి అతని చేతిలో యిమిడిపోతూనే ఏదో బలాన్ని అతనికి అందిస్తున్నట్లనిపిస్తోంది.

''జ్ఞానమిచ్చే తృప్తిలో ఆనందం పొందకు రమా! నువ్వు... నువ్వు నాకు కావాలి-''

★ ★ ★

''-వీడిలా తాగేసి పడిపోతుంటే మన పనులు మట్టిగొట్టుకుపోతాయి-'' అన్నాడు స్వరాజ్యపతితో ఓ అనుచరుడు.

స్వరాజ్యపతి ఖుషీగా నవ్వాడు.

''ఆడికి పీకలమొయ్యాపోసేది మనం! పడిపోటానికిగాపోతే సరదాకా పొయ్యటం?...'' అన్నాడు.

''నాకు మీ థీరీ బోధపడలేదు-'' అన్నారింకొకరు.

''మన పూర్వీకులు తయారయిన సరుకుని వాడుకునేవారు. ఈనాడు మనం తయారుజేసుకుని వాడుకోవాలి. ఆ రోజుల్లో ఓ పచ్చినెత్తురు తాగే రౌడీ ముండాకొడుకూ ఓ జేబుదొంగా రెడీగా ఉన్నారనుకో! మన పూర్వీకులు ఆ రౌడీని వాడేవారు. ఆ జేబుదొంగను ఎంచుకున్నవాళ్ళు వాడిని రౌడీగా మారుద్దామనుకున్నవాళ్ళూ - ఆడిలో ఆ ఎలిమెంటు లేకనే జేబుదొంగ బతుకీడుస్తున్నాడన్న పరమ సత్యం గ్రహించక పప్పులో కాలువేసారు. ఆ రోజులు పోయాయిప్పుడు. మనం అడ్వాన్సయ్యాం! రౌడీలంటూ ప్రత్యేకంగా కొందరు మొకిలీసుగాళ్ళుండేవారు. ఇప్పుడు మనం సైజిచ్చి బట్ట యిచ్చేస్తే చొక్కా తయారయిపోతుంది. బట్టను ఎంచుకోటమే సైజును చూసుకోటమే మన పని. ప్రతీ చోటా రౌడీలను తయారుచేసుకుంటేగాని మనకి బతుకు గడవని కరువురోజులొచ్చేసాయి. మంత్రాలు చదివేవాళ్ళలో - చదువు చెప్పేవాళ్ళలో - చదువుకునేవాళ్ళలో - కార్మికులలో - కర్షకులలో కొండజాతులలో ఆఖరుకు ప్రతీ కొంపలోనూ అంటే ప్రతి ఆర్గనైజ్‌డ్ యూనిట్‌లోనూ కొందరు తెగింపుగాళ్ళను - నోటితుత్తరగాళ్ళను - రౌడీగాళ్ళను - తయారుచేసుకుంటే తప్ప మన బతుకు వెళ్ళటం లేదు. చివరకి రౌడీయిజాన్ని కూడా కల్తీ చెయ్యాల్సిందే! రౌడీలను తయారుచేసుకోవాలంటే సరైన స్పెసిమన్ని ముందుగా తీసుకోవాలి. అంటే ఆడిలో ఆ ఎలిమెంట్ ఉండాలి. అలాంటాడిని ఎంచుకున్నాక ముందుగా ఆడిని మేపాలి. ఆడు మేతకి అలవాటుపడ్డాక ఆపాలి. ఆడికి మేత ఎక్క




డుందో మనం చూపించితే చాలు! - మధుగా డిలాంటాడికి మేత వేరూ - మరొకడికి మేతవేరూ -"

"గురువుగారూ! ఇంత వివరంగా చెప్పారు గదా అని అడిగేస్తున్నాను. అనలాడు ఆ వేణుని వదిలేసి పాపం ఆ రవిగాడిని పాడిపించారేంటి?"

శిష్యుడి జ్ఞానతృష్ణకి తృప్తిపడే గురువు నవ్వు నవ్వాడు స్వరాజ్యవతి.

"మెకానిజమ్ తెలీకుండామెషినేం నడవగలవు? ముందది తెలుసుకో! ఆ వేణుగాడున్నాడా? ఆడేం లాకలూకయగాడు కాదు. మనేపు ఉండాల్సిన మడిసి. ఆడి వెనకాల బలగం ఉంది. ఆడు ఊ అంటే నిప్పుల్లోకి ఉరికేసేవాళ్లున్నారు. మనం ఎప్పుడయినా యుద్ధం చెయ్యాలంటే ఆడిమీదికి డైరెక్టుగా ఆటాకయిపోగూడదు. అయిపోయామనుకో ఆడు వీరభద్రుడు అయిపోతాడు. మొత్తం బలాన్ని కేంద్రీకరించేస్తాడు. సొంతానికి నష్టం వస్తే ఏనాకొడుకయినా ఎదుటివాడు అంతు జూసేస్తాడు. అయినా మనకి యుద్ధం ఎందుకూ. మన పని శాంతియుతంగా జరగాలిగాని! అదే రవిగాడున్నాడనుకో- ఆడుత్తి ఎర్రిగొడ్డు. అసలు సిసలయిన శాంతిప్రియుడు. శాంతిప్రియుల యెనక జనాలుండరు. అనలుకి శాంతిలో అట్రాక్షనుండదు. గ్లామరస్ స్టార్‌కున్న అట్రాక్షను కళాకారుడికుండదు గదా! ఆడిని యేసావనుకో ఆడెనకాల జనంలేవరు. ఆడి మంచితనాన్ని ఆ వేణుగాడూ వాడుకుంటాడు, మనమూ వాడుకుంటాం. వాడుకున్నాంగదా అన్న ధర్మబుద్ధితో వేణుగాడు మనమీద పడాలి... పడడు. తటపటాయిస్తాడు. ఆడు పనివయితే చిన్న బెదురుపుడుతుంది. పబ్లిగ్గా రోడ్డుమీద ఒకడిని పాడిచేస్తే అందులో మగతనం ఉంది. చూసినవాళ్లు బెదిరిపోతారు. ఇప్పుడు మన వేణుగాడి పొజీషను ఆ చూసేవాళ్ల పొజీషనే! అందువల్ల ఏంటంటే మొదటి దెబ్బ ఎప్పుడూ అనుచరుడిమీద పడాలిగాని లీడరుమీదగాదు. ఈరోజు ఆడు డిమాండ్లూ మార్చా అంటూ తగ్గిపోటమూ- సలహాసంఘమూ వదిలేసుకోడమూ అనకపోడం- మన థీరీ రైటేనని రుజువు చేస్తున్నాయి"

అర్థమయినట్టుగా భక్తిగా తలూపాడు అతను.

ఇంతలో మధూ అతనితోటి విద్యార్థులు మరో ముగ్గురూ వచ్చారు. మధూ మొహంలో ఉద్రేకం కోపం ఉన్నాయి. వస్తూనే అన్నాడు-

"ఆ రవిగాడిబాబు మా తాతకి ఫోనుచేసి బెదిరించేస్తున్నాడు. నేను వాడికి బుద్ధి చెప్పాలనుకుంటున్నాను"

"నువ్వారోజు తాగేసి పడిపోయావేం మధూ?" స్వరాజ్యవతి ప్రశ్నించాడు.

మధూ తగ్గిపోయాడు. తడబడుతూ-

"అదీ... అది.. నేనారోజు ఎక్కువ తాగలేదు. అందులో ఏదో కల్తీ ఉంది"

"నీ తాతా మేనమామా ఒక్కటై నీకు ఆస్తి లేదు పాస్తి లేదు అన్నారట. ఏం చేద్దామనుకుంటున్నావ్?"

"నన్ను బయటికి గెంటెయ్యడం వాళ్ల తరంకాదు"

ఉచ్చులు బిగిస్తున్నట్లు నవ్వాడు స్వరాజ్యవతి.

"ఆ ఉద్యమంలో మా పనులు చూసిపెడతావని చేరదీసాం. తీరా జూస్తే నువ్వు చదువొదిలేసీ ఇల్లొదిలేసీ వీధిలోబడితే ఉద్యమంలో వేణుగాడి మాటకి తిరుగుండదు.. ఆ రవిగాడెందుకు పాడిచావో మాకు బుర్రలు బద్దలుకొట్టుకున్నా బోధపడటంలేదు.."

"ఆరోజున మీరేగదా.."

"ష్!" స్వరాజ్యవతి గొంతు మారింది.

"నేను పొడవమన్నాననేస్తావుగాబోలు! పోలీసుల్తోనూ ఇదే మాటంటావు. ఈనాడు తిన్నయింటి వాసాల్లెక్కబెట్టటం ఆర్డర్ ఆఫ్ దిడే అయిపోయింది. ఆ పొడిచేదేదో పబ్లిగ్గా పొడిస్తే ప్రతివాడికీ ఉచ్చ కారిపోను. ఆడూ-వాడిలా ఆ యెనకదెబ్బ ఏంటీ అన్నాననుకో! యెల్లి పబ్లిగ్గా పొడిచేస్తావా? ఆ తర్వాత ప్రెస్‌మీటింగెట్టి ఆ పతిగారు అన్నారండి, నాకేం తెలీదండి అంటావా?"

మధు అయోమయంగా చూశాడు.

"ఆ ముసలాడు మీ తాతనీ మేనమామనీ బిజీగా ఉంచితే మనకేం నష్టం... ఉంచనీ!

అది అరువులకి పోలీసులు నీ యెనకబడిపో రులే! ఆ ఏర్పాట్లు నేను జూసుకుంటానుగానీ ఈ వేళనుంచి ఏ సమావేశానికీ పీకలమొ య్యా తాగేసి యెళ్లకు. అద్దుబడటానికయినా అల్లరిపెట్టడానికయినా ఒంటిమీద తెలి వుంచుకోవాలి. లిమిట్‌లో ఉండు"

"ఇంకేం సమావేశం సార్... వేణూ డి మాండ్లు మార్చేశాడు" అన్నాడు మధు మిత్రు డు.

"ఏం మార్చాడూ అది మొఖం! ఎగేలు తృప్తిపరిచేసి వబ్బం గడిపేసుకుందామను కుంటున్నాడా కుర్ర ఎదవ! కుర్రతనం మాట లూ.. ఎర్రితనమూ"

'లేదు సార్.. ప్రభుత్వం కూడా..." అని ఏదో చెప్పబోయాడు.

"అక్కడ సీట్లో ఉన్నది విద్యామంత్రయితే ఆవేణుగాడి ఎత్తు కొంతవరకు పారేదే. మనం ఎనకాతలుండగా ఆ సీయమ్ ఈడెన్ని యేషా లేసినా చీకటిలో తెగ్గొట్టేస్తాడు. అందాకా యెళ్ల నీయం మనం. ఆ వేణుగాడు సీయమ్‌ని కలుసుకోటానికి ఎప్పుడు ప్లాన్ చేసేదీ చూ డండి. మనకి కావల్సిందల్లా వీసీ ఫారిన్ యాత్ర బయటపడేవరకూ జావ్వం. వేణూగాడి టైమింగ్ మనం చెడపాలి. దెబ్బకి విక్కెట్లు ఎగిరిపోతాయి. అంతే మనం ఉద్యమంలో ఒత్తిడిపెంచాలని సూచించి ఆడిచేతే అవునని పిస్తాం! ఆడికిప్పుడు పుట్టిన బెదురుని మనం గుర్తుపట్టినట్లు తెలీనీకూడదు. మధూని జాగ్ర త్తగా చూసుకో"

స్వరాజ్యవతి దగ్గర సెలవు తీసుకొన్నారు మధూ, అనుచరులూ.

★ ★ ★

మీరు రెండు నిమిషాలలో చెప్పాల్సింది చెప్పండి.

"చిత్తం... తమరి సమయం విలువ నాకు తెలుసు. నాపేరు సచ్చిదానందమూర్తి. నా కొ డుకు రవిని ఎవరో అర్ధరాత్రి వేళ కత్తితో పొడిచి గాయపరిచారు. నాకు తగిన న్యాయం జరిపించి ఆ వ్యక్తిని బుక్‌చేయవలసిందిగా నేను సబ్‌నుంచి డీజీపీ వరకూ కలుసుకుని అభ్యర్థించాను. ఇంతవరకు ఎవరూ అరెస్టు కాలేదు"

"ఆ వివరాలు నా సెక్రటరీకి ఇవ్వండి. విచారణ జరిపిస్తాను"

"తప్పకుండా జరిపించండి. తమరి దర్శనం మళ్లీ ఎప్పుడు చేసుకోమంటారో చె ప్పండి"

"అవసరం లేదు. డిపార్ట్‌మెంట్ తగిన చర్యలు తీసుకుంటుంది"

"అవసరం మీకు లేదు సార్... నాకు ఉంది. మీ కింద పని చేస్తున్న పోలీసు బలగంలో ప్రతి ఒకరినీ. రక్షణ కోసం కలుసుకునే అవ సరం నాకుంది. నేనూ ఈ దేశంలో ఓ పౌరు డిని"

స్వామి మొహమాటంగా నవ్వాడు.

"మీ అవసరంకొద్దీ మీరు కలవ్వచ్చును. అనేకరకాల అర్జంటు పనుల్లో ఉంటారు గదా మావాళ్లు. మీ పని జరుగుతుంది. మీరు వెళ్లండి"

"చిత్తం... నేను పత్రికలతో నాకథ అంతా చెప్పుకున్నాను. అదంతా వారు ప్రచురిస్తారు. నేను ఓటువేసి గెలిపించిన ప్రజా ప్రతినిధు లకూ, నేను టాక్స్ పేజేసి నిర్వహిస్తున్న ప్రభు త్వానికీ నాపట్ల ఎలాంటి విధులున్నాయో నా లాయరు మిత్రులు పరీక్షిస్తున్నారు"

స్వామి నొక్కిన కాలింగ్‌బెల్‌తో వచ్చిన ప్యూ న్లూ, గార్డులూ సచ్చిదానందమూర్తిని రెక్కలు పుచ్చుకొని బయటకు మోసుకుపోయారు. సిద్ధంగా ఉన్న ప్రెస్ ఫొటోగ్రాఫర్లు ఆ దృశ్యా న్ని ఫొటోల్లో భద్రపరిచారు.

"ఎవరీ సచ్చిదానందమూర్తి?" గట్టిగా ప్ర శ్నించాడు స్వామి.

మరుసటిరోజు పేపర్లు అతనికి జవాబుని చ్చాయి.

సచ్చిదానందమూర్తి కథనాన్ని ఓ పత్రిక సెన్సేషనల్‌గా ప్రచురించింది. విద్యార్థులకు రక్షణ కల్పించటంలో విఫలమయిన హోంశాఖ తన వైఫల్యాలను కప్పిపుచ్చుకోటా నికి ఆ విద్యార్థుల తల్లిదండ్రులను బయటికి నెట్టివేయటం దురదృష్టకరమంది. తాను కో ర్టుకు వెళ్లబోతున్నట్లు సచ్చిదానందమూర్తి చే సిన ప్రకటనను ప్రచురించింది.

స్వామి ఆదేశాలు నగరంలోని పోలీసు కా ర్యాలయాలకు పాకిపోయాయి.




"విద్యార్థుల పట్ల మెతక ధోరణి విడిచిపెట్టండి. డూ యువర్‌బెస్ట్- మిగిలినదంతా నాకు విడిచిపెట్టండి. మీకు పూర్తి స్వాతంత్ర్యాన్నిస్తున్నాను"

పూర్తి స్వాతంత్ర్యం అనే మంత్రం! తిరుగులేని మంత్రం. మానవుడా నీ సుందర స్వప్నం పూర్తి స్వాతంత్ర్యం. అదే నిన్ను సంపూర్ణంగా బంధించటానికి వాడే అమోఘ మంత్రం!

అనుకున్నాడు డీయస్పీ మూర్తి టోపీని పెట్టుకునేముందు.

జిగా వున్నట్లు అప్పుడే అర్థమయినట్లనిపించింది.

వేణూ యింటికి తాళంకప్ప వేలాడుతోంది. ఆ తర్వాత ఏంచేయాలో వెంటనే తోచలేదు. చుట్టుపక్కల విచారించాడు. గడచినరాత్రి వేణూ యింటికి రాలేదన్నారు. ఇంటికివచ్చిన వెంటనే తనను వచ్చి కలుసుకోమని ఓ కాగితం మీద రాసి తలుపు సందులోంచిలోనికి జారవిడిచాడు.

నగరంలో ఆరు ప్రభుత్వాస్పత్రులున్నాయి. ఎక్కడా విద్యార్థుల సమాచారం దొరకలేదు. సాయంత్రం అయిదున్నరయింది. రాజుకి ఫోనుచేసి వేణూని ఏదోచేయించావని తిడదామనుకున్నాడు. జరిగిన విషయం గురించి తెలుసుకుందామన్న ఊహకలిగింది. పోలీసులను విచారించాలంటే ఎన్నిస్టేషన్లలో విచారించగలడు? వేణూ మిస్సయినట్టు కంప్లైంటు యిద్దామా అనిపించింది. చివరకి పత్రికా కార్యాలయంలో విచారించితే? ఆ ఊహరాగానే తిరిగి ఉత్సాహం చిగురించింది.




టేబుల్ మీదున్న ఫైళ్లన్నింటినీ క్లియర్ చేసేసరికి పదకొండయింది. టీ తాగుతూ పేపరు చూడసాగాడు సీతారాం.

విద్యామంత్రితో చర్చలకోసం వెళ్తున్నామని చెబుతున్న కొందరు విద్యార్థి నాయకులపై పోలీసులు లాఠీఛార్జి జరిపారు. పారిపోతున్న వారిని పట్టుకొని విచక్షణారహితంగా కొట్టినట్లు తెలుస్తోంది. రోడ్డుమీద స్పృహతప్పిపడున్న విద్యార్థులను ఆస్పత్రిలో చేర్పినట్లు అలన్యంగా అందిన సమాచారాన్నిబట్టి తెలుస్తోంది. మూకగా విద్యామంత్రి యింటిమీదకు తరలివెళ్తున్న విద్యార్థులు దౌర్జన్యానికి దిగినట్లూ పరిస్థితిని అదుపులోకి తీసుకురాటానికి లాఠీఛార్జి జరపవలసివచ్చినట్లూ పోలీసు వర్గాలకథనం. గాయపడినవారిలో ఒకరు తీవ్రంగా గాయపడినట్లు తెలుస్తోంది.

క్షణకాలం షాక్ తగిలినట్లుగా ఉండిపోయాడు సీతారాం. తాగుతున్న టీని అలాగే వదిలేసాడు. గబగబాలేచి సెలవుదరఖాస్తు యిచ్చేసి బయల్దేరాడు.

వేణూ ఉంటున్న ప్రాంతానికి చేరటానికి సలభై నిమిషాలకు పైగా పట్టింది. నగరం యింత విశాలంగా యింత యిరుకుగా గజిబి

"క్షమించాలి సర్! ఆ వార్త తప్పించి మాదగ్గర మరే వివరాలూ లేవు"

సీతారాంకి విపరీతమయిన నీరసం ఆవహించింది.

ఉదయం ముట్టుకున్న టీ తప్ప మంచినీళ్ళు కూడా తాగలేదు. గుండె ఊడి చేతిలోకి వచ్చేస్తున్నట్టుంది. ఎదురుగా బల్లకపతలగా కూర్చున్న సబెడిటర్ పేపర్లూ కాగితాల మధ్య కలగలసిపోయాడు. కళ్ళు చీకట్లు గమ్ముతున్నాయి. నోటిలోంచి మాటరావటం లేదు.

ఎంతో ప్రయత్నంమీద 'దాహం...' అన్నట్టు సైగచేసాడు. చటుక్కునలేచి అతను గ్లాసుతో నీళ్ళుతెచ్చాడు. కొద్దిగా మొహంమీద చిలకరించి కళ్ళుతుడిచాడు. ఆ గ్లాసుడు నీళ్ళతో కడగంటిపోయిన ప్రాణాలు తేడుకున్నట్టయింది.

"-కృతజ్ఞుడిని-" అంటూ లేవబోయాడు.

"మీ అబ్బాయి ఎవరయినా కనిపించటం లేదా?"

సీతారాంకి జవాబుతోచలేదు. "అవును..."

"అయామ్ సారీసర్! ఈ సమాచారం మా విలేకరి ఫోనుమీద నిన్నరాత్రి ఏడున్నరగంటలకు తెలియజేసినట్టుంది. నేనపుడు డ్యూటీలో లేను. మీ అబ్బాయి మిత్రులను విచారించండి. కంగారుపడకండి- మరేదయినా సమాచారం వస్తే తెలియజేస్తాను. మీకు ఫోను ఉందా?"

సీతారాం తన నంబరు యిచ్చి కృతజ్ఞతలు మరోమారు చెప్పిబయల్దేరాడు.

అతను యింటికి చేరేసరికి రాత్రి ఎనిమిదయింది.

లోపల హాలులోంచి సుపరిచితమయిన గొంతు వినిపిస్తోంది. వేణూగొంతు! మెదడు ఆ విషయాన్ని గ్రహించినా హృదయం దానిని భ్రాంతిగా భావిస్తోంది.

అడుగులు గబగబా పడ్డాయి.

వేణూ ఓ సోఫాలోనూ, శారద మరోసోఫాలోనూ కూర్చుని ఉన్నారు. వాళ్ళిద్దరి మధ్యా ఏదో సంభాషణ సాగుతున్నట్టుంది. రాధ అక్కడే ఉంది.

"-అరుగో... వచ్చేసారు-" అంది శారద లేచి.

గుమ్మందగ్గర నిలబడిపోయిన సీతారం దగ్గరకి వేగంగా నడిచాడు వేణు. అతని భుజంమీద చేతినివేసి ఆనుకుని నెమ్మదిగా నడుచుకుంటూ వచ్చాడు సీతారాం. రాధ మరోపక్కన పట్టుకుంది.

"ఏం జరిగిందండీ-?" కంగారుగా అతన్ని సమీపించింది శారద.

సోఫాలో కూర్చోబెట్టి మంచినీళ్ళు తీసుకురమ్మన్నాడు వేణు. చల్లటినీళ్ళు తాగించాడు. ఫాను హెచ్చించింది శారద. వేణూచేతిని పట్టుకున్న సీతారాం చేయిబిగుసుకుంది. రాధ కళ్ళలో నీళ్ళు నిలిచాయి. వేణూ కళ్ళతోనే ఏమీ ఫరవాలేదన్నట్లు భరోసాగా సైగచేశాడు. శారద వేడివేడి హార్లిక్స్ తీసుకువచ్చి యిచ్చింది. వేణూ నెమ్మదిగా సీతారాంకి పట్టించాడు.

కొంచెంతాగాక తనే తీసుకుని తాగాడు సీతారాం.

పేపరు చూసినదగ్గర్నుంచీ జరిగినదంతా చెప్పాడు. అంతా విన్నాక వేణూమెల్లగా అన్నాడు-

"లాభంలేదంకుల్! మీరు నామీద చాలా మమకారం ఏర్పర్చుకున్నారు" అతని గొంతు నిండా రకరకాల భావాల, ఉద్విగ్నత.

"ఇంతకీ ఏం జరిగిందీ?" అడిగాడు సీతారాం బరువుదించినట్లు నవ్వుతూ.

వేణూ జవాబివ్వలేదు. అతని మొహంలో అంతుపట్టని భావాలు.

"మాట్లాడు వేణూ!"

"ముందు స్నానంచేసి భోంచేసి రిలాక్స్ అవ్వండి-" అన్నాడు.

స్నానంచేసి వచ్చాడు సీతారాం.

రాధా వేణూ డ్రాయింగ్‌రూంలో ఉన్నారు. వాళ్ళు చాలాసేపటినుంచి ఏమీ మాట్లాడుకోనట్టు కూర్చుని ఉన్నారు. సీతారాం ఒక్కక్షణం పరిశీలనగా చూసివచ్చి కూర్చున్నాడు.

"ఇప్పుడు చెప్పు-"

"భోజనం...?"

"చేయొచ్చులే... ముందు విషయం చెప్పు"

"మనం బయట కుర్చీలు వేసుకుందామంకుల్!"

రాధ ఆమాట వినగానే లేచి అక్కడనుంచి వెళ్ళిపోయింది. వెళ్తూన్న ఆమె వయిపుచూసి వేణూ ఒక్కసెకను స్తబ్ధంగా ఉండి ఏదో నిశ్చయానికి వచ్చినట్లు రెండు కుర్చీలను తీసుకుని బయటకు నడిచాడు. సీతారాం యిద్దర్నీ పరిశీలనగా చూసి వేణూని అనుసరించాడు.

ఇద్దరూ కూర్చున్న వెంటనే వేణూ ఆటెంటివ్‌గా ముందుకు వంగి మొదలెట్టాడు-

"రాత్రి దెబ్బలు తిన్నవాళ్ళు మావాళ్ళు కాదంకుల్! నాకు రాత్రే సమాచారం వచ్చింది. మేం వెళ్ళేసరికే వాళ్ళు గట్టిగా దెబ్బలు తిన్నారు. ఓ ప్రైవేటు ఆస్పత్రిలో చేర్చాం! రాత్రంతా అక్కడే ఉన్నాము. విద్యామంత్రిని కలుసుకోడానికి వెళ్తున్నవాళ్ళను పోలీసులు ఎందుకు కొట్టవలసివచ్చిందో అర్థంకావటంలేదు.

చల్లగా గాలి వీస్తోంది.

వేణూ పూర్వంలాఉత్సాహంగా చెప్పటంలేదన్న విషయం సీతారాం గమనంలోకి రాలే





దు. అంతా చెప్పాక వెనక్కి జారబడి ఆకాశంలోకి చూసాడు వేణూ.

చుక్కలు కుప్పలు పోసినట్లున్నాయి.

చుక్కలు వెదజల్లబడినట్టున్నాయి.

చుక్కలు రకరకాల రూపాలు ధరించుతూ మారిపోతున్నట్టున్నాయి. తానెక్కడున్నదీ ఏం చేస్తున్నదీ ఏ ఆలోచనలు చేస్తున్నదీ అర్థంకాకుండా పోయింది. వేణూ ఆ స్థితిలో కొద్దిసేపు వుండి చటుక్కున కదిలి సీతారాంతో అన్నాడు-

"మీరు నామీద అర్థంలేని మమకారం పెంచుకున్నారంకుల్! అందుకునేను తగను. ఇది మీకూ నాకు కూడా మంచిదికాదు"

సీతారాం అతని చేతిమీద సంబాళించుకోమన్నట్టు తట్టి చిన్నగా నవ్వాడు.

"నేను నీతో ఒక్క విషయం చెప్పాలనుకుంటున్నాను వేణూ!"

సీతారం గొంతు దృఢంగా నిశ్చయంగా ఉంది.

"రాధని నీ చేతిలో పెడదామనుకుంటున్నాను"

ఆ ముక్కచెప్పాలన్న ఊహ - ఆరోజే చెప్పాయ్యాలన్న ఊహ- ఆ క్షణంలోనే చెప్పితీరాలన్న ఊహ - ఆ వ్యక్తిలో ఆరోజు వరసగా జరిగిన పరిణామాల ఫలితం. ఉదయం ఆ వార్త తెలిసిన క్షణంనుంచీ పడిన ఆందోళన - ఇంటికి చేరగానే అతను క్షేమంగా కన్పించగానే కలిగిన ఉద్విగ్నతా - రాధనీ శారదనీ అతన్నీ కలిపిచూసినపుడు అతనూ కుటుంబంలో కలిసిపోయాడన్న అనుభూతీ - రాధా అతనూ ఎడముఖాలుగావుంటే తన అంగీకారం అసాధ్యమనీ తనవంటి మనిషిని బాధించి నిన్ను చేరువచేసుకోనని రాధని వేణూ నిరాకరించి ఉండవచ్చనీ ఫలితంగా వారిద్దరి మధ్యా ఆ ఎడముఖం ఏర్పడినట్లు మనసుచేసిన కల్పనా - ఆ కల్పనను సమర్థిస్తూ తనను మమకారం పెంచుకోవద్దని వేణూ చేసినట్లనిపించిన హెచ్చరికా - సీతారాంలో ఆ మాటను ఆ క్షణంలోనే చెప్పేటట్టు చేసాయి.

సీతారాం దృష్టిలో వేణూ నిరాకరించే అవకాశమేలేదు. ఎంత నిరాకరించినా అది వేణూ వినమ్రతే అవుతుంది.

వేణూ పెద్దగా నిట్టూర్చి - "అంకుల్-!"

అతన్ని మాట్లాడనివ్వలేదు సీతారాం.

"వేణూ! నువ్వు నన్ను కొంత నన్నిహితంగానే చూసావు. ఎక్కువ మాట్లాడ్డం నా అలవాటు కాదు. ఈ సమయంలో నీకు కలిగే ప్రతి ఫీలింగూ నాకు అర్థమవుతాయి నీ గురించి నాకు పూర్తిగా తెలుసు"

అంటూ ఆగి-

"మీ ఇద్దరి వివాహానికీ నానుంచి ఎలాంటి షరతులూ లేవు. నీకు వయసు చిన్నదనుకుంటే ఎన్నాళ్ళయినా ఆగుతాను. నీకు అభ్యంతరం లేకపోతే నా ఇంట్లో వుండి చదువుకొంటే నాకు చాలా సంతోషంగా ఉంటుంది. శారదా, నేనూ నీకు తలిదండ్రులు లేనిలోటు తీరుస్తాం- పోతే...

...నీ కార్యకలాపాలపట్ల కూడా నాకు ఏమంత అభ్యంతరం లేదు వేణూ! నీతో మసిలాక నేను ఒక్క విషయాన్ని స్పష్టంగా గ్రహించాను. ఈ జీవితంలో నాబోటివాళ్ళు లోనయ్యే ఘర్షణకు కారణాలు యిన్నాళ్ళూ నేను భావిస్తున్నట్లు - నాపై ఆఫీసర్ల స్వార్థమూ అవినీతి కావు. ఈ క్రమంలో ఏదో లోపముంది. దాన్ని అర్థంచేసుకుంటూ సరిదిద్దాలని ఈ ప్రయత్నం"

క్షణం ఆగి మళ్ళీ అన్నాడు సీతారాం.

"నీ జీవితం నీవు ఎలా వినియోగించుకున్నా నేను అడ్డంకి కాను! మరోమాట చెప్పకు-"

చాలా బాగా మాట్లాడానన్న తృప్తి సీతారాంకి కలిగింది.

"నాకు బాగా ఆకలిగా ఉందంకుల్- భోంచేద్దాం"

ఇద్దరూ లోపలికి నడిచారు.

వీలుచూసుకొని శారదతో వేణూతో చెప్పేసిన విషయాన్ని చెప్పాడు. ఆమె అంది-

"మీకన్నా ఎక్కువ తెలుసునా నాకు? మీ యిష్టం"

'కన్నాంకరా! కాలాంకరా! ముఖం చూస్తే బట్టలు చూస్తే కులమూ, మతమూ ఒకప్పుడు తెలిసేవికనక కులమూ మతమూనూ! ఇప్పుడేముంది? అందరు కట్టేదీ అదే బట్ట అదే వేషమూనూ! వాను ఎక్కడున్నాడో, ఏమయ్యా



డో? కనీసం యిద్దైనా సుఖపడుతుంది! ముఖం చూపిస్తే బాగుండిపోను - బాబాగారు అంతా పూసగుచ్చినట్టు చెప్పేస్తారు! ఈ మహానుభావు డికీ ఆయన ఊహలేగదా! రాడు! పోన్లే! ఆడ దాని సుఖమంతా మగాడి అపేక్షలోనూ, యిచ్చే విలువలోనే గదా ఉండేది! ఈ కులమూ మత మూ డబ్బూ దనకమూ హెూదా వల్లకాడూ ఎన్నున్నా ఎన్ని గుడులకి కొంగట్టుకొని తిరిగినా ఎన్ని వ్రతాలు కలిసిచేసినా ఎందరు బాబా లకు కలిసి మొక్కినా ఆడదానికి సుఖమివ్వ టంలో అలాంటాళ్ళెప్పుడూ యిలాంటళ్ళ ముందు దిగదుడుపే! తీసికట్టే! పిల్ల మన సుకు సుఖంగా ఉంటుంది!'

-అనుకుంది శారద.

అలా అనుకున్నాక ఆమెకి వేణూ పట్ల పుత్రప్రేమ కలిగింది.

భోజనాలు పూర్తయాయి.

వేణూ మళ్ళీ బయటకూర్చుందామన్నాడు.

కూర్చున్నాక వేణూ ఆలశ్యం చెయ్యలేదు. నిదానంగా నిశ్చయంగా అన్నాడు.

"అంకుల్... రాధను నేను వివాహం చేసుకో లేను"

"వేణూ!!"

"మీరు నాకిచ్చిన అవకాశం విలువ నాకు తెలుసంకుల్! కానీ నా జీవితంలో..."

"వేణూ! మైబోయ్! నువ్వేం చేసినా అడ్డురా నని ముందే చెప్పాను"

సీతారాం మాట్లాడినపుడు వేణూకి కలిగిన ఆలోచనల్లో ఏ ఒక్కటీ ఓ క్రమంలో లేవు. వాటిని ఓ కొలిక్కి తేటానికి భోజనాన్ని అడ్డుపె ట్టుకున్నాడు. సీతారాం భోజనమయాకనే తానేం చెప్పినా చెప్పాలనుకున్నాడు. భోంచేస్తు న్నంతసేపూ ఆ భౌతిక చర్యలో మానసిక కార్యకలాపాన్ని సద్దుబాటుచేసుకొన్నట్టే అని పించింది. కానీ - లాభంలేదు! దీనిని తెగనర కవలసిందే! ఈ మానవుడిలోని అవధులు మించిన మమకారోద్రేకాన్ని నిర్దాక్షిణ్యంగా హతంచెయ్యాల్సిందే! తనలో భద్రజీవితం పట్ల తలెత్తిన ప్రలోభం అది ఎంత చిన్నద యినా దానిని రూపుమాపవలసిందే! వధించ వలసిందే!

వణుకుతున్న గొంతుతో అన్నాడు వేణు.

"వాసూ యింట్లోంచి వెళ్ళిపోటాన్కి కార ణంనేనే! నావల్లే అందుకు అవసరమయిన ఆలోచనలు వాడిలో కలిగాయి. మీరు వచ్చేసరి కి ఆరోజు వాడు నా దగ్గరే నా యింట్లోనే ఉన్నాడు. మీకూ, రాజుగారికీ ఉన్న కనెక్షన్స్‌వ ల్ల పోలీసులు వెంటనే రంగంలోకి దిగితే వాడికి బయటికిపోయే అవకాశాలుండవని జా ప్యం చెయ్యటాన్కి ప్రయత్నించాను నేను- వెళ్తాను!" లేచాడు వేణు.

"కూర్చో!"

కట్టేసినట్టుగా కూర్చుండిపోయాడువేణు.

చాలాసేపటిదాకా సీతారాం మాట్లాడలేదు.

"రెండు ప్రశ్నలు!"

"అడగండి!"

"వాసూ క్షేమంగా ఉన్నాడా?"

"ఉన్నాడు"

"ఇదంతా రాధకి తెలుసా?"

"తెలీదు. ఆమె వచ్చేసరికే అతన్ని దాచా ను నేను"

"మరొక్క ప్రశ్న..."

"...."

"రాధని నువ్వు ప్రేమిస్తున్నావా?"

"నాకు ప్రేమంటే తెలీదు. రాధపట్ల ప్రేమ ఉన్నదో లేదో తెలీదు. ఉన్నది ప్రేమోకాదో తెలీదు. నాకు తెలిసున్నదల్లా ఆమెతో నా జీవితం భద్రంగా ఉంటుంది. చాలామందికి అందుబాటులో లేనివీ కొందరికి అందుబా టులో ఉన్నవీ అందరూ ఆశించేవీ నాకు అందుతాయి. నాకు తెలీనిదల్లా ఆమెతో నాకు సుఖంగా ఉంటుందో ఉండదో"

హృదయానికీ అనుభూతికీ విలువనీయా ల్సిన వ్యవస్థా.. పరస్పరేచ్ఛ మాత్రమే వివాహని ర్ణయానికి ముఖ్యమయ్యే వ్యవస్థా... ఇద్దరు కలిసి జీవించటానికి హృదయపు వత్తిడి తప్ప మరే అవసరాల వత్తిడీ లేని వ్యవస్థా... వచ్చేవ రకూ రాధని ప్రేమిస్తున్నానో లేదో నేను నిశ్చ యించుకోలేను"

ఎదుటనున్నది వయసులో పెద్దవాడనీ - తాను ఎవరిగురించి మాట్లాడుతున్నానో ఆ వ్యక్తి కన్నతండ్రనీ - తన మనోసంచలనమంతా




అతనికి చెప్పాల్సిన పనిలేదనీ ఆ యువకునికి గుర్తురాలేదు.

మరొక్క నిమిషం అక్కడ ఉండలేనని అన్పించింది.

"వస్తానంకుల్?"

పెద్దపెద్ద అంగలతో పరుగెత్తుతున్నట్లే బయటికిపోయాడు.

ఆకాశంలో చుక్కలన్నీ రాధ చూపుల ప్రకాశాన్ని ఆమె ప్రగాఢానురాగాలకు సంకేతంగా గుర్తు చేస్తున్నట్టున్నాయి.

విశాలమైన పృథ్వీ అనంతమైన ఆకాశం ఆ యువకుని చిన్ని మనసుతో ఒకటైపోతున్నట్టనిపిస్తోంది.

ఆ క్షణంలో ఆ యువకునికి లభించని తర్కమొక్కటే!

తాను చేజేతులారా వదిలేసుకోవటంవల్లనే - వదిలేసుకుంటున్నాననుకోవటంవల్లనే ఆ వదిలేసుకుంటున్న దానికి అంతగా విలువను ఆపాదించుకున్నాడని!

★ ★ ★

"వీసీ అమెరికా పోతున్నాడూ - ఆ కార్యాలయాన్ని ధర్నా చేయాలని పిలుపు ఇస్తారు. మెరుపువేగంతో స్టూడెంట్స్ పోగయిపోతారు. కంట్రోలర్ ఆఫీసులో ఎవరినో పట్టుకుంటారు. వీసీ గదిలో ఉండగా తాళం వేసేస్తారు. పోలీసులు రంగంలోకి వస్తారు. మీరు పని మొదలెడతారు. ఏంచేస్తావో నీ ఇష్టం! వేణూగాడవనీ మరెవడవనీ ఈ దొమ్మిలో ఏమయినా మీ ఓపిక! పోలీసు తుపాకీగుళ్లు మాత్రం కనబడతాయి!" అంటూ ఒక్కక్షణం ఆగాడు స్వరాజ్యపతి.

"-పెద్దాయనకిదంతా ఇష్టంలేదు. ఆయన్ని ఒప్పిద్దామన్నా వీల్లేదన్నారు. వాళ్ల కర్మకాలి వాళ్లుపోతే మనమేం చేయగలం? మనం మాత్రం తొందరపడకూడదు- అన్నారాయన. మీ మూడ్‌చూసి నేనేం అనలేకపోతున్నాను. వీలయితే వదిలేయండి-"

మధు బృందం తల పంకించింది.

★ ★ ★

మంత్రిమండలి సమావేశం మొదలైంది. అజెండాలోని విషయాలమీద చర్చముగిసాక ముఖ్యమంత్రి అన్నాడు-

"విద్యార్థుల ఉద్యమం మొదలై మూడోనెల నడుస్తోంది. సమావేశానికి ఉద్యమంలోని వెంకట్రామయ్య ప్రత్యక్షంగా ప్రవేశించాడని మీకందరికీ తెలుసు. అందువల్ల విద్యార్థులతో చర్చలద్వారా పరిష్కారానికి వచ్చే మార్గాలన్నీ మూసుకుపోయినట్లే మనం భావించాలి"

"నేనలా భావించలేను-" అన్నాడు అటవీ శాఖామాత్యుడు.

"మరెలా భావించగలరూ-" అన్నారొకరు.

"ఉద్యమానికి లాయర్లూ, డాక్టర్లు, విద్యావేత్తలూ ఎందరో మద్దతునిస్తున్నారు. వాళ్లలో వెంకట్రామయ్యగారూ ఒకరు. ఉద్యమం విద్యార్థులది. కోర్కెలు విద్యార్థులవి. మనం ఆ కోణంనుంచే ఆలోచించాలి"

"నా అభిప్రాయమూ అదే! విద్యార్థుల కోర్కెల సమంజసత్వం సాధకబాధకాలమీదనే చర్చసాగటం ధర్మం" అన్నాడు విద్యామంత్రి.

ముఖ్యమంత్రి కళ్లు పెద్దవిచేసి అతన్ని చూశాడు. మరెవరయినా మాట్లాడతారా అన్నట్టు అందర్నీ చూస్తూ హోంమంత్రి స్వామిని పరిశీలించాడు.

"మీరేదో చెప్పాలనుకుంటున్నట్టున్నారూ-?"

"వెంకట్రామయ్య దీన్ని సమర్థించాక మనమింకా తర్జనభర్జనలు చేయటం మీనింగ్ లెస్! వేస్టసార్!"

విద్యామంత్రి లక్ష్మీనారాయణ వెంటనే అందుకున్నాడు-

"ఇదంతా తమరివల్లే వచ్చింది-"

"నావల్లా... స్వామిగొంతులో ఆశ్చర్యంతోపాటు కోపం తొంగిచూసింది.

"ఆహా... తమరివల్లే- ముమ్మాటికీ తమరివల్లే. నన్ను కలుసుకోటానికి వచ్చిన కుర్రాళ్లని ఎందుకు కొట్టించారు? మిమ్మల్నెవడు పిలిచాడు?"

"దౌర్జన్యానికి దిగిన విద్యార్థుల్ని అదుపులో తేవటానికి లాఠీచార్జీ జరపవలసి వచ్చినట్లు పోలీస్ కమిషనర్ పేపర్లో ప్రకటించాడు. మీరు చదవటం నేర్చుకోవాలి"

"చాలా అవమానిస్తున్నారు" లేచినుంచుని



ఉద్రేకంగా అన్నాడు.

"మీరు కూర్చోండి లక్ష్మిగారూ-" అన్నాడు ముఖ్యమంత్రి.

"ఆయన తనమాట వెనక్కి తీసుకుంటే తప్ప నేని సమావేశంలో ఉండను-"

"స్వామిగారూ మీరయినా-" ఎవరో చెప్పబోయారు.

"కుర్రాళ్లను నేను కొట్టించానని ఆయనా అన్నాడు. అంతకన్నా డామేజింగ్‌గా నేనేం అనలేదు-" స్వామి భుజాలు ఎగరవేస్తూ దానికీ దీనికీ చెల్లు అన్నట్లు ముఖంపెట్టాడు.

"లక్ష్మిగారు! నామీద గౌరవముంచి కూర్చోండి! ఈ విషయం తర్వాత చూసుకుందాం" అన్నాడు ముఖ్యమంత్రి.

అతని ముఖంలోకి చూడలేదు. ఒక్క తృటి కాలం ఆలోచించాక తానే ముందర తొందరపడినట్లు అనిపించింది. ఒప్పుకోడానికి టైము తీసుకున్నాడు విద్యామంత్రి.

"సర్లెండి!" అనేసి కూర్చున్నాడు.

"వెంకట్రామయ్యే విద్యార్థులకు మద్దతునివ్వటం పాయింట్‌కారాదని అంటారు మీరుభయులూ... కావచ్చు. విద్యార్థులతో చర్చలకు మార్గాలు మూసుకుపోయినట్లే అనటంలో నా ఉద్దేశం వేరే ఉంది. వెంకట్రామయ్య అంత సులువుగా చర్చలద్వారా దీనిని పరిష్కరించనీయడూ అన్నదే నా ఉద్దేశం. అతనికి ఇంతకన్నా మంచి ఇష్యూ చూపించేవరకు దీనిని ఆయన వదలడు. అధికారంలోంచి దిగాక భాషను నిరాదరణ చేస్తున్నామని మొదలుపెట్టాడు. దానిని టీవీ ప్రత్యేక చానల్ ఉద్యమంగా మార్చాం! గిట్టుబాటుధరల కోసం రైతులు ఆందోళన మొదలుపెడితే వారు అందులో చేతులూ కాళ్లూపెట్టేసి ప్రభుత్వం నిర్లక్ష్యం వహించిందన్నారు. అందులోంచి వాళ్లని తప్పించటానికి మనం వాళ్ల పాలనలో అవినీతి గురించి విచారణసంఘం నియమించాం. దాంతో వారు మనమీద ఆరోపణలతో పెడాపెడా బిజీ అయిపోయారు. అసెంబ్లీ సమావేశాల్లో వారు అసలు సమస్యలు వదిలేసి కొసలు పట్టుకోటానికి ఏదో మేత మనం ఇవ్వాల్సి వస్తూనే ఉంది. మనని అన్‌పాపులర్ చేయటంద్వారా పాపులర్ అవటానికి వాళ్లూ వాళ్లని తట్టుకోవటానికి, తప్పుకోవటానికీ మనమూ - రకరకాల తిప్పలుపడవలసి వస్తోంది. ఈ అనుభవంతో చూస్తే విద్యార్థుల సమస్యలను వెంకట్రామయ్య చర్చలద్వారా తెగనివ్వడన్నది స్పష్టం"

"కాబట్టి మనం విద్యార్థులతో చర్చించలేము-" అని అటవీమంత్రి వయిపుచూస్తూ నవ్వి - "యిప్పట్లో" అన్నాడు. ఆగకుండా కొనసాగించాడు.

"-అయితే విద్యార్థి ఉద్యమం బలపడింది. దీనిని మనం నిర్లక్ష్యం చేయడానికి వీల్లేనిస్థితి వచ్చింది. విద్యార్థి సంఘాలన్నీ దాదాపుగా దీనికి మద్దతునిస్తున్నాయి. మరెన్నో సంఘాల నుంచి సానుభూతి ఉంది. ఈ సంఘాలకు వ్యతిరేక సంఘాలనుంచి మనం కొద్దిపాటి వ్యతిరిక్తతను ఆశించటం న్యాయం. కానీ అవీ తటస్థవైఖరి కనబరుస్తున్నాయి. అయితే రెండు ప్రముఖ సంఘాలు మాత్రం దీనికి మద్దతు యివ్వలేదు. అధికారంలోఉన్న మనం మనబలం ఏమిటో తెలిస్తే తప్ప ఏ నిర్ణయమూ చేయలేము. ఆ విద్యార్థి సంఘాలు మనని త్వరలోనే కలుసుకోబోతున్నాయి. వాళ్ళతో మనం-"

స్వామిచెయ్యి ఎత్తాడు.

ముఖ్యమంత్రి అతన్ని పట్టిచూసి- "చెప్పండి"

"మీరేంచేస్తే మేం కాదన్నాం సార్, కానీ" అన్నాడు.

"నేననేదీ అదే! ఎందుకీ రాజకీయాలు? వాళ్లకోర్కెలు మూడేమూడు. కాంపెన్సేటరీ మార్కులు. పేపర్లు తిరిగి దిద్దించటం. అనామలిస్‌కి బాధ్యులని శిక్షించడం- చర్చలకు పిలిచి మార్కులిచ్చేస్తామంటే మిగిలినవాటిని వాళ్ళేవదిలేస్తారు-" మధ్యలో అన్నాడు విద్యామంత్రి.

"అంత సులువుగా చచ్చినా ఒప్పుకోరు సార్! ఏ రాజకీయాలూ అక్కర్లేదు. సింపుల్‌గా వాళ్ళని చితగ్గొట్టేస్తే సరి. ఒక్కటి ఒప్పుకుంటే వంద అడుగుతారు. వంద తగల్నిస్తే ఒక్కటైనా చాలుబాబోయ్ అంటారు"- వాళ్ళమీద దౌర్జన్యం తగదు. శాంతిగా సాగుతున్న ఆందోళనకు విలువనివ్వాలన్నాడు విద్యామంత్రి.





మనం మెతకగా వ్యవహరించబట్టే వాళ్ళ ఆందోళన శాంతిగా కనిపిస్తోందన్నాడు స్వామి.

ఇద్దరూ వాదనమీద వాదన పెంచారు. బాగా ఉద్రేకాలను పెరగనిచ్చి అన్నాడు ముఖ్యమంత్రి-

"మీకు విద్యార్థుల కోర్కెలు తీరటమేగదా కావలసిందీ-?"

"కనీసం న్యాయమైనది.. ఒక్కటైనా సరే!" అన్నాడు విద్యామంత్రి.

"విద్యార్థులకు గుణపాఠం చెప్పాలంటారు మీరు-" అన్నాడు హోమ్‌మంత్రితో.

"మళ్ళీ కొన్నేళ్ళదాకా ఉద్యమం ఊసుఎత్తకుండా సరయిన డోసు యివ్వాలిసార్..."

"సరే! వెంకట్రామయ్య ప్రతినిధులతో చర్చించటం కొందరికి యిష్టంలేదు. మనపట్ల ఆసక్తి చూపిస్తున్న పార్టీ విద్యార్థులతో చర్చలకు ప్రాధాన్యత యివ్వాలని మరో అయిడియా. ఇవన్నీ నెరవేరితే మీకు అభ్యంతరం లేదు గదా!" అందరూ అంగీకారంగా చూసారు.

"వాళ్ళు ఉద్యమాన్ని ఉధృతం చేస్తారు. మనం దృఢచిత్తంతో వ్యవహరిస్తాం! క్లాసులకు హాజరయితే తప్ప చర్చలు లేవంటాం! మేం చర్చలకు సిద్ధమేగాని ఒత్తిడులకు లొంగమంటాం! విద్యార్థులని అణచటానికి యత్నిస్తాం! సభలు జరగకుండా చేస్తాం! తద్వారా స్వామిగారి ఆలోచన నెరవేరుతుంది. నేనూ విద్యామంత్రీ మనకి అనుకూలమయిన సంఘంతో చర్చించుతాం! సాధ్యమయిన కోర్కెలు ఒప్పుకుంటాం! ఉద్యమాన్ని పక్కదోవ పట్టించినట్లుగా ఓ ప్రకటన యిప్పించి వెంకట్రామయ్య వర్గాన్ని అప్రదిష్టపాలుజేస్తాం"

మంత్రిమండలి సమావేశం ముగిసింది.

ముఖ్యమంత్రి హోంమంత్రిని తనగదిలోకి ఆహ్వానించాడు.

"-నాభయమేంటంటే మనం కఠినంగా వ్యవహరించితే ఏదయినా ప్రాణనష్టం సంభవించిందనుకోండి స్వామిగారూ! అన్ని డిమాండ్లనూ పక్కనబెట్టి విద్యామంత్రి రాజీనామా చెయ్యాలని విద్యార్థులు కోరినా కోరవచ్చు. ఇదంతా లేనిపోని తలనొప్పి. మీరు కాస్తంత మెలకువతో వ్యవహరించాలి"

"చాలా జాగ్రత్తలు తీసుకుంటాను సార్!" అన్నాడు స్వామి ముఖ్యమంత్రితో సిన్సియర్‌గా.

ఆ తర్వాత విద్యామంత్రితో సమావేశం జరిపాడు ముఖ్యమంత్రి.

"పోలీసులు దౌర్జన్యానికి దిగితే విద్యార్థులు ఊరుకుంటారా? ఇవేం మనరోజులు కాదు గదా! వాళ్ళూ దిగుతారు. లాఠీ ఛార్జిలతో ఏ గొడవ తెగిందీ! కాల్పులంటే ఒకరూ యిద్దరూ పోక తప్పదు. అప్పుడు హోంమంత్రి బాధ్యత వహించి రాజీనామా చేయాలని కోరినా కోరగలరు"

విద్యామంత్రి మనసులో భగవంతుడిని వేడుకున్నాడు.

"అలా అయితే కనీసం యిద్దరినయినా చంపించు దేవా!"

విద్యామంత్రి వీసీగురించి చెప్పటం మొదలుపెట్టాడు.

"నర్లెండి! వీసీతో అంతా చర్చించాను. ఆయనదంతా వితండవాదన. తనకన్న సత్యసంధుడులేడని భావిస్తాడు. చివరికి ఓ నిర్ణయానికి లాక్కునివచ్చాను"

"చెప్పండి!" అన్నాడు ముఖ్యమంత్రి కుర్చీలో జారబడి.

"పేపర్లు దిద్దటంలోనూ, టాబ్యులేషన్‌లోనూ తప్పులు జరిగాయని రిపోర్టువచ్చిన కేసులన్నింటినీ లోకాయుక్తకు పంపాలి. గడచిన మూడేళ్ళలోనూ ఉత్తీర్ణతాశాతం ఎందుకు పడిపోయిందో పరిశీలించి సరిదిద్దటానికి, రికమండేషన్స్ యివ్వటానికి ఓ కమిటీని నియమించాలి-"

"అంతేనా?"

"మార్కులకి మాత్రం ఒప్పుకున్నాడుగాదు-"

"ఏం?"

"ఓమారు విద్యార్థుల ఒత్తిడికి లొంగి మార్కులుయిస్తే అది అలవాటైపోతుందిట. కొన్నాళ్ళకి కనీసపు మార్కులు ముప్పై అయిదునించి తగ్గిపోతాయిట"

"మూడేళ్ళని అన్నాడా ఆయన?"

"మేం యిద్దరం అనుకున్నాం-"

"బహుశా ఈ మూడేళ్ళలోనూ పాస్‌పర్సంటేజ్ పడిపోటానికి కారణం సరయిన సిలబస్‌లేకపోడం. సరిగ్గా టెక్స్‌ట్ బుక్కులు దొరక్కపోవడం, టీచర్లూ, లెక్చరర్లూ సమ్మెవల్ల టైం వృధాకావడం, కొత్త లెక్చరర్ల నియామకం జరగకపోడం- యిలా ఆ కమిటీ రిపోర్టిస్తే ఈ ఏడాది జరిగింది కవరైపోతుందేమో!"

"అయిపోవచ్చు-" విద్యామంత్రి అన్యమనస్కంగా అన్నాడు.

"మూడేళ్ళని పట్టుబట్టాడా ఆయన?"

"మరీ వెనక్కంటే రిపోర్టు ఆలస్యమవుతుందనుకున్నాం"

విద్యామంత్రి గొంతులో విసుగు తొంగిచూసింది.

"మనం పరిపాలనలోకివచ్చి మూడేళ్ళేగదా అయిందీ-"

ఈమాట ముఖ్యమంత్రి అనబోతాడని అతను ముందేగ్రహించాడు. కానీ అతని శరీరమంతా పట్టుతప్పి నీరసం ఆవహిస్తున్నట్లనిపించింది. బలహీనంగా అంగీకరించుతున్నట్లు తల ఊపాడు.

"రిపోర్టుయిచ్చే కమిటీని మీరే నిర్ణయిస్తారా?"

"విద్యార్థులు ఒప్పుకున్నాక గదా!" వదుల్చుకోవాలన్న గొంతులో అన్నాడు. తనలో సంచలనాన్ని ముఖ్యమంత్రితో పంచుకోవాలన్న కోరికను అణుచుకుంటున్నాడు.

ఎదుటివాడు లొంగుతున్న సమయంలో వాడవలసిన గొంతు అదే అన్నట్లు అన్నాడు ముఖ్యమంత్రి.

"పదేళ్ళకు విద్యార్థులని ఒప్పించండి మీరు-"

"మీ అభిప్రాయం అర్థమయింది. పీసీ అమెరికా వెళ్తున్నాడు. అప్పుడు మనం చర్చలు జరుపుదాం-"

"మార్కులు మాత్రం మీరు ఒప్పుకోరు. నేనే ఆ తర్వాత నాలుగో అయిదో అనౌన్స్‌చేస్తాను-"

ముఖ్యమంత్రితో వాదించే ఓపిక నశించి తల ఊపి ఆగదిలోంచి బయటకి నడిచాడు.

అతనికి శరీరమంతా దిగలాగేస్తున్నట్లుంది. మనసంతా దొలిచేస్తున్నట్లుంది. ఎనభైఏళ్ళ వయసు తనది. అరవైఏళ్ళ ప్రజాసేవ తనది. కట్టుకున్న బట్టల్లోనేకాదు లోలోపలనున్న హృదయమూ ఆలోచనలూ కూడా బాపూజీ నిలయాలే! అలాంటి తను భగవంతుడిని ఏం వేడుకున్నాడూ! కనీసం యిద్దరిని చంపమన్నాడు!

అతనికి కన్నీరు వస్తున్నట్లనిపించింది. కాని రావటంలేదు.

అతను తిరిగి భగవంతుడిని తప్పులు క్షమించమని వేడుకుంటూ తన కోరికను మార్చుకున్నాడు.

"ఎట్టి పరిస్థితుల్లోనూ యిద్దరిని మించి చంపకు భగవంతుడా!"

★ ★ ★

ఆ తర్వాత ఏం జరిగింది?

వేణూ ఏమయాడు? వాసూ ఏమయాడు? ఎవరికి ఎవరితో పెళ్ళయింది? ఉద్యమం ఏమయింది?

ఎవరు గెలిచారు? ఎవరు ఓడారు?

ఇలా ఎన్ని ప్రశ్నలయినా వేసుకోవచ్చు.

ఊహాశక్తినిబట్టి, అభిప్రాయాలనుబట్టి, మనస్తత్వాలనుబట్టి, అవసరాలనుబట్టి, జవాబులు కూడా ఎన్నయినా ఎవరికివారే తయారుచేసుకోవచ్చు.

అయిదేళ్ళ తర్వాత ఆ నగరంలో ఓ హత్య జరిగింది.

ఆ హత్య నడిబజార్లో జరిగింది. పట్టపగలు జరిగింది.

జనమంతా కకావికలై పారిపోతూవుంటే ఓ యువకుడిని పదిమంది వేటాడారు. వాళ్ళచేతుల్లో ఆయుధాలున్నాయి. ఆ యువకుడు పరుగెత్తాడు. కాలేజీ గేటుమీదకు ఎగబాకుతున్నాడు. పదిమందీ బాకుల్తో పొడవసాగారు. ఆ యువకుడు చనిపోయాడని నిర్ధారించుకున్నాకనే వాళ్ళు ఆ ప్రదేశాన్ని విడిచిపెట్టారు.

జనం గగ్గోలెత్తిపోయారు.

వాళ్ళకి ఆ యువకుడు బాగా తెలుసు. అతనిపేరు చెబితే వాళ్ళలో అనేకులు హడలెత్తిపోయినవాళ్ళే. సామాన్యమానవుడి నుంచి





హోంమంత్రి స్వరాజ్యపతి వరకూ ఏదో ఒక స్థాయిలో అతనంటే భయపడతారని వాళ్ళుచెప్పుకుంటారు.

ఆ వ్యక్తిపేరు మధు. విద్యార్థినాయకుడంటారు అంతా! కొందరు యువజననాయకుడంటారు.

అయితే అతనిని చంపిందెవరు?

రకరకాల పేర్లు చెప్పుకున్నారు జనం. ఆరాధనతో చెప్పుకున్నారు జనం. అనుమానంతో చెప్పుకున్నారు. భయంభయంగా చెప్పుకున్నారు.

ఆ నగరంలో పురపాలకసంఘానికి చాలా కాలం తర్వాత ఎన్నికలు జరగబోతున్నాయిట. నగరంలో పెరిగిపోతున్న గూండాయిజాన్ని అణచకపోతే అధికారపక్షానికి అవమానం తప్పదట. అది ఓ డిసైడింగ్ ఇష్యూ అయిపోయిందట. పార్టీలు మార్చటం వల్లనో- అధికారంలోని పార్టీలు మారటం వల్లనో- స్వరాజ్యపతి ప్రస్తుతం హోంమంత్రిగా ఉంటున్నాడు. ముఖ్యమంత్రిత్వానికి- క్యూలో ఉన్నాడట. అతను జనాలకు తన కృతనిశ్చయాన్ని వెల్లడించవలసి వచ్చిందట. ప్రజల శాంతిభద్రతలకు పునరంకితం కావాల్సివచ్చిందట. ఫలితంగా అతను అనేకమంది చిల్లరమల్లర గూండాలను అదుపులోకి తీసుకున్నాడట. దాంతో మధు సైనికులు లేని సేనాధిపతి అయినాడట. అతనివల్ల దెబ్బతిన్నవాళ్ళో- అతనిని తమకి కావాల్సినవిధంగా అదుపులోకి ఉంచుకోలేనివాళ్ళో- అదునుజూసారట, దెబ్బతీసారట.

ఆ విధంగా జనంచెప్పుకునే మాటమీద మరుసటిరోజు సాయంత్రం సీతారాం భరద్వాజల మధ్యచిన్న సంభాషణ జరిగింది.

పేపరు చదవటం పూర్తిచేసి అన్నాడు భరద్వాజ-

“- ఈ మధూలవంటివాళ్ళ పుట్టుకకు కారణం. వేణూల సిద్ధాంతాలే సీతారాం!”

సీతారాం అయోమయంగా చూశాడు.

ఆలోచిస్తూ అన్నాడు భరద్వాజ- “హింస- మనిషిని మనిషి చంపటం- గాయపరచటం- అనాదినుంచీ యుద్ధాల పేరిట సాగుతూనే ఉంది. యుద్ధం ద్వారానే అధికృత నిర్ధారించబడేది. అయితే అది సైనికుల మధ్యనే సాగేది. కనీసం ఓ [illegible] కులుండేవారు. వారు ఎక్కడనుంచో తరలివచ్చేవారు. వారి చేతిలో ఆయుధాలుండేవి. కనక వారిని గుర్తుపట్టడానికి వీలుండేది. మతావేశపరులో- సంపదలాశించినవారో- రాజ్యాల పేరిట వంశాలపేరిటా అధికృతని ఆశించిన వారో- జరిపిన దారుణాలివి. మనదేశానికి సంబంధించినంతవరకూ 1857లో ప్రథమ భారత సంగ్రామంలో హిందువులు ముస్లిములూ కలిసి బ్రిటీషువారితో పోరాడారు. తమ పాలన నిరాటంకంగా సాగటానికి వారు నాటిన విభజన బీజాలు క్రమంగా వట వృక్షాలయ్యాయి. రాజకీయ ఆర్థిక నష్టాలకన్నా ముఖ్యమైన నష్టం ఒకటి జరిగిపోయింది. సైనికులకు పరిమితమయిన హింస సామాన్యుడి జీవితంలో ప్రవేశించింది. ఇరుగుపొరుగుల్లో నివశించేవారిలో ఎవరు ఎప్పుడు ఎందుకు దాడిచేస్తారో తెలియని స్థితి. అపనమ్మకం. సామాన్యమానవుడి మానసిక ప్రవృత్తిలో హింస సామాన్యం కావడమే- వారి జీవితంలో భాగం కావడమే- అన్నింటికన్న ఘోరమయిన నష్టం. అయినా హింసకు సోషల్ సాంక్షన్ లభించలేదు. వేణూలవంటి కొందరి తీవ్రప్రభావాలవల్ల అది లభించింది. ఫలితంగా హింస విస్తరించింది. మధులాంటివాళ్ళు తయారవటానికి కారణం అదేనని అభిప్రాయం- మీరేమంటారు?”

సీతారాం వెంటనే మాట్లాడలేదు.

“మానవ స్వభావంలో హింసాప్రవృత్తి పెరిగిందంటారు మీరు” కొంతసేపు ఆగి మళ్ళీ అన్నాడు- “అందుమీద వ్యాఖ్యానించటానికి తగినవాడిని కాను నేను. మీకన్నా ఎక్కువ సందేహాలున్నాయి నాకు. నామటుకు నాకు అయిదేళ్ళ క్రితం నడచిన విద్యార్థి ఉద్యమాన్ని దగ్గరనుంచి పరిశీలించే అవకాశం వచ్చింది. స్వతంత్ర్యోద్యమం గురించి గొప్పగా విన్నవయసువాడిని. నా యీడు వాళ్ళకు చెప్పుకోదగ్గ స్వప్నాలూలేవు. కష్టాలూ లేవు. మా స్నేహితుల మధ్య నెహ్రూపట్ల చాలా ఆరాధన ఉండేది. మమ్మల్ని ఆదర్శాలు ప్రభావితంచేసేవి. మేం ఎదుగుతున్నకొద్దీ మనమల్లో దిగజారుడుతనం పెనుభూతంలా కనిపించసా

గింది. అన్నిట్లా విలువలు పతనమయిపోతు న్నాయనిపించేది. మాస్టర్లకీ పిల్లలకీ మధ్యా అధికారికీ ఉద్యోగులకీ మధ్యా భార్యాభర్తల మధ్యా ప్రతిచోటా ఉండవలసిన సరళత ఏదో తొలగిపోతున్నట్లనిపించేది. మనుషులెందు కింత పాడయిపోతున్నారూ? భయంభయంగా ఆలోచిస్తూ కనిపించిన ప్రతిదీ నా పిల్లలను ధ్వంసం చేస్తుందేమోనని భయం నాలో ఆవహించింది. నా యీడు వాళ్ళు మాటల్లో నాలాగే విలువల పతనానికి బాధపడుతూనే నీతికి తిలోదకాలివ్వటం గమనించినకొద్దీ నన్ను నేనొక ప్రత్యేకవ్యక్తిగా భావించుకునేవాడిని. అయితే యిలా నాలాంటివాళ్లు విలువలు గురించి లోపల పడే మథనానికి బయటి ప్రపంచగమనానికీ సంబంధం ఉన్నట్లు నేనా ఉద్యమాన్ని గమనించాక అర్థంచేసుకున్నాను. నా భయాలూ, నా గొప్పలూ, నా ఆలోచనలూ, ఎంత పరిమితమయినవో నాకు బోధపడింది. వేణుకి నా బిడ్డను వివాహంచేస్తానన్నాను. అతనికీ దానిమీద అంతోయింతో యిష్టముంది. కానీ అతను దానిని తిరస్కరించాడు. నేనెప్పటికీ తెలుసుకోలేని నిజాన్ని చెప్పాడు- అందులోనున్న విలువ ఏమిటో అతనుచేసిన త్యాగం ఏమిటో నేను క్రమంగా గ్రహించాను. లోకంలో నశించిపోతున్న అన్ని విలువలలోనూ ప్రధానమయినది పొరుగువారిపట్ల ఉండాల్సిన బాధ్యత. అది ఆ కుర్రవాడిలో యింకా జీవించి ఉన్నట్లు అనిపించింది. సర్వేజనా సుఖినోభవంతు అన్న సంకల్పంతో తపస్సులుచేసిన అలనాటి మునులకూ- అందుకు ప్రయత్నంచేసే యినాటి యువకులకూ వారే పార్టీకీ, సిద్ధాంతాలకూ చెందనీ- మౌలికంగా తేడాలేదు. నీతిగురించీ విలువల గురించీ బాధపడే నాలాంటివాళ్ళ ఆవేదనకు వేణూలాంటి వాళ్ళ తోనహా అందరూ యివ్వవలసిన ప్రాధాన్యత యివ్వలేదేమో! అయినా నేను త్యాగాలకు స్పందిస్తాను''

సీతారాం మాటలు పూర్తికాకుండానే అన్నాడు భరద్వాజ.

"మతోన్మాదులు చేసేదీ త్యాగమే... దాన్నీ హర్షిస్తారా?''

తీవ్రంగా అన్నా భరద్వాజ వాదనకోసం వాదిస్తున్నట్లనిపించలేదు. విలువల గురించి తానెంత మథనపడుతున్నాడో మానవుడి భవిష్యత్ గురించి అతనూ మథనపడుతున్నాడు. ఆ ప్రశ్న తానూ వేసుకుంటున్నాడు! మనిషిని మనిషి చంపుకోటమే పరిష్కారమార్గమా!

"ఎవరయినా ఎలా హర్షిస్తారు భరద్వాజగారూ! వ్యక్తిగత మానసిక లోపాలవల్ల సాగే హింస- మతకారణాలతో చెలరేగే బలప్రయోగాలూ- అధికారంలోనున్న వ్యవస్థ తనని తాను నిలబెట్టుకునేందుకు జరిగే బలప్రయోగాలూ- వ్యవస్థతో సరిపడని వాళ్ళు సాగించేపోరాటాలూ- ఈ నాలుగు రకాల హింసలూ యీనాడు మనకి కనిపిస్తాయి. మతధర్మాలు చెప్పేవాళ్ళూ, ప్రజాస్వామ్యంపేరిట పాలన సాగించేవాళ్ళూ, సిద్ధాంతాలను ఆయుధాలుగా చేసుకున్నవాళ్ళూ తమ తమ లక్ష్యాలకోసం చేపట్టే విధానాల గురించి భవిష్యత్తుని దృష్టిలో వుంచుకుని ఆలోచించుకోకపోడమే నాకు కనిపిస్తోంది. లక్ష్యమెంతటి ఉదాత్తమయినదయినా విధానం నీచం కారాదనే నా భావన. విధానాలే విలువలని రక్షిస్తాయి. విలువలే సమాజాన్ని రక్షిస్తాయి. ఎవరు చేపట్టిన విధాన్నయినా అది విలువలకెంత వ్యతిరేకమయినా సరే దానిని స్వంతంచేసుకుని మెరుగులు దిద్ది తమ అధికారాలకోసం కీచులాటలకోసం పాలకవర్గాలు నిస్సంకోచంగా నిర్లజ్జగా వాడుకోవటంకన్నా పతనం మరేమున్నది? ఇది నాకు ఎనలేని దుఃఖం కలిగిస్తోంది. కోపం తెప్పిస్తోంది. నాకు కలిగే సందేహాలతో నేను ఎక్కడున్నవాడిని అక్కడ ఆగిపోకుండా చేస్తోంది''

సీతారాం టైం చూసుకున్నాడు.

"-వస్తాను భరద్వాజగారూ!''

"ఎక్కడికీ?''

"నిజనిర్ధారక కమిటీవాళ్ళ సమావేశం ఉంది'' అంటూ లేచాడు.

"పదండి నేనూ వస్తాను''- అంటూ భరద్వాజ బయలుదేరాడు.

అందులో ఒకరిది యోచించే మేధస్సు.

ఒకరిది స్పందించే మనసు.

ఆ రెండూ కలిసి జరుగుతున్నదానిని తెలుసుకోటానికి ప్రయత్నంచేస్తే-??''







# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్టు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికీ రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా పథకంలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు పైకం అందలేదని, అడ్రసు మారిందని రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకావు.

---------- కూపన్ ----------

**జనవరి 'చతుర' నవల ఉద్యమం**

సమీక్షకుని పేరు : ..............................................

చిరునామా : ..............................................

..............................................

..............................................

..............................................

# చతుర ప్రపంచం

## బుల్లి విలేకరులు

అది న్యూయార్కు నగరంలోని గ్రీన్‌విచ్ ప్రాంతంలోని 'చిల్డ్రన్ ఎక్స్‌ప్రెస్' పత్రికకు చెందిన సమాలోచనా మందిరం. ఆ పత్రికకు చెందిన ముగ్గురు విలేకరులు, ఒక సహాయ సంపాదకుడు గాఢంగా చర్చిస్తున్నారు. ఆ మర్నాటి చిల్డ్రన్ ఎక్స్‌ప్రెస్‌లో 'నేషనల్ కౌ



న్సిల్ ఆఫ్ ఆల్కహాలిజం' సంస్థ డైరెక్టర్ డాక్టర్ టోమ్ సిసిల్‌గారి ఇంటర్వ్యూ ప్రచురితంకావలసివుంది. విషయం అతిప్రాముఖ్యంగలిగినది గనక ముందుగానే ఆ సిబ్బంది తగిన సమాలోచనలు జరుపుతున్నారు. ఆ ముగ్గురి విలేకరుల పుస్తకాల్లో అడిగిన ప్రశ్నలు చాలావున్నాయి. ఆల్కహాలిజమ్ కౌన్సిల్ టీవీలో అనేకమైన ప్రకటనలు చేస్తోంది. ఆ ప్రకటనల్లోని స్వారస్యాన్ని గురించి అనేకమైన ప్రశ్నల్ని ఆ సంస్థ డైరెక్టర్ని అడిగారు. వాటిలో ఏయే ప్రశ్నల్ని ప్రచురించాలి? మరో ముఖ్యమైన ప్రశ్నకూడా వుంది. మానవునికి గలిగే అనిష్టాలలో మద్యపానానికే మొదటిస్థానమా? లేక ఇటీవల మత్తుమందుల వాడకం పెరుగుతోందిగనక ఆ స్థానాన్ని మాదకద్రవ్యాలు ఆక్రమిస్తున్నాయా? ఇలాంటివే అనేకమైన ముఖ్య ప్రశ్నలు, డైరెక్టర్ సమాధానాలు ఆ పత్రిక సిబ్బంది ముందున్నాయి. వాటిని పత్రికలో ప్రచురించేటప్పుడు ఏ విధానంలో వుండాలనేది వారు దీర్ఘంగా చర్చిస్తున్నారు. ఇంతకీ ఆ ముగ్గురి విలేకరుల వయసెంతో తెలుసా? కేవలం పది సంవత్సరాలే!

12 సంవత్సరాల క్రితం 'పిల్లలనుండి అందరికోసం' అనే లక్ష్యవాక్యంతో చిల్డ్రన్ ఎక్స్‌ప్రెస్‌ను ప్రారంభించారు. ఈ పత్రికలోని పిల్లల రచనల్ని అమెరికా, న్యూజీలాండ్, ఆస్ట్రేలియా మొదలైన దేశాల్లో మొత్తం 30 పత్రికల్లో ప్రచురించాలని అప్పుడే ధ్యేయంగా పెట్టుకున్నారు. పిల్లలు, యువజనుల దృక్కోణాలకు అనుగుణంగా అన్ని సమస్యల్ని విశ్లేషించే ప్రయత్నం చేస్తున్నారు. చిల్డ్రన్ ఎక్స్‌ప్రెస్ న్యూయార్కు ఆఫీసులోనే ఇప్పుడు 200 మంది బాల విలేకరులున్నారు. వారందరూ 8-13 సంవత్సరాల మధ్య వయసువారే. వీరిలో ఏ ముగ్గురో లేక నలుగురో విలేకరులు ఒక సహాయసంపాదకుడితో కలిసి నిర్దిష్టమైన విషయాన్ని చేపడతారు. వీరు ముందుగా ఇంటర్వ్యూలను టేప్ చేస్తారు. తర్వాత పెద్దవాళ్ళు దాన్ని టైపుచేస్తారు. ఆ తర్వాత బాలసహాయక సంపాదకుడు, పెద్దసంపాదకుడు కలిసి వాటి నుండి ముఖ్యమైన భాగాలను ఎన్నుకొని ఇంటర్వ్యూలను ప్రచురణకు సిద్ధంచేస్తారు.

పిల్లలచే నడిపే పత్రికే అయినా చిల్డ్రన్ ఎక్స్‌ప్రెస్ విషయ వైవిధ్యంతో అలరారుతుంటుంది. ఈ బుల్లి విలేకరుల బృందం నగరమేయర్‌ను, అధ్యక్షపదవికి పోటీచేస్తున్న అభ్యర్థుల్ని ఇంటర్వ్యూచేసింది. చెర్నోబిల్ దురంతం, కంబోడియన్ నిరాశ్రితుల క్యాంప్‌లను గురించి వ్యాసాలను ప్రచురించింది. పిల్ల





ల్ని తిట్టటం, జైళ్ళలోని పిల్లల క్లిష్ట సమస్యల్నీ చేపట్టింది. న్యూయార్కులోనే హార్లెవర్‌లో ఒక బ్యూరోను స్థాపించి స్పానిష్ ప్రెస్‌కోసం స్పానిష్ భాషలోనే రచనల్ని తయారుచేసింది.

చిల్డ్రన్ ఎక్స్‌ప్రెస్ సీనియర్ ఎడిటర్ పదిహేడు సంవత్సరాల రెబకా వాల్కోవిట్జ్ అనే హైస్కూల్ విద్యార్థిని. ఆమె ఇప్పుడు అమెరికా ఎన్నికల్ని కవర్‌చేసే ఉత్సాహంలో వుంది. మార్గరెట్ థాచర్, డివిస్ హిలే వంటి రాజకీయ ప్రముఖులతో ఇంటర్వ్యూలను నడవటానికి కూడా ఒక ప్రణాళికను సిద్ధంచేసింది. పది సంవత్సరాల లారెల్ అనే అమ్మాయి అమెరికా మాజీ అధ్యక్షుడు జిమ్మీ కార్టర్‌ను ఇంటర్వ్యూ చేసింది. ఈ అమ్మడికి టీవీలో కన్పించటం థ్రిల్లింగ్‌గా వుంటుందిట. ఇకముందు కూడా విలేకరిగా కొనసాగటమా లేక వేరే ఉద్యోగంలో చేరిపోవటమా అనే విషయం ఇంకా ఈమె నిర్ణయించుకోలేదట. ప్రస్తుతం చిల్డ్రన్ ఎక్స్‌ప్రెస్‌లో పనిచేస్తున్న ఈ బాల విలేకరులు యుక్తవయస్కులైన తర్వాత బహుశ వేరువేరు మార్గాల్ని వెతుక్కోవచ్చు. ఏ మార్గం వెదుక్కున్నా వారికి ప్రశ్నలడిగే కళమాత్రం తప్పక సిద్ధిస్తుంది.

## జనాభా కావాలి

సింగపూర్‌లో రానురాను జనాభా సంఖ్య క్షీణిస్తోంది. గత సంవత్సరం అక్కడ 56 వేల మంది పిల్లలు పుడతారని అంచనా వేయగా, 42 వేలమందే పుట్టారు. సాంప్రదాయకంగా బహు భార్యత్వం ఉన్న దేశాలలో జనాభా గురించి పట్టింపేమీ లేదు. ఈ అభిప్రాయాన్ని సమర్థిస్తూ సీనియరు మంత్రి సిన్నతంబి రాజరత్నం "ఎక్కువగా భార్యలుండాలనుకునే వారిని ఎవరాపగలరు? చట్టరీత్యా ఉన్న భార్య కాక ఉపపత్నులు సంసారులకుండడంలేదా?" అన్నారు.

కాని పార్లమెంటు మెంబరు, యూనివర్సిటీలో సోషియాలజీ లెక్చరరు అలీన్‌వాంగ్ "కేవలం ఇదే మార్గంకాదు. ఈ పద్ధతి ప్రత్యేకంగా స్త్రీల భావాల్లో అలజడి రేకెత్తిస్తుంది" అంటూ విమర్శించింది.

రెండు దశాబ్దాలుగా "ఇద్దరు పిల్లలు చాలు" అన్న నినాదాన్ని ప్రతిధ్వనింపజేసిన మీదట ప్రస్తుతం "లీ" ఆధ్వర్యంలోని ప్రభుత్వం ఎక్కువగా పిల్లల్ని కనగలిగిన దంపతులని



ప్రోత్సహిస్తోంది. జనాభా లెక్కల ప్రకారం, బాగా చదువుకుని, సంపాదనాపరులై పిల్లల్ని చక్కగా పోషించగలిగే స్థోమత ఉన్నవాళ్ళే తక్కువగా పిల్లల్ని కంటున్నారు. గ్రాడ్యుయేట్లయిన మగాళ్లు తమకంటే విద్యాధికులయిన యువతులను చేసుకోరు. ఇక తగిన మనువులు దొరక్క అమ్మాయిలు అవివాహితలుగా ఉండిపోతున్నారు.

దేశం జనాభా కొరతని ఎదుర్కొంటున్న ఈ తరుణంలో తమకంటే తక్కువస్థాయి ఆడపిల్లల్ని చేసుకుని పెత్తనం చలాయించాలనుకుంటున్న అబ్బాయిలనీ, తమకంటే ఉన్నతమైన యువకుడిని పెళ్లాడి ఆర్థికంగా, హాయిగా, సురక్షితంగా ఉండాలనుకునే యువతులనీ సింగపూర్ ప్రధాని..."లీ కువాన్ యూ" విమర్శించారు. "యువతుల భావాలు మారాలి. ఇప్పుడు ఎక్కువ భార్యలను పోషించడమంటే అలనాటి అగ్రేరియన్ సమాజం కాదు అది యువకులు గ్రహించాలి. పూర్వం మేధావులు, వ్యాపారవేత్తలు, భూస్వాములు బహుభార్యల సంసారభారాన్ని స్వీకరించడంవల్లే సమాజంలో అంతగా కృతకృత్యులు కాలేని బడుగులు బలహీనులయిన మగవాళ్ళు యధాతథంగా విలీనమైపోయారో"ని ప్రధాని లీ వ్యక్తం చేశారు. "మాజీ జపాన్ ప్రధాని 'తనాకా' తనకు భార్యకాక ఓ ఉపపత్ని, ఆమెకు పిల్లలున్న విషయం రహస్యంగా ఉంచలేదని, అలాంటి 'తనాకా'లుంటే జపాను సమాజానికి పురోభివృద్ధి ఉండడంలో సందేహం లేద"ని అంటూ, "ఒకప్పుడు తప్పుగా నిర్దేశించిన ఏకపత్నీవ్రతం ఇప్పటి పరిస్థితుల్లో సవరించడం కష్టమ"ని ఒప్పుకున్నారు.

మరో ప్రత్యామ్నాయం ప్రస్తుతం కొంత మంది పాశ్చాత్య యువతులు అవలంబిస్తున్న "సింగిల్ పేరెంట్ ఫామిలీలు", "ఇంట్లో పిల్లలు, తల్లి మాత్రమే ఉండే ఈ సంసారాలను మీరు ఆహ్వానిస్తున్నారా?" అన్న ప్రశ్నకు "ఆ ఆలోచనే బాధగా ఉంది. కానీ ఇప్పటి పరిస్థితిని ఎదుర్కోలేనపుడు తరువాత తప్పనిసరి మెట్టు అదేనేమో?" అంటారు ప్రధాని 'లీ'.

## ఇంటికన్నా...

పశ్చిమజర్మనీకి చెందిన ఓ ఇంజనీరుగార్ని పన్నులు ఎగవేశాడన్న ఆరోపణపై జైల్లో వేశారట. 17 నెలలు జైల్లో గడిపాక ఆయన జైలుజీవితంపైన ఎనలేని మక్కువ పెంచుకున్నాడట. ఫలితంగా తన విడుదలకు ప్రయత్నించవద్దనీ తనకు జైలులోనే హాయిగా ఉందనీ తన తరపున వాదిస్తున్న లాయరుకు ఆజ్ఞలు జారీచేశాడట. అప్పటిదాకా మైక్రో ఎలక్ట్రానిక్స్‌లో బయటతను చేస్తున్న పరిశోధన జైల్లోకూడా ఏ ఆటంకములేకుండా ముఖ్యంగా ఫోనుకాల్స్‌వల్ల చీటికిమాటికీ ఏర్పడే అంతరాయం కూడా లేకుండా సజావుగా సాగుతుండడంవల్ల తానీ నిర్ణయం తీసుకున్నట్టు చెప్పాడట.

# చతుర కతలు

## తెలివి

సిటీ బస్సు ఎక్కానుగానీ అది చాలా రద్దీగా ఉంది. కండక్టర్‌లోనికి కుక్కేస్తున్నాడు జనాన్ని.

'టికెట్ ప్లీజ్... టికెట్ ప్లీజ్-' అంటూ చిన్న ఖాళీలోంచే జనాన్ని ఈదుకుంటూ తిరుగుతున్నాడు కండక్టరు.

"ఊపిరాట్టంలేదు! ఇంక ఎవర్నీ ఎక్కించకండి" అన్నాడొకాయన.

"ఛఛ... ఏం సిటీబస్సులో ఎప్పుడూ ఒకటే రద్దీ!" ఇంకొకరన్నారు.

"మరిద్దర్ని ఎక్కిస్తే ఊపిరాడక చచ్చేటట్టున్నాం" మరొకాయన.

"మాష్టారూ! కొంచెం సర్దుకుంటారా?!"

"ఏంటయ్యా సర్దుకునేది... ఇప్పటికే చస్తుంటేను"

"ఏంటండీ! సర్దుకోకపోతే ఎలా?"

"ఏఁవండీ కండక్టరుగారూ!అదేపనిగా ఎక్కిస్తున్నారు, మరేస్టాపు దగ్గరా ఆపకండి!" అన్నాన్నేను విసుగెత్తి.

"ఇష్టమైతే ఉండండి, కష్టమైతే దిగిపోండి" అన్నాడు తను ఇంకా విసుగ్గా.

"అయితే ఆపండి దిగిపోతాను"

"దిగండి"

"మరి డబ్బులో!"

"....."

"డబ్బులివ్వండి!" రెట్టించాను.

"ఇదుగోండి!" అంటూ రూపాయి చేతిలోపెట్టాడు కండక్టరు.

విజయగర్వంతో చూసానతన్నీ, బస్సులోవాళ్లనీ.

బస్సు ఆగింది.

హుషారుగా ఈల వేసుకుంటూ దిగాను. పాన్‌షాప్ దగ్గరకెళ్ళి ఒక 'గోల్డ్‌స్పాట్' ఇమ్మన్నాను.

నాకు చాలా ఆనందంగా ఉంది. నా తెలివికి నేనే నంబరపడిపోతున్నాను. ఎందుకంటే నేదిగవలసింది ఆ స్టాపే, రూపాయి మిగిలింది; కొట్టువాడు 'గోల్డ్‌స్పాట్' ఇచ్చాడు.

తాగేశాను.

డబ్బులకోసం జేబులో చేయిపెట్టాను.

రూపాయే ఉంది.



"ఇదేంటి?! పది రూపాయలకి రూపాయే ఉంది?" అని మనసులో అనుకున్నాను. అప్పుడు గుర్తొచ్చింది. చిల్లరలేక కండక్టరు మిగిలిన తొమ్మిది రూపాయలు దిగినప్పుడు ఇస్తానన్నాడు. టికెట్‌మీద రాసిచ్చాడుకూడా.

అంతే... నా ముఖంలో కత్తివేటుకి నెత్తురు చుక్కలేదని ఎదురుగా పాన్‌షాప్ అద్దం సాక్ష్యం చెబుతోంది.

—కొండపల్లి జయరామ్



# హోంవర్క్

ఉదయం లేచి లేవడంతోనే పేపరుకోసం చూసేడు కోదండం. పేపరు రాలేదింకా.. చిరాకూ - కోపం ఒకేసారి చుట్టుముట్టేయి కోదండాన్ని.

'ఛి..ఛీ.. ఈ పేపరువాళ్ళంతా యింతే.. సమయానికి రాని పేపరు అనవసరం..'

మనస్సులో యిలా గొణుక్కుంటున్న కోదండాన్ని పలకరించినట్లుగా కిటికీలోంచి రివ్వునవచ్చి ఎగిరిపడింది ఆరోజు పేపరు.



ఆత్రంగా దాన్ని అందుకుని యిలా తెరిచేడో లేదో తలుపులు తీసుకుని వరిగెత్తుకుని వచ్చింది పక్కింటి రామనాథంగారి ఏకైక కూతురు పదేళ్ళ శాంతి.

"అంకుల్... పేపరోసారిస్తారా? హోమ్‌వర్క్ చేసుకుని యిచ్చేస్తాను"ముద్దుగా అడిగింది ఆ పిల్ల.

మహామంటగా వుంది కోదండానికి. 'వెధవ పేపరు.. వెధవ మనుషులు . యింకా ఒక్క అక్షరం కూడ చదవలేదు. అప్పుడే పేపరు కోసం తయ్యార్?!!'

ఉక్రోషంతో మూలిగింది కోదండం మనస్సు.

'హోంవర్క్ అంటున్నావ్? పేపరుతో హోంవర్కేంటి?' కటువుగా ప్రశ్నించాడు.

'ఈమధ్య మా క్లాసుటీచరు ఈ రకం హోంవర్కు రోజూ చేయిస్తున్నారు. పేపర్లోని మెయిన్ హెడ్డింగులు రాసి చూపించాలి రోజూ.. రాయకపోతే ఫైనుగా రూపాయి వసూలు చేస్తారు..'

ఆ పిల్ల ముఖంలో భయం కనిపిస్తూండటంతో ఓ క్షణంపాటు జాలిపడ్డాడు కోదండం.

మళ్ళీ వెంటనే అతన్లో కోపం ప్రవేశించింది.

'రోజూ ఈ రకం హోంవర్కున్నప్పుడు మీ డాడీని పేపరు కొనమని అడగొచ్చుకదా! అమాత్రం దానికి యిరుగు పొరుగువారిని పేపరు చదవకుండా బాధపెట్టడం ఎందుకు?' కోపంగా అడిగేడు కోదండం.

ఆపిల్ల ఏడుపు ముఖం పెట్టింది.

'అసలీసంగతి గురించి మీ క్లాసు టీచరుతో నేను మాట్లాడతాను. చిన్న క్లాసుపిల్లలకి ఈరకం హోంవర్కు పెట్టడం ఏం బావుంది?'

ఆపిల్ల భయంగా చూసింది కోదండాన్ని.

'అంకుల్.. మాక్లాసు టీచర్ని అడగవద్దు అంకుల్' అంది భయంగా.

'ఏం? మరైతే ఎవర్నడగాలి?'

'మా డాడీని' చటాల్న అంది ఆపిల్ల.

ఆశ్చర్యపోయేడు కోదండం.

'ఎందుకు.. మీ డాడీని ఎందుకడగాలి? రోజూ పేపరు కొననందుకా?'

'అదొక్కటే కాదంకుల్..'

'మరి...'

'మా స్కూలుకు ప్రిన్సిపాల్ కూడ మా డాడీయేకదా! ఈ పద్ధతిని పెట్టిందికూడా ఆయనేనని చెప్పేరు మాటీచరు'

ఆగిపోయిందాపిల్ల.

ఈసారి నిజంగా మతిపోయింది కోదండానికి.

—యం.ఉమామహేశ్వరరావు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444. Madras 470434, Vijayawada 52685, Visakhapatnam [illegible], Tirupati 5291.

